# బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిని

డా. కంభంపాటి గోపాలకృష్ణమూర్తి



పరవస్తు చిన్నయసూరి

# వ్యాకరణగుప్తార్థప్రకాశిని


తర్కాచార్య. భాషాప్రవీణ.

భంపాట రామగోపాలకృష్ణమూర్తి


1928




క్వాలిటీ పబ్లిషర్స్

రామమందిరం వీధి • విజయవాడ 2

క్వాలిటీ ప్రచురణ :

ప్రథమ ముద్రణ :

నవంబర్ 90



వెల : రు. 30.00



పరిచరణకర్త :

కప్పగంతుల మురళీకృష్ణ

ముద్రణ :

మూర్తి ఆర్ట్ ప్రింటర్స్

విజయవాడ-2

# పీఠిక

శాస్త్రములలోకెల్ల వ్యాకరణ మెంతముఖ్యమో, అంత కష్టము నన్న సంగతి యెల్లరకుఁ దెలిసినదే. దానిని సులభము చేయుటకే సూరి "బాల వ్యాకరణము"ను వ్రాసినాఁడు. అది పేరునకు "బాలవ్యాకరణము"గాని ప్రౌఢముగనే యున్నది. దాని నిప్పటికిఁ దగినట్లు సులభము చేయుటకే యీ వివరణము వ్రాసితిని.

తొలిగా నన్నయ భట్టారకుఁడు "ఆంధ్రశబ్ద చింతామణి"యను తెనుఁగు వ్యాకరణమును సంస్కృత భాషలో వ్రాసెను. దానికి వృత్తిగా అథర్వణాచార్యులు "అథర్వణ కారికావళి"ని వ్రాసెను. ఈ రెంటినిఁ గలిపి యహోబల పండితుడు "అహోబల పండితీయ"మను పెద్దవ్యాఖ్యానమును వ్రాసెను. పైమూఁడును సంస్కృతముననే యుండుటచే సూరి తెనుఁగున వ్యాకరణ సూత్రముల రచియించెను. అదేకాలమున శిష్టుకృష్ణమూర్తి శాస్త్రి గారు "హరి కారికలు" వ్రాసిరి. హరికారికలు సంస్కృతమున, బాలవ్యాకరణము తెనుఁగుననున్నను, నొకదాని నొకటి పోలియుండుటచే ననువాదము లని కొందఱి తలంపు. కాని, ఏది మూలమో, ఏది యనువాదమో యను విషయము వివాదగ్రస్తమైనది. దాని విషయమిటఁ బ్రస్తావించను. నేఁజెప్పఁ దలచిన దొక్కటే సత్యము — సూరి వ్రాసినను, శాస్త్రిగారు వ్రాసినను నన్నయాదుల వ్యాకరణములమూలముననే కాన వానినిఁగూడ దిలకించుచు నన్నిఁటి నొకే దృష్టితోఁ (ఏకకాలీనత్వేన) జూచినచోఁ జదువరులకే యది తేటపడుటయేకాక సులభమగును. ఆ దృష్టితోనే. నేను చింతామణి హరికారికలు, బాలవ్యాకరణములను వరుసగా నిచ్చితిని. బాల వ్యాకరణ సూత్రములనే వరుసకో ననుసరించితిని.

విద్యార్థుల కొఱకు హితవు — విద్యార్థులు బాలవ్యాకరణ సూత్రములను వివరణమును జదువుకొన్నఁజాలును. యూనివర్సిటీ పరీక్షలకుపయుక్తముగా సంతరించినందున. హెచ్చుగా నెంతయున్నను, వారికిఁ గావలసిన దానిలో లోపములేదు. కనుక నధికోపయోగము నిచ్చునని మనవి చేయుచున్నాను తక్కినవి తద్‌జ్ఞులైన విజ్ఞులకని వేఱు చెప్పఁబనిలేదుగదా. సహృదయులిద్దాని సరసముగా గ్రహింపఁగోరెద.

విజయవాడ<br>
11-11-90

ఇట్లు<br>
**వ్యాఖ్యాత**



# శ్రీ పరవస్తు చిన్నయసూరి

19వ శతాబ్ది తొలి సంవత్సరాలలో అనగా 1809లో పుట్టి 19వ శతాబ్ది ద్వితీయార్థపు తొలి సంవత్సరాలలో అనగా 1862లో పరమపదిం చిన శ్రీ పరవస్తు చిన్నయసూరి కేవలం 53 సంవత్సరాలే జీవించాడు.

శ్రీ పరవస్తు చిన్నయసూరి చాత్తాద శ్రీవైష్ణవుడు. (సాతాని) ఉత్తరదేశం నుండి వచ్చి స్థిరపడిన కుటుంబం. శ్రీ పరవస్తు అనునది బ్రాహ్మణులవలె ఒక మతము. సూరి అనునదీయన బిరుదము. సూరి అంటే పండితుడు. వీరిది గార్గేయస గోత్రము. ఆపస్తంభసూత్రుడు, యజుశ్శాఖీయుడు. వీరి తండ్రి శ్రీ వేంకటరంగ రామానుజాచార్యులు. మంచి పండితుడేగాక, శ్రీ వైష్ణవమత ప్రచారకుడు. ఆయన ఉభయ వేదాంతి. అనర్గళముగా భగవద్భక్తిని గురించి తిరువళిక్కేణిలోని రామా నుజ కూటములో ఉపన్యాసలిస్తుండేవాడు.

ఓసారి వీరి ఉపన్యాసము విన్న ప్రతివాది భయంకర శ్రీనివాసా చార్యులుగారు వీరిని త్రిమతాచార్యులలో మధ్యముడు విశిష్టాద్వైతమత స్థాపకుడు అయిన శ్రీ రామానుజాచార్యులవారి జన్మస్థలమైన పెరంబుదూరు నకు తీసుకుని వెళ్ళి అక్కడి వైష్ణవాలయంలో పూజారిగా నియమించి నిత్యము ఆ దేవాలయంలో ద్రావిడ దివ్యప్రబంధాలను దేవతాసముఖ్యమున పారాయణ చేయునట్లు ఏర్పాటు చేశాడు.

అక్కడీయన వాగ్ధాటికి, పాండితీ ప్రకర్షకు అచ్చెరువొంది భక్తన గణం వైష్ణవం పుచ్చుకుని అసంఖ్యాకంగా శిష్యులైనారు.

శ్రీరంగ రామానుజాచార్యులు ద్రావిడ వేదాంతమందేగాక ఆంధ్ర సంస్కృతములలో గూడా కడు సమర్థులౌట వలన అనతికాలములోనే ఆయన ఖ్యాతి ఆ చుట్టుప్రక్కల వ్యాపించినది.

అప్పటికింకా ఆచార్యులవారికి చిన్నయసూరి పుట్టి వుండలేదు. ఒకే ఒక్క కుమార్తె. ఆమెకు వైధవ్యం ప్రాప్తించుట వలన శ్రేయోభిలాషి శ్రీనివాసాచార్యులగారి సలహాతో శ్రీరంగ రామానుజాచార్యుల దంపతులు

పుత్రకామేష్టియాగం చేసి యజ్ఞపాయసం (అన్నం, పాలు, పంచదార, తేనె మిశ్రితం) త్రాగారు.

ఫలితంగా చిన్నయ పుట్టాడు. ఆయనకు కుడికంటిలో పుట్టుమచ్చ వుండుటవలన మహనీయుడవుతాడని పలువురు భావించారు. చిన్నయ్యకు 18 సంవత్సరాలు వచ్చినా అక్షరం ముక్కరాలేదు.

ఆకతాయిగా తిరుగుతూ తల్లివెంట పేరంటాళ్ళకు వెళ్లి పాటలు పాడుతుండేవాడు. ఎట్టకేలకు చిన్నయ్య తండ్రి స్నేహితుడైన రామానుజాచార్యులవద్ద విద్య నేర్చుకొనుటకు కుదిరాడు. బాలరామాయణం, ఆంధ్ర నామసంగ్రహం అమరకోశం చదువుకున్నాడు.

అప్పటికే యుక్తవయస్సు రావడంవలన బ్రిటీషు తూర్పు ఇండియా కంపెనీలో శ్రీ గాజుల లక్ష్మీనరసింహులుశెట్టిగారి సిఫారసుతో స్కూలులో పండితునిగా ఉద్యోగంలో చేరాడు.

ఓవైపు ఉద్యోగం చేస్తూ శ్రీ కంచి రామానుజాచార్యులవారివద్ద తర్క, మీమాంస, అలంకార శాస్త్రములను, శ్రీ చదలవాడ శ్రీరామశాస్త్రి గారి వద్ద యజుర్వేదము, యజుర్వేదభాష్యము, ఇంకా ప్రాకృతాంధ్ర, తమిళ సంస్కృతములలో అఖండ పాండిత్యము సంపాదించి హయగ్రీవోపాసనాపరుడై దీర్ఘకాలధ్యానము వలన ఉత్తమ పండితుడైనాడు.

ఆ వెంటనే నన్నయ భట్టారకుల ఆంధ్రశబ్ద చింతామణి, అధర్వణ కారికలు, అప్పకవీయములను, పిదప నన్నయ్య తిక్కనల మహాభారతాన్ని విమర్శనతో చదువుటవలన బాలవ్యాకరణమును వ్రాయగలిగాడనిఅంటారు.

1858లో బాలవ్యాకరణము వ్రాయుటకు పూర్వమే యీయన 1853లో సంజ్ఞ, సంధి శబ్ద క్రియ ప్రకీర్ణ పరిచ్ఛేదములున్న శబ్ద లక్షణ సంగ్రహము 670 సూత్రములతో రచించి కృతజ్ఞతగా గాజుల లక్ష్మీనరసింహులు శెట్టిగారి కంకితము చేశాడు. ఆ తరువాత తత్సమ తద్భవ పరిచ్ఛేదములుగల ఆంధ్రభాషానుశాసనమును 1853లోనే నీతిచంద్రికను రచించి అప్పటి డైరక్టరుగానున్న అర్బత్‌నాట్‌కు అంకితం చేశాడు.

ఇక వ్యాకరణాన్ని ప్రఖ్యాత పండితకవి శ్రీ వేదము వట్టాభిరామ శాస్త్రిగారు పద్యములలో వ్రాసిన 'పట్టాభిరామ పండితీయ'మను వ్యాకరణ మును ఆధారముగా చేసుకుని రచించినాడని శ్రీవావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రులు గారు వారి నీతిచంద్రిక పీఠికలో వ్రాశారు.

ఆ తరువాత చిన్నయసూరి దృష్టి నిఘంటువుమీదకు మళ్ళినది. తెలుగులో ఒక్క నిఘంటువు కూడా లేకపోయెనే అని ఆయన అంత వరకూ పద్యాలలోనున్న నిఘంటువులను పరిశీలించడం ప్రారంభించాడు. అప్పటికి తెలుగులో వున్న పద్య నిఘంటువులివి.

1) పైడిపాటి లక్ష్మణకవి ఆంధ్రనామ సంగ్రహము, 2) అడిదము సూరకవి ఆంధ్ర నామ శేషము 3) కవి చౌడప్పవిసీనములు, 4) గణప వరపు వెంకటేశకవి వెంకటేశ ఆంధ్రము, 5) కస్తూరి రంగకవి సాంబ నిఘంటువు, 6) కోటి వేంకనార్యునిఆంధ్రభాషార్ణవము(ఆంధ్ర అమరము) కాగా, ఆ శతాబ్దిలోని నుదురుపాటి సుబ్రహ్మణ్యము మామిడి వెంకయ్య 1816లో వ్రాసిన 'ఆంధ్రదీపిక' అనే నిఘంటువును 1848లో అచ్చు వేశాడు. ఇక 1821లో ఎ.డి. క్యాంబెల్ ఆంధ్రాంగ్ల నిఘంటువును, 1862లో ఛార్లెస్ ఫిలిప్‌బ్రౌను మరియొక ఆంధ్రాంగ్ల నిఘంటువుమ ప్రచురించారు.

కానీ నిఘంటువు ప్రారంభములోనే 1862లో శ్రీ సూరి మృతి చెందాడు.

అక్షర గుచ్ఛము, ధాతుమాల, విభక్తి బోధిని వ్రాసి తెలుగులో వచన భారతాన్ని వ్రాయాలని సంకల్పించి, పచ్చయప్ప కళాశాల సంస్కృ తాంధ్ర పండితుడగు శ్రీ వైయాకరణం రామానుజాచార్యులవారితో కలిసి ఆది సభాపర్వాలు పూర్తిచేసి తిరుపతి వేంకటేశ్వరుని కంకితము చేసి అచ్చువేశారు. అంతే!

శ్రీ సూరి నిఘంటువు, వచన భారతము ఆగిపోయినవి.

శ్రీ సూరి కొన్ని రచనలు బ్రిటన్‌లోని వస్తుప్రదర్శనశాల (మ్యూజి యముతో ఉన్నవి).

ఈయనను ఆ రోజుల్లోని ప్రముఖులైన మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వెంకటరత్నము, శ్రీ కందుకూరి వీరేశలింగము, హైందవ వేదాంతోన్నత పాఠశాల స్థాపకులు శ్రీ ఆర్. శివశంకర పాండ్యాజీలు ఆధునికాంధ్ర గద్య నిర్మాతగా పరిగణించారు.

1860లో మద్రాసు పాఠ్యపుస్తక నిర్ణయ సంఘానికి, భాషా సమితికి అధ్యక్షుడిగా పనిచేశాడు శ్రీసూరి.

ఇక చిన్నయసూరి జీవితంలో తరచు కలుసుకునే ఆప్తమిత్రులు శ్రీ వావిళ్ళ రామస్వామిశాస్త్రి, శ్రీ పురాణం హయగ్రీవశాస్త్రి (రాజధాని కళాశాల సంస్కృత పండితుడు), శ్రీ చదలవాడ శ్రీరామశాస్త్రిలు, వారబ్బాయి-సీతారామశాస్త్రిలు తండియార్ పేటలోని వావిళ్ళ వారింట ప్రతి ఆదివారము సమావేశమయ్యేవారు.

ప్రాచీన యుగమున ప్రథమ వ్యాకరణకర్తగా నన్నయ భట్టారకుడు, ఆధునిక యుగమున వ్యాకరణ నిర్మాతగా శ్రీ చిన్నయసూరిలు పుట్టి యుండకపోతే తెలుగుభాష స్థితిగతులెలా ఉండేవో వూహించలేని విషయము. అందుకే కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చిన సీతారామశాస్త్రిగారు ఆంధ్ర యూనివర్సిటీవారు ప్రచురించిన ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వమను గ్రంథములో చిన్నయసూరి బాలవ్యాకరణము వ్రాయనిచో ప్రాచీన వాఙ్మయ మరుగంటిపోయి యుండెడిది అని వ్రాశారు.

ఈయన బాలవ్యాకరణాన్ని, నీతిచంద్రికలను పెక్కు సంవత్సరాలు పాఠ్య గ్రంథాలుగా ఆ రోజుల్లో పెట్టారు.

—0—

శ్రీ

# ఆంధ్రశబ్దచింతామణి

## (శ్రీ నన్నయభట్ట ప్రణీతము)

**విశ్వశ్రేయః కావ్యం, తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ ।**
**సా వాగ్యా రసవృత్తిః సాధ్యో హి రసో**
**యథాతథం కవిభిః ॥౧॥**

తా॥ విశ్వమునకు శ్రేయస్కరమైనదే కావ్యము. అది దోషవర్జితములై, అలంకారయుక్తములైన వాగర్థ స్వరూపము. రసము నుత్పాదింపనదియే శబ్దము. కవులచే రసము తగురీతిగా సాధింపదగినది.

**స్వస్థాన వేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః ॥**
**లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ ॥౨॥**

తా. లోకములో రసలోభముకల్గిన పండితులు స్వస్థానమందలి వేష భాషలపై నభిమానము కల్గినవారై, అన్యదేశ్య భాషాకావ్యములను వదలి, స్వభాషా కావ్యముల నాదరింతురు.

**సిద్ధి ర్లోకా ద్దృశ్యా లోకోఽనన్యో దృశశ్చ నిత్యశ్చ ।**
**అనియమా ద్గ్రామ్యం హి యత్త్వప భ్రంశః ॥౩॥**

తా. ఆంధ్రశబ్ద స్వరూపసిద్ధి లోకమువలన నెఱుఁగదగినది. లోక మొకే రీతిగా నిత్యమైయుండును. శాస్త్రము సుశబ్దాపశబ్ద పరిజ్ఞానమును సంస్కారమునకై యుపయోగించును. "ఏకశ్శబ్దస్సమ్యక్- జ్ఞాత స్స్వర్గే లోకే కామధు గ్భవతి" అనికదా వచనము. నియమ్యమే ములేనిది గ్రామ్య అదే అపభ్రంశమనగా.

**శాస్త్ర మపౌరుష మాద్యం ప్రాయిక నిత్యప్రయోగ లక్ష్మితత్।**
**దృశ్య మతిన్థవిరం యద్జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త అర్షనమః॥౪॥**

తా. ఈశాస్త్ర మపౌరుషము నాద్యమునై, బహుప్రయోగ శరణ్యమై యనాదియైయున్నది. దీనినిఁదెలిసి ప్రయోగించిన పదమార్ష శబ్ద తుల్యమేయగును.

**అద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయో ర్భవే ద్వికృతిః**
**కేవలతయాఽనువర్తత్యుభే చ యేయం యథాతథా భాషా ౫॥**

తా. సంస్కృత ప్రాకృతములు తెనుగునకు ప్రకృతులు,నీ తెనుఁగు భాషవికృతియు నగును. ఇయ్యది సంస్కృత ప్రాకృతములవలెనే స్వతంత్రమై, వేఱుగానుండి, వాని ననుసరించుచున్నది.

—o—

## ఆంధ్ర శబ్దచింతామణి వృత్తిభూత

## హరికారికావళి

శ్రీ పతి స్తనశైలాగ్ర వాసి ప్రత్య గ్ర వారిదం।
కంచన ద్విజరాజాంకం కమలాశ్రిత మాశ్రయే ౧॥

శ్రీ మ తక్కదంబవర్యః స్థిర లసదైశ్వర్య యు క్చిరం జయతు ।
ఇన గాలగోత్రధర్మ స్ఫురిత శ్రీ కాళహస్తి నగరీశః ॥౨॥

శ్రీమద్వరదామరకుల ధామా వరరామసూ క్తిత స్సోఽహం
మమతి ర్వృత్తిం నాన్నసూత్రాణాంకృష్ణమూర్తి రిహ కుర్వే ౩।

అతులా మత్కృతి శ్శ్రేయ మశ్రాంత వినుతాకృతిః
దిగంత వ్యాపినీ జ్యోత్స్నే ధినోతు రసికావళిం ।౪॥

మాత్సర్య మలినవృత్తీ నుత్సార్య మదీయకృతి రియంజ్యోత్స్నే।
కోకా నివ సవివేకాన్ లోకా నిహ రంజయతు చకోరా న్వా ॥౫॥

జయతి సకల విద్యాజన్మభూమి ర్జగత్యాం
జనితసరసచేత స్సంప్రతోషాఽద్యభాషా।
తదనుసరణలీలా దత్తపీక్ష మసీషా
తరళయతి చ శీర్షం తావ దేవాంధ్రభాషా ।౬॥

శ్రీరామాయణ భారతాదివచనోదారార్థ వల్మీకభూ
పారాశర్య ముఖాన్ ప్రణమ్య కవితాధారా నిదానీంతనాన్।
ధీరావంతర మిత్రమాత్ర పదవీదూరా వశీవాదరా
దారాధ్య ప్రకృతార్థ సార్థఘటనాచారాయ నమ్య గ్యతే ॥౭॥

యే కేచన ప్రకృతిమత్సరిణో మదీయ
గ్రంథం సదర్థ మపి సంప్రతి దూషయన్తి।
బుద్ధ్వాపి సాధ్విద మితి స్థితి మాత్యజన్త
స్తేపీహ భూతకవితుల్యతయా ప్రణమ్యాః ॥౮॥

శ్రియా హనుమత్సౌమిత్రి శత్రుఘ్న భరతాగ్రజైః।
విభీషణాంగదర్క్షైశ్చ సహితం రామ మాశ్రయే ॥౯॥

శిష్ట కులకలశజలనిధి శీతకరః కృష్ణమూర్తి సంఖ్యావాన్।
షడ్దర్శనీ స్వతంత్ర స్తనోతి హరికారికావళిం వృత్తిం ॥౧౧॥

(ఇంతవరకు నిది పీఠికాభిప్రాయము తక్కినది సూత్రముల క్రింద
నీయబడును.)

శ్రీః

# బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిని

## చింతామణి :- ఆద్యాయాః పంచాశ ద్వర్ణాః

## బాలవ్యాకరణము. ౧. సంస్కృతమునకు వర్ణము లేఁబది

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః, క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ శ ష స హ ళ. ఇం దకారాద్యచ్చులు. కకారాదులు హల్లులు. అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది.

గుప్తార్థప్రకాశిని వ్యాఖ్య — తెనుఁగు వికృతియనియు, సంస్కృత ప్రాకృతములు ప్రకృతులనియు నన్నయ చెప్పియే యున్నాఁడుకదా. అందుచే ముందుగా సంస్కృత వర్ణములను జెప్పినఁగాని సులభముకాదని వానిఁజెప్పుచున్నాఁడు. ఏను+పది=ఏఁబది. అచ్+హల్+విభాగము= అజ్ఝల్విభాగము. ప్రాకృతాంధ్రములకు నిట్లే యగును. పాణినీయ వ్యాకరణ రీత్యా ఌకారమునకు దీర్ఘమైన ౡకారము లేకున్నను, వరరుచి హేమ చంద్రాది మతమునవేకాక, "ౡతి సవర్ణే ౡవా" అను సూత్రమున జెప్పఁబడిన యీ షత్స్పృష్ట ఌవర్ణమునకు దీర్ఘవిశేషము నేను. వివృతము నకే" అని శబ్దేందుశేఖరమున "ఌవర్ణస్యేతి, వివృతస్యేత్యర్థః తేన ౡతి ౡ నేతి విధేయ స్యేషత్స్పృష్టస్య దీర్ఘత్వేపి న క్షతిః" అని నుడివినాఁడు

"ఆదిక్షాంతా స్మృతా వర్ణా" అను వ్యవహారమున్నను, అయ్యది సంయుక్తాక్షరముగా "కషయోర్యోగే క్షః" అని (క్+ష్+అ=క్ష) చెప్ప

బడినందున దాని కక్షరాంతరముగాఁ బరిగణనములేదు. ధాతుపాఠమున షాంతధాతువులను షాంతధాతువులలోఁ జేర్చిచెప్పుటచే ళలోచివరషకార మున్న దనిస్పష్టము. మాత్రృకు లకారాదిళకారాంతము పంచాశద్వర్ణములను జపమాలిక గాఁగొని ళకారమును మేరుహానగా లెక్కింతురు. కానదే జపమాల "కక్షమాల" యని పేరు వచ్చినది. (అకారాది ళకారాంతః అక్షః తత్కృతా, తత్ప్రతినిధిభూతా వా మాలా అక్షమాలా)

ఇక ళకారము విషయమున - మాహేశ్వర సూత్రములలో ళకార మును జెప్పకున్నను, "లడయోర్ళళయో శ్చైకత్వ" మనియు, "లో ళః" అనియుఁ జెప్పబడుటచేతను, లోకవేదముల రెంటను వ్యావహారణ భేదము స్పష్ట ముగానుంటందట్టియు వర్ణాంతరము కాదవి చెప్పను వీలపడదు.

సూ. ప్రకృతే న్తు తే దశోనా స్స్యుః॥

"ఋ ౠ వర్ణౌ హ్రస్వదీర్ఘా వైజాద్యా వనువాసికౌ।
ళషా వేతే దశోనా స్స్యుః ప్రాకృతో క్తిషు సర్వదా."

టీ. ౨. ప్రాకృతమునకు వర్ణంబు ః నలుపది.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః. క ఖ గ ఘ, చ ఛ జ ఝ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ, స హ ళః కొందఱ మతంబున హ్రస్వ వక్రంబులను బ్రాకృతంబునఁగలవు. కొందఱ మతంబున వక్రతమంబులును గలవు. ఎ ఏ ఒ ఓలు వక్రములని, ఐ ఔలు వక్రతమములని ప్రాచీనులు వ్యవహరింతురు.

సంస్కృత భాషావికారమగు ప్రాకృతభాషకు నలుపది (నాలుగు + పది) వర్ణములు ఈ భాషప్రాకృతము, శౌరసేని,మాగధి,పైశాచి, చూళిక,

అపభ్రంశమనని మూడు రకములు. ప్రకృతి ప్రత్యయాదివ్యుత్పత్తి కలిగి ప్రకృతము - అనగా సంస్కృతము. దానినుండి పుట్టినది ప్రాకృతము. అంతియకాని, ప్రాకృతము మొదటిది. దానిని సంస్కరించగా సంస్కృతమైన దనుకొనుట పొరపాటు.

## సూ. షట్త్రింశ దత్ర తే.

ద్వివిధాదిమదేదోతౌచో వక్రతమా వనుస్వారా ।
కగచజయుగ టడణ తదన పబమ యరలవ సహాళంతుహల్వర్గః ॥

వా. ౩. తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం క గ
చ ౘ జ ౙ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.

గు. ఇవి తత్సమేతరమైన తెనుఁగు భాషలో సహజముగా నున్నవి. వీనినే నన్నయ "ద్వివిధాదిమదేదోతౌచో వక్రతమా వనుస్వారా। క గ చ జ యు గ ట డ ణ త ద న ప బ మ వ స హ ళ ం తు హల్వర్గః" అని వర్ణమాలను కంఠోక్త్యా చెప్పినాఁడు.

## సూ. అన్యే చాను ప్రవిశన్తి శబ్దయోగవశాత్.

వా. ౪. ఋ ౠ ఌ ౡ. విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శషలు సంస్కృత సమాసములను గూడి తెనుఁగున వ్యవహరింపబడును

ఋతువు, పితౄణము క్ఌప్తము, ఌకారము, దుఃఖము, ఖడ్గము, ఘటము, ఛత్రము, ఝరము, కంఠము, ఢక్కా, రథము, ధరణి, ఫణము, భయము, పఙ్క్తి, ఆజ్ఞ, శరము, షండము.

గు. ఈ 19 వర్ణములను తెనుఁగులో లేకున్నను, (ఋష-ఋషము' శబ్దములద్వారా కానంబడును. ఇక్కడ గమనించవలసినదొక్కటి-సంస్కృతమున లేక, తెనుఁగునను్న యక్షరములు - ఎ ఒ ఁ చ జ. (అ వర్ణాంతరమన్నచో నదియు)

చిం. కచట తపాః పరుషాఖ్యాః గజడదబా స్తు సరళాః

బా. ౫. క చ ట త ప లు పరుషములని, గ జ డ ద బ లు సరళములని చెప్పంబడు.

గు. పరుషముగా-గట్టిగాఁ బల్కఁబడునవి కాన పరుషములనియు, తేలికగాఁ బల్కఁబడునవి కాన సరళములనియుఁ పేళ్ళు. ఈమైదిఁటికి నొకే రకపు వ్యాకరణ కార్యములు విధింపఁబడుఁగాన వీనికిఁ గలిపియే సంజ్ఞ యీయఁబడినది.

చిం. స్థిరా ఇతరే

బా. ౬. ఇతరములగు హల్లులు స్థిరములు.

ఖ ఘ జ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ.

గు క మొదలు ళ వరకున్న 34 అక్షరములలో బరుష సరళములు 10 పోను మిగిలిన 24ను స్థిరముఇ-మార్పులఁ జెందక స్థిరముగా నుండునవి.

చిం. అర్ధన్యస్తాలవ్య శ్చ ర్వాత్ర స్యాన్నిత ప్సవర్ణ శ్చ.
హరికారిక. తాలవ్య దంత్య భేదేన చజౌతు వికృతౌ ద్విధా.

బా. ౭. దంత్యతాలవ్యము లయిన చజలు సవర్ణంబులు.

తాలవ్య చకారంబు దంత్యచకారంబునకును దాలవ్యజకారంబు దంత్యజకారంబునకును గ్రాహకంబు లని తాత్పర్యము.

గు. సవర్ణంబులు=సమమైన వర్ణములు=సజాతీయములు. గ్రాహకము లనగా గ్రహింపఁజేయునవి. తెనుఁగున మాత్రమే చజలు దంత్య తాలవ్యములని రెండు రకములుగానున్నవి. దంత్యములనగా దంతములతో నుచ్చరింపఁబడునవి. చ జ లు తాలవ్యములనగా తాలువుల (చెంపుల)చే నూదఁబడునవి చ జలు. ఈ రెంటికి యతిప్రాసాదులమైత్రి కలదని భావము వ్యాకరణకార్య మేదైననొక్కదానికిఁ జెప్పినచోరెండవ వానికిఁ జెప్పి నట్లే. ఉదాహరణకు - పరుషములకు సరళములు వచ్చుననగాచకుజావలె చ కు జ వచ్చుననియర్థము.

సూ. ఇదీ దేదోద్వ్యయయుతౌ తాలవ్యౌ తౌ న చాన్యతః.

బా. ౮. ఇ ఈ ఎ ఏలంగూడిన చ జ లు తాలవ్యంబులు.

చిలుక, చీమ, చెలి, చేమ, జలి, జీడి, జెట్టి, జేజె.

గు. చి=చ్+ఇ. కనుక చ జ కారములీపైనఁజెప్పిన నాలుగచ్చులతోఁ గూడినపుడు తాలవ్యములే యగును. వాటిని "చిలుక" అని దంత్యముగా నుచ్చరింపరాదు.

సూ. అ దా దు దూ దె దే దొ దో దౌ ద్గౌ దంత్యా వేవ.

బా. ౯. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చజలుదంత్యములు.

చలి - చాప - చుక్క - చూపు - చొక్కా - చోటు - చౌక:
జము(దు - జాతు) - జున్ను — జూదము - జొన్న - జోలి - జౌను.
ఐదంతములైన చ జ లు సమేతరశబ్దంబు లందులేవు.

౮. పై యుదాహరణములఁబట్టి "అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లతోఁ గూడిన చ జ లు దంత్యములే (దంతములతో నుచ్చరింపఁబడునవే)యగును ఐకారముతోఁగూడిన చ జ లు తెనుఁగు మాటలలో లేనందున వానిని వివక్షింపలేదు. సంస్కృతమునను్నవి తాలవ్యములే కాని దంత్యములు కావు. కనుక వానివిగూర్చి సందియమే పొడమదు.

సూరిగారు చై జైలతోఁ బ్రారంభింపఁబడు పదములు తెనుఁగున లే వనిరి. కాని, ఆంధ్రనామసంగ్రహమున పైడిపాటి లక్ష్మణకవి. చైపుల సాకిరి. చాయమగఁడు (దేవ. 16 ప.)చెయి యనఁ జై నాఁగఁ జెయ్యి చే నా హస్తా, హస్తయము లగు మానవ. 21 ప.) అనిరెండుచోట్ల'చైవాతి' యున్నారు గుప్తార్థ ప్రకాశికాకారులు వ్రాసినట్లు "చైపుల"ను కొందఱు సాహసికులు' చెయుపుల'గా మార్చిరి. కాని, యతిభంగమును వారుగుర్తింప లేదు ప్రాసయతికైనను గురుపూర్వత్వనియమము భంగపడును కద. "చై-చెయ్యి." ఈ పదము నెవరు నుదహరింపక పోవుటకుఁ గారణము తెలియదు.

**౯. అత్ర కేచన ! వదంతి తత్త్వం బహుషు సమే దంతోపధా చజౌ॥ న తదస్మన్మ తారూఢం తదథాపేపి సంగతే॥ కేచిద్రాజ్ఞోపి సర్వత్ర న తచ్చేష్ట మసంగతేః**

సూ. ౧౦ సంస్కృతసమంబులం దికారాంతములయినశబ్దముల యుపధాచజలు బహువచనము పరం బగునపుడు దంత్యములగు.

ఇవిదప్ప సంస్కృత సమంబులంచు దంత్య చ జ లు లేవని తాత్పర్యము. ఉపధయనఁగాఁ దుది వర్ణమునకు ముందు

ప్రథమా కయి పష్టి యొక్క-తరములయిన విభక్తులు, ఉత్తమ పురుషైకవచనంబులు, భూతతద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనంబులు, ఆశీరాద్యర్థకంబులయిన యెడు తవర్ణకంబులు, శతృతు మానంతర్య చేదాద్యర్థకంబులు, నేను తాను పదంబులు, వలె ప్రభృతులను - ద్రుతప్రకృతికంబులు. నన్నున్, నాచేతన్, నాతోడన్, నాకొఱకున్, నావలనన్, నాకంటెన్, నాకున్, మాలోపలన్, మాయందున్, వత్తున్, వచ్చెదన్, వచ్చెన్, వచ్చున్, వచ్చెదున్, ప్రసన్నులయ్యెడున్, కావుతన్, కొట్టుచున్, కొట్టిన్, కొట్టఁగన్, కొట్టుదున్, కొట్టినన్, వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్ ఇత్యాద్యుదాహార్యంబులు.

హ. ప్రథమాత్తైపష్ఠియొక్క- వ్యతిరిక్తభక్తయః
ఆశీరాద్యర్థయెడుతా వుత్తమైకవచాంన్యపి,
అతీతతద్ధర్మాద్యర్థ ప్రథమైకవచాంన్యపి
శత్రానంతర్యతుమ్చేదాద్యర్థాతా(తాను)న్యపినేన్యపి (నేను)
దేశ్యేవాద్యా స్తథైవాన్యై ర్ద్రుతప్రకృతయస్మృతాః

గు. ద్రుతమైన నకారము ప్రకృతి సిద్ధముగా చివరమన్నవి. ద్రుతప్రకృతికము ూ. వీనిని ద్రుతాంతములుగానే వాడవలెను. ఈ భాషలో నున్న కష్టములలో నొకటి - కళాద్రుతప్రకృతిక పరిజ్ఞానమే. కావున దాని కనువగు సూత్రపట్టిక నిచ్చుచున్నాడు.

1. ప్రథమా - డుములు, సంబోధన ప్రథమయు, తై చతుర్థి,పష్ఠి పంచమి, యొక్క-షష్ఠి. (కూర్చి, గుఱించి) కాక తక్కిన విభక్తి ప్రత్యయములు. ద్వి నన్నున్, తృ. నాచేతన్, చ. నాకొఱకున్, పం. నావలనన్, నాకంటెన్, ష. మాకున్, మాలోపలన్, స. మాయందున్

2. ఉత్తమపురుషలోని యేకవచనములు నేను వత్తున్, చేసెచ్చెదన్ మొ.

3. భూత ప్రథమపురుషైకవచనములు-వచ్చెన్,చేసెన్, వెళ్లెన్ మొ. తద్ధర్మార్థ్యర్థక ప్రథమ పురుషైకవచనములు - వచ్చున్, వచ్చెడున్ వచ్చెడిన్.

4. ఆశీరాద్యర్థకములు-చీవన, శావము మున్నగు వర్థమిచ్చునవి. వర్థకములనగా ప్రత్యయములు. దేవతలు మనకు ప్రసన్నులయ్యెదున్, రాముడు వన్నుగాపుతన్,

5. శత్రర్థకము - కొట్టుచున్, తుమర్థకము-కొట్టన్, కొట్టఁగన్, అనంతర్యార్థకము-కొట్టుడున్, చేదర్థకము కొట్టినన్.

6. నేను తాను పదములు ప్రథమావిభక్తులైనను ద్రుతాంతములే. సాధారణముగావచ్చు ద్రుతప్రకృతికము లివి, ఇంకను లేకపోలేదు.

చిం తిఙ్మధ్య శేషషష్ఠి ను స్కర్మప్రవచనీయజవిభక్తిః।
కించి త్ప్రశంసనాద్భుత వంతాప యదా తదా కి మేవాంశ్చ।
క్త్వాకిల తూష్ణి మాద్యా నభిదధతి కలా
ద్రుతో న యేషాంస్యాత్॥

సూ. కళా స్తదతిరిక్తా స్తు కళావిద్భి రుదీరితాః।

వా. ౧౩ ద్రుతప్రకృతులగానిశబ్దంబులు కళ లనఁబడును.

రాముడు, రాములు, హయము. విష్ణువు, గోడ, మేడ అయ్య, అమ్మ, రామునికై: జ్ఞానముఁబట్టి. నాయొక్క. వచ్చిరి, వచ్చితివి, వచ్చితిరి

వచ్చితిమి, రాఁడు, రారు, రాను, రావు, రాము, కొట్టక, తిట్టక. ఎత్తిలి, ఒత్తిలి, ఊరక, మిన్నక, బళి, అక్కట. ఏలఇత్యాదు లూహించునది.

గు. వన్నియ కళలను విపులీకరించగా సూరి ద్రుతప్రకృతికములను విపులీకరించినాఁడు తెనుఁగున కళలు, ద్రుతప్రకృతికములే తప్ప మూఁడవ రకపుపదములులేవు.కాని విర్వచించునపుడు చివర నకారమున్నవి,లేనివియని చెప్పవలెఁగాని కళలు కానివి ద్రుతప్రకృతికములని, ద్రుతప్రకృతికములు కానివి కళలని చెప్పరాదు. గ్రంథకర్త యొకదాని లక్షణము చెప్పెను గాన రెండవదానివి పరిశిష్ట న్యాయముగా గ్రహించెను. తిఙ్మధ్య-మధ్యమ పురుషలు రమాంతక్రియ ఇను-వచ్చితివి, వచ్చితిరి, వచ్చిరి, వచ్చితిమి. శేషషష్టి-యొక్క, అయ్య....నాయొక్క వఱకు ప్రథమాకై షష్టియొక్కలు మస్-ప్రథమావిభక్తి. కర్మప్రవచనీయజ విభక్తిః-కూర్చి, గుఱించి యను నవి. కించిత్-ఇంచుక, కొంచెము: ప్రశంసనా-బళి, మేలు, అద్భుత—ఆహా ఔరా, సంతాప—అక్కట. అయ్యో, యదా-ఎప్పుడు, తదా, అప్పుడు, కిం-ఏమి, ఏవ—ఎ, ఏ, అ అను నవధారణార్థకప్రత్యయములు, క్త్వా-చేసి. వచ్చి, కిల-చేసెనట. తూష్ణీం-ఊరక, మిన్నక, ఆదిశబ్దముచే రమాంత క్రియలు, కైపట్టి, వ్యతిరేకార్థములగు రాఁడు, రారు, రావు. రానుమున్నగు లవి గ్రాహ్యంబులు. "అధారముచేకను" మున్నగుచోట్ల లేక అనునది అస్త్యర్థక కలుగునకు వ్యతిరేక క్త్వార్థకము కాన కళయే. అక్కఁడనున్నది నముచ్చాయక"సు" వర్ణకమే కాని ద్రుతముకాదు.

చిం. సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః। హ్రస్వా త్పూర్ణోఽపి భవేత్

హ. హ్రస్వాత్పరః ఖండబిందుః పూర్ణబిందు ర్విభాషయా।

వా. ౧౪ హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగు.

అరఁకువ - అరంకువ; అరఁటి—అరంటి; ఎఱుఁగుట-ఎఱుంగుట; బలఁగము—బలంగము, మగఁటిమి-మగంటిమి.

గు. అనుస్వారము (ం—సున్న) సిద్ధము, సాధ్యము అని రెండు రకములు సిద్ధమనఁగా భాషలో స్వతస్సిద్ధము. సాధ్యమనఁగా వ్యాకరణ సూత్రములచే సాధింపఁబడినది. అవి మఱల అర్ధము పూర్ణము [అర—నిండు] అని రెండు రకములు. అనగా సిద్ధార్ధానుస్వారము, సిద్ధపూర్ణానుస్వారము, సాధ్యార్ధానుస్వారము, సాధ్యపూర్ణానుస్వారమునని నాలుగురకములైనవి.

హ్రస్వముపై—అ, ఇ, ఉ, మున్నగు నక్షరములమీఁదనున్న అర సున్న నిండుసున్న వికల్పముగా నగును. "అరఁటిలో సిద్ధార్ధానుస్వారము. ఇది వికల్పముగా నిండుసున్న కాఁగా, "అరంటి" అగును. అట్లే తక్కినవియు.

చిం. దీర్ఘాచ్చే త్ఖండఏవ న జ్ఞేయః.
హ. దీర్ఘాదుపరి పూర్ణానుస్వార స్సాధ్యో న చ క్వచిత్.

వా. ౧౫. దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు.

వాఁడు, వీఁడు, రాఁడు, లేఁడు, కాఁబోలు, కాఁబట్టి, గోఁగులు, రేఁగులు.

గు. దీర్ఘముమీఁది యరసున్న యరసున్నయే అని చింతామణి. హ్రస్వముమీది యరసున్న నిండుసున్న వికల్పముగా నగునని చెప్పినందున నది సాధ్యపూర్ణానుస్వారమగుచున్నది. ఇక దీర్ఘముపైనరో హ్రస్వమే

యగు నన్నమాటకు సాధ్యపూర్ణానుస్వారమని యర్థతస్సి, ద్ధమగుచుండఁగా వివృతికర్తలు దానినే వ్యక్తము చేసిరి.

"వాఁడు" అన్నపుడు "వ్+అ" దీర్ఘముమీద ఁ-అరసున్న బిందు సున్న కాదు "వాండు" అనురూపముండదు. వాఁడు-డుక్ వచ్చినరూపము కాన్+పోలు-కాఁబోలు. ద్రుతము బింపు సంశ్లేషలు విభాషనగునున్న సూత్రముచే బిందువులలో వర్ధబింపువేవచ్చును. గోను+లు- అచ్చి-19 సూత్రముచే గుక్ రాఁగా గోఁగులయినది ఇవన్నియు వ్యాకరణ కార్య సాధ్యములు కాన పూర్ణములు కావు. సిద్ధపూర్ణములుండును (గాంద్రు మను, ఓంద్రపెట్టు, మొ.)

అ. కా. తృతీయే ప్రథమే వర్గే పర ఏవ హి దృశ్యతే
బిందు ర్వైకృతమధ్యేతు నాన్యవర్గే పరేతు నః
హ. కా. వమేత రేషు శబ్దేషు వైకృతేషు ప్రదృశ్యతే
అనుస్వారస్తు పరుషాత్సరళా దపి పూర్వభాక్,

కా. ౧౬ సంస్కృతసమేతరంబులయిన తెనుఁగు శబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు కానంబడుచున్నది.

వంకర, తిలఁకువ, మంచు, త్రాఁడు, దంట, దాఁటు, కొంత,కోఁత, ఇత్యాదులూహ్యంబులు,

గు, భాష నాలుగురకములని ముందుఁ జెప్పఁబడును. అందు సంస్కృతసమము కాక తక్కిన భాషలో అరసున్నగాని, బిందుసున్నగాని పరుషసరళములకు ముందే యుండును. అట్లు లేవిచో నవి తెనుఁగుకావని యెఱుఁగునది.

శంఖము, సంఘము, పింఛము, శంరము, కంథ, అంఘుడు, గుంఫనము, విష్కంభము, సంయమి, సంరంభము, సంవత్సరము, పంక్తి హంస మున్నగునవి సంస్కృతసమములు.

**చిం. ఆద్యః క్రియాను భూతార్థదోశిన మాద్యగం వినా పర్వః**

**అ. కా. వికృతిపదాదౌ ప్రథమాతంస్థ తృతీయాను నాసికౌ న స్తః॥ ఋయళా అప్యదోదంతవళ్ళ నాత్రపదాదిగః.**

బా. ౧౭. యకారంబును ఋఋళాలును తెలుగుమాటలు మొదట లేవు.

ఎవఁడు, ఎక్కడ, ఏమి, ఏల, ఉంత, ఊరు, ఒకఁడు, ఓడ: హరి యతఁడు, నిద్రపోయె విట్టిచోట్ల సంధివశంబున వచ్చిన యకారంబులుగాని పూర్వసిద్ధంబులుగావు ఋఋళ ళాదవర్ణ శబ్దంబులు దప్ప సంస్కృతసమంబులందు నహితమువుఋ ళావర్ణములగు శబ్దంబులులేవని యెఱుంగునది. ఉదకము, ఊర్మిక, ఓదనము.

గు. యకారముతో ప్రారంభమగు పదములు తెనుఁగులోలేవు. పై నిచ్చిన యుదాహరణములు గ్రహింపన్నియు సజాములే. చింతామణి కర్త-వినియెను మున్నగు భూతార్థక్రియలందును, పదాదినున్న - యెవఁడు యెక్కడ, యేల మున్నగునవితప్ప తక్కినవన్నియును సజాములే యని సూత్రించెను. ఆకాలమునకు భాషలో యాదిశబ్దములుండెడివవియు, నందు వనే "సర్వత్రాఖ్య తాకార్యం జ్ఞేయా యన్య త్రమతప్రకృతికేభ్యః" మత

ప్రకృతికములకు యాదిపదములు పరమైనపుడచ్చునకువలెనే వ్యాకరణ కార్యముచేసికోఁదగినదని చెప్పెననియు తోఁచును.

ఇఁక సూరి యకారమును మాత్రమే చెప్పఁగా నథర్వణుఁడు య, ణ, శ, లనుగూడ పవాదిని లేవని చెప్పెను. వానికిఁ తరువాతి వాఁడైయుండియు సూరి వానిఁ జెప్పకుండుట చింత్యము. పుపూపొపోలఁగూడ పోర్థ్యపదములే యుండెననెను. కాని మఱికొన్ని పదములు - పోశా, పోటా, పౌత్రః, పోత్రీ, పోదః, పోదాలః, పోరకః, పోరటః, పోరవః, పోరుభానః, మున్నగు పోకారాది శబ్దములు నిఘంటువులఁగానంబడుచున్నవి.

చిం. లఘువోఽలఘవశ్చేతి ద్వేధాంతస్థాన్వదన్తి శాస్త్రారః
అన్యేఽప్యవ్యాకరణస్పృష్టా, రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః॥
అద్యః క్రియాను భూతార్థ ద్యోతినమాద్యగం వినానర్వః।
యచ్ఛ్రుతిమార్యాలఘుయం పవదన్తి ప్రాణతః పరంప్రాణం
నాన్యేషాం వైధర్మ్యం లఘ్వ్యఘూనాం
రయోస్తు నిత్యం స్యాత్॥

హ. ద్విధాంతస్థా భవంత్యత్రలఘవోఽ లఘవోమతాః॥

బా. ౧౮. య ర ల వ లు లఘువులని, యలఘువులని ద్వివిధంబులగు.

హరి యతఁడు-ఇత్యాదు లందాగమ యకారము లఘువు తక్కిన యకార మలఘువు. విఱుఁగు, మెఱుఁగిత్యాదులందు రేఫం బలఘువు-ఇచే

శకటరేఫంబని చెప్పఁబడును. శకటరేఫము తత్సమ తద్భవము లందులేదు. పెరుగు, కరుగిత్యాదులందు రేఫములఘుష, ఏఱల, పాఱలు, త్రాఱలని ఐహంత్వమందు వలదల నాదేశమయిన శకార మలఘువు తల,నెల యిత్యాదు లందలి లకారము లఘువు. అతఁడు వలికె నిత్యాదులందున్న సాదేశవకార ము లఘువు. తక్కిన వకారమలఘువు. వర్ణసమామ్నాయమందలి శకారము వర్ణాంతరముగాని, యలఘు శకారముగాదని యెఱుంగునది.

గు. "య ర ల వ" లు లఘువులని, అలఘువులని రెండురకములు లఘువు లనఁగా 'యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్య మూలానాం శైథిల్యం జాయతే స లఘూచ్చారణః' అని కౌముదిలోఁ జెప్పిన రీతిగాఁ దేలికగాఁబలుకఁబడునవి లఘువులు.ఒత్తిపలుకవలసినవి యలఘువులు. వీని నిర్వచనము సుకరముగాఁగాని, సామ్యానుగతికముగాఁగానిలేదు సంస్కృత వ్యాకరణమున నాదేశయకారమును లఘువుగాఁజెప్పగా, నిటఁగూడ నాగమ యకారమును లఘువుగనే చెప్పినాఁడు. సహజమైన యకార మలఘువు వకారమునకు నిట్లే.

శకటరేఫము-అలఘురేఫము.ఇది వ్రాఁతలో బండిపలెనుండుటవలన, దీనికి శకటరేఫమనియు, బండి ఱా యనియుఁ పేర్లు వచ్చినవి. ఇదిభాషలో సహజముగా నుండునది కానఁ బ్రయోగమునుఁబట్టి యెఱుఁగ దగినదే.

"శకటరేఫము తత్సమ తద్భవములందులే"దని వృత్తిని సూరిచెప్పి నాఁడు. కవిసంశయవిచ్ఛేదమున "ఉఃవిపలుకుసోట నొగిఁదేల్చి పలికిన, రేఫగాను. శకటరేఫగాని, తద్భవపుఁ బదముఁ దవిలిన సూరేఫ, రేఫగాని

శకటరేఫగాదు." అని యున్నదానిని, "పదము మొదట నిడుదఁదుదిఁదద్భవంబుల, రేఫగాని శకటరేఫగాము." అను చిట్టకవి వేంకటార్యవరుని మతమును సూరి ఖండనుంచెను. కాని కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహమున "నిక్కమైనను సుగుణనిధి చిట్టకవి వేంకటార్యవరుఁడుపలికె పది హాళిక్క" అని ఖండించెను. అహోబలపతి కవిశిరోభూషణమున "ఉపకారికా-ఉక్కళి, కర్కరం-కఱకు, మూర్ధ-మొఱకు" మున్నగు తద్భవములందు శకటరేఫ మున్నదని చెప్పెను. ప్రౌఢవ్యాకరణమున చాల యుదాహరణము లీయఁబడినవి పీఠక-పిఱికి, గోరోచన-గోఱజము, కురప-గొఱపము, గరుత్-గఱి, గురు-గఱువ, ఇత్యాదులు రేఫ శకటరేఫ పరిజ్ఞానమునకు ప్రయోగమే శరణము బహువచనమున "ర లడ" లాదేశముగా వచ్చిన ళకార మలఘువు. దీనికిని వర్ణసమామ్నాయములోని ళకును భేదమున్నది. సంస్కృతములో "లడయో ర్లళయోశ్చైవ" అని అగ్నిమీదే-అగ్నిమీళే. కలా-కళా" అభేదమున్నను, తెనుఁగున "మంగళము × మంగలము! కళ × కల:" మున్నగుచోట్లవిరుద్ధార్థములు వచ్చుచున్నందున "లళ"లకభేదమును చెప్పక ళ కారమును వర్ణాంతరముగాఁ జెప్పెను. అగమ యకారము లఘువన్న విషయమునే నన్నయ "అచ్చుకంటెఁబరమైనయకారమువలె వివరించు నచ్చు లఘుయకారమగు"ననెను

**చిం. తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి। ప్రకృతిద్వయజా తజ్జా తుల్యా తు సమా.**

**వ్యా. తత్సమా తద్భవా దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా।**

బా. ౧౯. సంస్కృతప్రాకృతతుల్యంబగు భాషతత్సమంబు.

| సంస్కృతము | - | సంస్కృతసమము | సంస్కృతము | - | సంస్కృతసమము |
|---|---|---|---|---|---|
| రామః | - | రాముఁడు | గౌః | - | గోవు |
| విద్యా | - | విద్య | నౌః | - | నావ |
| హరిః | - | హరి | ద్యౌః | - | దివి |
| ధేనుః | - | ధేనువు | హృద్ | - | హృది |
| భూః | - | భువి | జగత్ | - | జగత్తు |
| పితా | — | పిత | | | జగము |

ఇత్యాదు లూహ్యంబులు.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|
| అగ్నిః | అగ్గి | అగ్గి |
| అటిః | అడీ | అడి |
| ఆలిః (పజ్క్తి) | ఓలీ | ఓలి |
| కటుః | కారో | కారము |
| గౌరవమ్ | గారవం | గారవము |
| జటా | జడా | జడ |
| మిరా | మేరా | మేర |
| యమః | జమో | జముడు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగా[illegible] | [illegible]గారము |
| శ్రీః | [illegible] | [illegible] |

ఇత్యాదు లెఱుంగునది.



సు. తత్+సమము-సంస్కృత ప్రాకృతములతో సమమైనది. తత్సమము. అనగా సంస్కృత ప్రాకృతశబ్దములలోని ప్రకృతులను యథాస్థితముగా గ్రహించి విభక్తి ప్రత్యయముల మార్పులతో మాత్రమేర్పడు పదములు. గమనించదగిన దొక్కటి. ప్రాకృత సమమని యుదాహరించిన అగ్గి, బమ్మఁడు, రాణి, బడ పదములను తద్భవములుగాఁ జెప్పుచున్నాము. ఇక్కడ నవి తత్సమములుగాఁ జేర్కొనఁబడినవే: యనుసందియమునకు—

"వదలక సిద్ధాక్షరములు
పొదలిన వర్ణములు దూలిపోఁబడఁగ స
ర్థదమై ప్రాకృతవిభమగు
నది తద్భవ పదమునాఁగ నభిమతమయ్యెన్"

అను కావ్యాలంకార చూడామణి చెప్పినదానినిబట్టి సంస్కృత శబ్దములనుండి పుట్టినవి కాన తద్భవము లనవచ్చునని పించును. కటుశబ్దనమమన్న "కారము" అను పదము క్షారశబ్ద భవమని కొందఱి యభిప్రాయము. "త్రిరాత్ర ముభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణ వర్జనంచ" అను నాపస్తంబసూత్రము బట్టి క్షారమనగాఁ గారమనియుఁ దద్భవము కారమనియు వ్యక్తమగుచున్నది. క్షారమన లవణమని యొక యభిప్రాయమున్నను, లవణపద సన్నిధానమున దానికక్కడ నా యర్థము కాదని స్పష్టము.

## చిం. ప్రకృతిద్వయజా తజా

సూ. ౨౦. సంస్కృతప్రాకృతభవంబగు భాష తద్భవంబు

| సంస్కృతము | | సంస్కృతభవము | సంస్కృతము | | సంస్కృతభవము |
|---|---|---|---|---|---|
| ఆకాశః | — | ఆకసము | మృగః | — | మెకము<br>మెగము |
| కుడ్యమ్ | — | గోడ | | | |
| చన్ద్రః | — | చందురుఁడు | వక్రః | — | వంకర |
| తమఙ్గః | — | తమగము | వేసరః | — | వేసడము |
| తామరసమ్ | — | తామర | సముద్రః | — | సంద్రము |
| నారాచః | — | నారసము | సూచీ | — | సూది |
| విభం | — | నెపము<br>నెవము | స్మరః | — | మరుఁడు |
| ముఖమ్ | — | మొకము<br>మొగము | హరణమ్ | — | అరణము |
| | | | హరితాళమ్ | — | హరిదళము |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | | ప్రాకృతము | | ప్రాకృతభవము |
|---|---|---|---|---|
| అఙ్గారః | — | ఇంగాలో | — | ఇంగలము |
| అప్సరాః | — | అచ్ఛరా | — | అచ్చర |
| ఆశ్చర్యం | — | అచ్ఛేరం | — | అచ్చెరువు |
| పఞ్చాశత్ | — | పణ్ణాసా | — | పనస |
| పృథివీ | — | పుఢవీ | — | పుడమి |
| ప్రయాణమ్ | — | ప్రయాణం | — | పయనము |
| ప్రవాళః | — | పవాళో | — | పవడము<br>పగడము |

| | | | | |
|---|---|---|---|---|
| మత్సరః | — | మచ్ఛరో | — | మచ్చరము |
| యజ్ఞః | — | జణ్ణో | — | జన్నము |
| లక్ష్మీః | — | లచ్ఛీ | — | లచ్చి |
| విష్ణుః | — | విణ్హూ | — | వెన్నుఁడు |
| వైద్యం | — | వెజ్జో | - | వెజ్జు |
| స్తమ్భః | - | ఖంభో | - | కంబము |
| సూలమ్ | - | థోరం | - | తోరము |

ఇత్యాదులు తెలియునది.

సు. తత్-సంస్కృతప్రాకృతములనుండి,భవ-పుట్టిన భాష-తద్భవము. సంస్కృతమునుండి పుట్టినది, సంస్కృతమునుండి ప్రాకృతముపుట్టగా, వానినుండి పుట్టినడియునని రెండురకములైనను తద్భవముగా నొకటే. "వర్ణలోపాగమా నైకే సర్వస్మిం స్తద్భవే పదే" అన్నట్లు పర్ణములు లోపించుట, అగమముగా వచ్చుట, విపర్యాసము చెందుట మున్నగునెన్నో మార్పులు తద్భవమునఁ గాననగును అవియు నాహరణంబులందట్టి చూడగా సుస్పష్టమగును.

చిం. ప్రవాహినీ దేశ్యా

బా. ౨౧. త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు, ఊరు, పేరు, ఇల్లు, ముల్లు, కోట, పేట, దూడ, మేడ, కోఁక, రేఁక, కావి, మోవి - ఇత్యాదు లరయునవి.

సు. త్రిలింగదేశమనఁగా శ్రీశైలము, దక్షారామము, శ్రీ కాళహస్తి క్షేత్రముల కలదేశము. దక్షారామమునే కొందరు ద్రాక్షారామమనియు నందురు. శ్రీ కాళహస్తికి బదులు కాళేశ్వరమునుచెప్పుదురు. ఈ కాళేశ్వర

ము హైదరాబాదు రాజ్యములోని వెలగందల జిల్లాలో గోదావరీనదియు విం(దావతియుఁ గలియుకోటనున్నది. కాని దీని విషయమైన క్షేత్ర మాహాత్మ్యద్యోతకంబులగు శతకాదులు కానరావు. శ్రీ కాళహస్తినిఁగూర్చి "శ్రీ కాళహస్తి మాహాత్మ్యము" ధూర్జటికవి విరచిత ప్రబంధమే కాక, "శ్రీకాళహస్తీశ్వర శతకము"కూడ లోకవిదితము. మఱికొందఱు త్రినగ శబ్దభవనము తెనుఁగు పదమందురు. కొందఱు రూపాంతరమే తెనుఁగు పదమందురు. అట్టి యీ తెలుగు దేశమున వ్యవహారముననున్న భాషయే దేశ్యము.

ఇందు "కోట, పేట" అనుపదముల దేశ్యములుగాఁ జెప్పెనుగాని "కోట్టార ఘట్టహట్టాశ్చ" అమరత్రిలింగశేషము, "పింరావిటజనాశ్రయః" అమరపద పారిజాతము, వీనిఁబట్టి కోట్ట-కోట, పింరా-పేట-గాఁదద్భవములుగాఁ గన్పట్టుచున్నవని ప్రౌఢవ్యాకర్త వ్రాసెను

దేశ్యము-స్వదేశ్యము, అన్యదేశ్యమునని రెండురకములు, రావు దస్తావేజు, మతలబు మున్నగు హిందూస్థానీ పదములు, స్టేషను, రోడ్డు క్లాసు, మాష్టరు మున్నగు నాంగ్లపదములు. తాయి, వాయి, తిరుమూర్ణము మున్నగు వఱవపదములు, వింకనెన్నో సరిహద్దుదేశ్యములువచ్చి మన భాషలోఁ గలిసినవి. అవి తత్తత్కాలిక శిష్టవ్యవహారత స్సిద్ధంబులగుటకవి ప్రయోగంబులఁగావ వగుచున్నదే.

## ౨౦. అనియమా ద్గ్రామ్యంహి.

వా. ౨౨ లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు.

వస్తాఁడు, తెస్తాఁడు వచ్చేని, తెచ్చేని, వచ్చేవాఁడు. తెచ్చేవాఁడు, వచ్చేటిఁవాడు,తెచ్చేటివాడు—ఈ భాష ప్రయోగంబున కవర్హంబు.

గు. ఏ వ్యాకరణ సూత్రములచేత సాధింపఁబడని భాషకు గ్రామ్య మనిపేరు. ఇప్పుడిప్పుడు కొందఱు పండితు లా భాషను మాత్రమేల వదల వలెనన్నట్లు దానికిని౯ కొన్ని నియమముల నంటఁగట్టుచు వ్యాకరణమును రచించుచున్నారు. రచింపను వచ్చుఁగాని యది నిరవధికమైనందున యథా రూపసాధన సూత్రసాధ్యమని సామాన్యముగాఁజెప్పి, గ్రామ్యమని భాషకు నాలవ విభాగము చేయకపోవుటయే మంచిది.

కవిత్రయేతర ప్రయోగములలో సంస్కృత నాటకములందుఁబ్రాకృతమువోలె గ్రామ్యముకూడ తత్తజ్జాతివర్ణముననుసరించి పాత్రపోషణకై వాడుక భాషకన్పట్టుచున్నది.

సూ. గ్రామ్యాపి గ్రాహ్యతాం యాతి యద్యార్య వ్యవహారభాక్.

బా. ౨౩. ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు

పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపదగునని తాత్పర్యము. కలకంఠుఁడు, ప్రాణగొడ్డము. జీవకఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు.

గు. గ్రామ్యమైనను శిష్టులు ప్రయోగించినచో గ్రహింపఁదగినదే. "శాస్త్రప్రయోగవచసో శ్శాస్త్రంబలవదిష్యతే। అవిష్ప న్నేపదే తేన ప్రయోగాశ్రయణం హితం" అను నథర్వణకారికా ప్రకార మేపదమునకు వ్యాకరణ కార్యము ప్రత్యేకముగాఁ గనఁబడదో యక్కడ ప్రయోగమే శరణము. కలకంఠుఁడు మున్నగు పదములు సంకరసమాసములు, కల— తెనుఁగుపదము. కంఠుడు-సంస్కృతపదము. ఇట్లుదాహరించినవన్నియనిం తే. సామర్థ్యములేమి సంస్కృతాంధ్రపదముల రెంటిని సమాసముగాఁ గూర్ప

రాదు. అయినను మహాకవి ప్రయోగంబులఁ గానంబడు చున్నందున నియ్యవి దూష్యంబులు గావని చెప్పఁబడినది.

సూరి వీనిని గ్రామ్యములనఁగా, ప్రౌఢవ్యాకర్తతద్భవంబులన్నాఁడు. గరళకంఠ శబ్దభవము కలకంఁఠుడు. ప్రాణకుట్టక-ప్రాణగొడ్డము ఇవి హంసయాన-అంచయానవలె మిశ్రసమాసములని సమర్థించెను. కాని "జీవగఱ్ఱ"కుమాత్రమట్టియాధారము కుదురలేదు. "కలకంఠా క్షమింయిపుడు" భార. అర. 1 ఆ, "ప్రాణ గొడ్డములగు పసుల వారలఁ దీరఁ దలఁచిన పుణ్యంబు కలిమిఁజేసి. భార. ఉద్యోగ. 1 ఆ. రావౌచిత్యము జీవగఱ్ఱ. విజయ. 1 ఆ. "అవసరజ్ఞుండయి వ్యాసుఁ దేతెంచెనంత వత్తసవి, కవిలగడ్డంబును, గవిలజడలును, గవిలకన్నులును దవినయన్నవ వల్లనైన దీర్ఘపుఁ దనువునుజూచి యువిదకన్నుంగవ తెలవకయుండె భయమున." భార ఆది 4 ఆ. ఇందు కపిలశబ్దభవము కవిలశబ్దిమందురు.

ఇటసంజ్ఞలనఁగా వ్యాకరణ శాస్త్రమునఁ బ్రత్యేకముగా సంకేతింప బడిన పదములఁగూర్చి వివరించినందుకు దీనికి సంజ్ఞాపరిచ్ఛేద మని పేరు.

గుర్తించుకొనఁదగిన సంజ్ఞలు-అచ్చు,హల్లు, వక్రము,వక్రతమము. పరుషములు, సరళములు, స్థిరములు, కళలు, ద్రుతప్రకృతికములు, సవర్ణము ఖ్య,దంత్యతాలవ్యములు, ఉపధ, వైకల్పికము, సిద్ధ, సాధ్యబిందువులు లఘు-అలఘు య ర ల వ లు, అగమాదేశములు, తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యములు.

చిం ఇంద్రాద్యా అపిచగణాః।

తా. సంస్కృతమునన్న "భజస, యరత, మన" లేకాక తెనుఁగున "నల,నగ,సల,భ,ర,త" అనునింద్రగణములును, "గల న"లను సూర్యగణములును," రగ, రల, తగ, భగురు, భలఘు, మలఘు, నగగ, నలల, నగల, నలగ, సగల, సలగ, సలల"లు చంద్రగణము లిందున్నవి.

చిం. వళిరాద్య మనన్త రాక్షరం ప్రాసః.

తా. మొదటియక్షరమునకు వళి-యతి యనియు. రెండవ యక్షరమునకుఁ బ్రాస మనియుఁ బేరు.

చిం. న పదా న్యవ్యయ సుప్తిఙ్క్త్వాతుమునామ్.

తా. అవ్యయములు, సుబంతములు, తిఙంతములు, క్త్వాంతములు, తుమున్నంతములయొక్క పదములనిందుఁ బ్రయోగింపఁబడవు.

చిం. అనుకృతేఽస్తి వాక్యం తు.

తా. అనుకరణమున వాక్యములున్నవి.

చిం. విరళాన్ పేచోషాదిక శబ్దాన్ ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః।
ఇహతు ప్రవ్యాహార్యం నశ్కోతిత సుప్రసిద్ధమేవ పదం॥

తా. వ్యాకరణశాస్త్రజ్ఞులు ప్రయోగవిరళములగు పేచ,ఊషమున్నగు పదములఁ బ్రయోగించినను, తెనుఁగున మాత్రము సంస్కృతపదములను, కవిసంకేత సిద్ధములైన, సుప్రసిద్ధమైన వానివి మాత్రమే ప్రయోగింప వలెను ఇది నన్నయ శాసనము.

ఇది సంజ్ఞా పరిచ్ఛేదము.

—o—

# సంధి పరిచ్ఛేదము

చిం. సన్ధి ర్నాచో వ్యనుతః.

హ. అచ్యుతస్సన్ధిః

సూ. ౧. ఉత్తున కచ్చుపరంబగునపుడు సంధియగు

పూర్వపర స్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడును.

| | | |
|---|---|---|
| రాముఁడు | అతఁడు | రాముఁడతఁడు |
| సోముఁడు | ఇతఁడు | సోముఁడితఁడు |
| మనము | ఉంటిమి | మనముంటిమి |
| అతఁడు | ఎక్కడ | అతఁడెక్కడ |
| ఇతఁడు | ఒకఁడు | ఇతఁడొకఁడు |

గు. సంధియనఁగా గలయిక. కాని యిట ప్రత్యేకార్థముఁ జెప్పుచున్నాఁడు. సంధి రెండు పదములకు జరుగునుకదా. అందుపూర్వస్వరము- మొదటియచ్చు: పరస్వరము-తర్వాతియచ్చు, ఈ రెండచ్చులను - గొట్టివేసి, వానిస్థానమునఁ బరస్వర మేకాదేశమగుట-ఒక్కటియే వచ్చుట సంధియని నిర్వచించినాఁడు. ఈ లక్షణము సర్వత్రసరిపోదు. సరళాదేశాది సంధులందచ్చులే లేనందున నేకాదేశాదులురావు. అయినను అచ్సంధిలోఁ గొన్నిఁటి కిది సామాన్యలక్షణ మనుకొన్నచో దోషమురాదు.

ఉత్తు-హ్రస్వమైన యుకారము. "తపర స్తత్కాలస్య" అనుసూత్ర ప్రకార మేయచ్చు తర్వాతఁ దకారము వాడుదురో, ఆయచ్చుహ్రస్వమైన హ్రస్వమునకు. దీర్ఘమైన దీర్ఘమునకు గ్రాహకము. సాధారణముగా

వ్యాకరణమున ఉకారమన్నచో ఉ, ఊకారములు రెండు నర్థములు. కాని తపరకరణము చేసినందున ఉత్తన హ్రస్వోకారము మాత్రమే యర్థమైనది.

రాముఁడన్న పదములోని చివరి యక్షరము డు-డ్+ఉ+అతఁడు కలియుచుండ ఉ+అ లను గొట్టివేసి పరస్వరమైన అకారమేరాఁగా డ్+అ=డ దీని నేకాదేశసంధి యనిగాని, పరరూప సంధియనిగాని యన వచ్చును. సంస్కృతమునన్న పూర్వరూపసంధి తెనుఁగునలేదు (దాసో+అహం-దాసోఽహం).

౨౦. అనాదిషు విభక్తి షూతో వా; చోర్వా స్యా ద్వర్త మాన విహితస్య.

౨౧. అద్యాన్య విభక్తే శ్శత్రు చోస్తువా

బా. ౨. ప్రథమేతర విభక్తి శత్రర్థచు వర్ణంబులందున్న యుకారంబునకు సంధి వైకల్పికంబుగా నగును.

| | |
|---|---|
| నన్నున్ - అడిగె | నన్నడిగె<br>నన్నునడిగె |
| నా కొఱకున్ - ఇచ్చె | నా కొఱకిచ్చె<br>నా కొఱకునిచ్చె |
| నాకున్-అదరువు | నా కాదరువు<br>నాకు నాదరువు |
| నా యందున్-ఆశ | నా యందాశ<br>నా యందునాశ |
| ఇందున్-ఉన్నాఁడు | ఇందున్నాఁడు<br>ఇందుమన్నాఁడు |

| | |
|---|---|
| ఎందున్-ఉంటివి | ఎందుంటివి<br>ఎందునుంటివి |
| వచ్చుచున్-ఉండెను | వచ్చుచుండెను.<br>వచ్చుచునుండెను |
| చూచుచున్-ఏగెను | చూచుచేగెను.<br>చూచుచునేగెను. |

గు. ప్రథమ+ఇతర విభక్తియందున్న యుకారంబులకు - ప్రథమ తప్ప తక్కిన విభక్తులలోనున్న యుకారములకు — నున్, కొఱకున్, కున్, అందున్- అనునవి. శత్రర్థ చువర్ణము— వర్తమానార్థకమైన— చున్ అన్నది ఇవన్నియు ద్రుతప్రకృతికములే.

వీనిలోని యుకారమనఁగా ద్రుతము లోపించినఁగాని యుకారము లేదు. కనుక నీ సూత్రముచే ద్రుతము లోపించునని జ్ఞాపకమగుచున్నది. వైకల్పికమనఁగా సూత్రములోఁ జెప్పిన కార్యము వచ్చుట-లేదా—రాకుం డుట, కాన, విటసంధియైనచో నన్నడిగెనవియు, సంధికానిచో "నన్నున్+అ(న్న)డిగె"వనియు నైనవి. తక్కినవిట్లే యెఱుంగునది.

## హ. ప్రాణా త్పరస్య ప్రాణస్య సంధ్యభావే యడాగమః

బా. ౩. సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు. ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు.

| | | | | |
|---|---|---|---|---|
| మా | — | అమ్మ | — | మాయమ్మ |
| మీ | — | ఇల్లు | — | మీయిల్లు |
| మా | — | ఊరు | — | మాయూరు |

గు. "ఆద్యన్తౌ టకితౌ" అను సూత్రము ట్, క్‌లు వేని చివర చెప్పఁబడునో ఆ ప్రత్యయము లాద్యన్తావయవములుగా వచ్చునని యర్థము. ఈ యడాగమము (ఉన్న యక్షరము లన్నియు నుండఁగా క్రొత్తయక్షరము వచ్చిచేరుట ఆగమము) పరస్వరంబునకు వచ్చును. అనఁగా మా+అమ్మలో పరస్వరము—అ-దాని కాద్యవయవముగా ననఁగా య్+అ-య—అగును. యట్+ఆగమము—యడాగమము. యట్‌లో య్—అను హల్లే ప్రధానము. ట్—ఆద్యవయవముగా వచ్చునని సూచించునది. య్+అ—య. ఈ అకార ముచ్చారణ సౌలభ్యముకొఱకే కాని ప్రత్యేక ప్రయోజనమేమియు దీనికిలేదు.

**చిం వాత,**

**హ. కా. అత స్సంధి స్తు బహుళం.**

వా. ౪. అత్తునకు సంధి బహుళముగా నగు.

మేన+అల్లుఁడు—మేనల్లుఁడు, మేనయల్లుఁడు
పుట్టిన+ఇల్లు—పుట్టినిల్లు, పుట్టినయిల్లు
చూడక+ఉండెను—చూడకుండెను, చూడకయుండెను.

బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధి లేదు.

అమ్మ+ఇచ్చెను—అమ్మయిచ్చెను

దూత+ఇతఁడు—దూతయితఁడు

చెలువుఁడ+ఇందము—చెలువుఁడ యిందము.

సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పిరిగాని దానికిం బూర్వ కావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు.

ఆధునిక కృతు లందొకానొకచోట స్త్రీ వాచక తత్సమంబులకు సంధి గానంబడియెడు. గంగనుగాసె, నెలతిచ్చెను. వెలయాల్యాముల సంధిలేమి బాహుళకముచేతనే యని యూహించునది.

౫. అత్తు-హ్రస్వమైన అకారము. దీనికచ్చు పరమైనపుడు సంధి బహుళముగా వచ్చును. బహుళమనఁగా "క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్య దేవ। విధే ర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహుళకం వదన్తి" అను కాశికావృత్తికార వచనముంబట్టి నాల్గు రకముల రూపములు వచ్చును. ప్రవృత్తి-నిత్యముగా ప్రవర్తించుట. అంత, అకు మున్నగునవి పరమైనపుడు నిత్యముగా వచ్చుట. కొంత+అంత—కొంతంత. చింత+అకు—చింతాకు. అప్రవృత్తి-నిత్యముగా సూత్రము ప్రవర్తింపకపోవుట_స్త్రీ వాచకములకు, తత్సమములకు, సంబోధనాంతములకు సంధిలేదు.

అమ్మ యిచ్చెను. (స్త్రీ వాచకము) దూత యితఁడు _ తత్సమము. (స్త్రీ సమము): చెలువుఁడయింతము _ సంబోధనాంతము. విభాష-వికల్పముగా వచ్చుట, లేక రాకుండుట _ మేనల్లుడు, మేనయల్లుఁడు అన్యదేవ అననుగతికమైన వేఱు రూపమువచ్చుట_ఒక+ఒక - ఒకానొక, తమల+అకు-తమలపాకు ఇత్యాదులు.

అధర్వణాచార్యులు "భవన్తి కేచి చ్ఛబ్దాస్తు సాంగత్యే నైవ సాధవః కుత్రచి త్సంస్కృతీయో ఽపి ప్రాణో వ్యత్ర చ్యుతో భవేత్" సంస్కృత శబ్దముల చివరనున్న యచ్చునకును సంధికల్గు"ననెను మృగ్యంబుగ్య వెదుకఁదగినది. అనఁగా ప్రచురముగాఁ బ్రయోగములలో లేదని

యర్థము. గంగ+అనుకాసె-గంగమకాసె. గంగ-తత్సమము. నెలఁత+ ఇచ్చెను నెలఁత-స్త్రీ వాచకము.

వెల+ఆలు-వెలయాలు మున్నగుచోట్ల నిత్యముగా సంధికాదు- అనఁగా "వెలాలు" రూపము తప్పు. "పడఁకుబెరాని చేష్టడిగె వశము వశుఁ జానుపుల్ చొరన్ ఆము, 4 ఆ." "ఊ ప్రక్కన్ ద్విజుఁజూడ రయ్య పభవారీ రంగభర్త్రుచు. ఆ., 6 ఆ. ఇట్టి తత్సమాకార సంధులు కన్పడుచున్నవి "అకు, అంత, అమ్మ, అయ్య, అన్న, అక్క, అప్ప" వీనికి సంధి నిత్యమనిరి కాని అకు పరమైనపుడు "పాటింతువెద్దలు తద్ద నమ్మి నయిదాఁటే వాని కిం జింతయా కంతైనన్ (పాండు. 4. ఆ) ఇకారమునకాకు పరమగునపుడు సంధి శ్రుతి కటువుగా నుండును. మద్రాకు కాటాకు, మున్నగువానిని తాటియాకు, మద్రియాకు అనుటయే లెస్స. "అంత" పరమైనపుడు సాధారణముగా సంధియగు. "తనయంత"కానఁగా వచ్చు వేళ వీఁగ త్తలాన పడక తనయంత జగములఁ బరగుచుండు. విర్వ. 1 ఆ"

అవధారణార్థకమైన అకారమునకు సంధి కలుగదు. "సీవ యసుం గుంజెలివి" అట్లయగు నాఘశ్నేరముల్పేయ" మున్నగునవి.

"కురువృద్ధ రాజులొద్ద" "నీ తల్లిదండ్రులొద్ద" "రాజులాజ్ఞ" 'సురారులమ్మ కడుపారడి పుచ్చినయమ్మ' 'చదివించెద నార్యులొద్ద' 'తామరస నేత్రలిండ్ల బిందాలుగారె' మున్నగు తత్పురుషములందును సంధి కన్పట్టుచున్నది.

చిం. ప్రాయ స్తు స్యాత్క్రమాదిక స్యైతః
హ. కా. కిమా దితో విభాషయా.

౮౫. ౫. ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగానగు. ఏమి, మఱి, కిషషి, అది. అవి, ఇది, ఇవి, ఏది, ఏవి - ఇది యాకృతిగణంబు.

ఏమి....అంటివి { ఏ మంటివి / ఏమి యంటివి }

మఱి....ఏమి { మఱేమి / మఱియేమి }

హరికిన్....ఇచ్చె { హరికిచ్చె / హరికినిచ్చె }

గు. ఏమి మున్నగు వానిలోని హ్రస్వ ఇకారమునకుసంధివికల్పము. అనఁగా సంధి రావచ్చును, లేదా మానవచ్చును. 'కి' షష్ఠీవిభక్తి ప్రత్యయమైన 'కిన్' అన్నది. ఈ చెప్పుటచే దాని చివరనున్న ద్రుతమును వదలి యికారమునకు మాత్రము సంధియగునని తెలియఁబడుచున్నది. ఆకృతిగణం- పోలికచే నూహించుకోఁదగినవి. ఇకారసంధికల శిష్టప్రయోగంబుల నిందుఁ జేర్చుకోవలెనని తాత్పర్యము. ఆంధ్రభాషాభూషణమున 'బంతి+ఇది- బంతిది' అనియు, సర్వలక్షణసార సంగ్రహమున 'అనతిచ్చు, మగనాలు పురుటాలు, బండెద్దు, పెండ్లాడి, పెందుంగరము, పైడందెలు, తంద్రేడి' మున్నగు వానికిని వికల్పసంధి చెప్పఁబడినది అహోబలపతి 'మగనాలు' నిత్యసంధి యనెను. కాని "ఓర్పుమైనుప్పిండి యుపవాసముండని, మగనాలి నరిఁబోల్పఁదగదు విధపు" కాశీ. 2ఆ. "అసమయంబున నృగనియాంధ్రును గన్యలు" ఉత్తరరామా. అని ప్రయోగమున వికల్పము గన పడుచున్నది. 'ఉండుమనట్లుగానఁ దెలివొంది' భార. ఉద్యో. 1 ఆ. "ఇది యొకచేల"

నార. ఉద్యో. 1 ఆ 'కదఁకయనువుగఁజేసి ప్రొయ్యిఁదుమఁగాని' భార.
విరా. 1 ఆ 'శయ్యపైఁదఁ గనుదో యొలయన్' భార. శల్య. 1 ఆ.
ఇత్యాది ప్రయోగంబులు కవిత్రయేతరుల రచనల లెక్కకు మీఁఱియున్నవి.

బా. ౨. క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు.

వచ్చిరి....అప్పుడు = వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు

వచ్చితిమి....ఇప్పుడు = వచ్చితిమిప్పుడు, వచ్చితిమియిప్పుడు

గు. క్రియాపదముల చివరనున్న యికారమునకు మాత్రమే యీ వికల్పము.

**చిం. నిత్య మనుత్తమ పురుషక్రియా స్వితః.**

**హ. కా. మధ్యమక్రియేత స్సంధి స్స్యాత్.**

బా. ౭. మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధియగును.

ఏలితివి....అపుడు = ఏలితివపుడు

ఏలితి....ఇపుడు = ఏలితిపుడు

ఏలితిరి....ఇపుడు = ఏలితిరిపుడు.

స ఉత్తమపురుషకాక తక్కిన ప్రథమ, మధ్యమ పురుషేకారము నకు నిత్యమని నన్నయ చెప్పఁగా, మధ్యమపురుషకు నిత్యమని సూరి చెప్పెను. దీనివలనఁ బై సూత్రము వ్యర్థమగుచున్నది. మధ్యమ పురుషకు నిత్యమనఁగా పరిశిష్టన్యాయాత్తు ప్రథమోత్తమే కారములకు వికల్పము

సిద్ధించెను గదా. "ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవే చ్ఛృతిః" అన్నది దీనికిఁ బ్రోద్బలకము.

చిం. అపి శబ్దార్థ స్యేతః

సు. అపి శబ్దార్థకమైన 'ఏని' శబ్దములోని 'ఇ'కారమునకు లోపము వికల్పముగా వచ్చును.

ఎందేని+దెందము=ఎందేనిదెందము, ఎందేదెందము.

హ కా. క్త్వార్థేతో నైవ సర్వదా

బా. బ. క్త్వార్థంబైన యికారమునకు సంధిలేదు.

వచ్చి....ఇచ్చెను=వచ్చియిచ్చెను

సు. 'క్త్వార్థేతో నభవేత్సదా'. అన్నకారిక దీని కాధారము కావచ్చును. తెనుఁగున ధాతువులన్నియు నుకారాంతములే. భూతకాలికా సమాపక క్రియకుఁ చివర 'ఇ' చేరును. వచ్చు+ఇ—వచ్చి. వెళ్ళి, చేసి మున్నగునవి.

ప్రౌఢవ్యాకర్త కొన్ని ప్రయోగములఁజూపి దీనిని నిరాకరించెను. 'ఇతఁడు మదీయాగ్రపురోహితుఁ డితనికి నెల్లపనులు నెఱిఁగించిపుడే. 'భార, ఉద్యో. 1 ఆ.' (ఎఱిఁగించి తగన్ అని పాఠాన్తరము కలదు.) 'నమ్ముముదైదుపుమోపగు, జమ్మి వెసంబ్రాఁకి విడిచి చాపము నాకం, దిమ్మనుడుఁ జేయునదిలే, కమ్మద్దందమ్మహీజము మలసతనెక్కెన్. భార. విరా. 4 ఆ.' దీనిలో 'అందిమ్ము అంది+ఇమ్ము' అని క్త్వార్థసంధి యను కొనుచున్నారు. కాని అంచు+ఇమ్ము-అందిమ్ము అను శబ్దపల్లవముగాఁ జెప్పికొన్నచో దోసము కాన్పింపదు. ఇఁక, ఎఱింగెఱింగి-భాగ' 'అవల

పంటిగా తెలియఁగవా. విజయ. 1 ఆ' ఇత్యాది ప్రయోగములు నిరాక రింపఁదగినవి.

## సూ. కా. ద్రుతప్రకృతికానాంతు సంధి ర్నేఁకాదికాన్వినా

**వా. గా. ఇఁకాదులకుఁదప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు**

**ప్రథమేతర విభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడివి.**

వచ్చున్....ఇపుడు—వచ్చునిపుడు

చూడన్....అయితి—చూడనయితి

ఉండెడిన్....అతఁడు—ఉండెడినతఁడు

ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని, ఈయవి యిఁకాదులని యెఱుంగు నది. వీనికి సంధి వైకల్పికము.

గు. ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని-అను నీ నాల్గు ద్రుతప్రకృతి కములకుఁదప్ప తక్కినవానికి సంధిజరుగదని దీని యర్థము. సంధిపరిచ్ఛేద మున రెండవ సూత్రములో-ప్రథమేతర విభక్తి శత్రర్థ చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వికల్ప-మని చెప్పఁబడినది. అవికూడ ద్రుతప్రకృతి కములే ఇఁకాది సూత్ర ప్రకారము ప్రథమేతర విభక్తి సంధి జరుగరాదు. కాని, అట్లు సంధి జరుగనిచో ప్రథమేతర విభక్తి సంధి సూత్రము వ్యర్థ మగును అనఁగా దానికిఁ బ్రవృత్తియే లేకపోవును. అదే నిరవకాశమగుట. వ్యర్థమైన సూత్రము వ్యాకర్త చెప్పునా? చెప్పఁడు కాన, ఆ చెప్పుటవలన, నీ రెండు సూత్రములను సమన్వయించి మఱొక సూత్రము చెప్పుకోవలెను. 'ఇఁకాదులకు, ప్రథమేతర విభక్తి శత్రర్థ చువర్ణంబులందున్న యుకారము లకుఁ దప్ప, ద్రుతప్రకృతికములకు సంధిలేదు' అని. దీనివలన నేదియు

వ్యర్థముకాదు: బాధరాదు. ఒక సూత్రము నిరవకాశమైనప్పుడది బాధక సూత్రముతోఁ గలిసి క్రొత్త సూత్రమును బుట్టించునని నియమము. దీని క్రింద నిచ్చినవి సంధిరాని రూపములు. సంధి యగునవి-ఇఁకన్+ఏమి-ఇఁకేమి, అందున్నాఁడు, వచ్చుచుండెను మున్నగునవి.

చిం. అద్య స్యా మ్రేడితే ఒ న్త్యలోప శ్చ

హ.కా. భవేచ్చ ప్రాయశ స్సంధిః ప్రాణి స్యామ్రేడితే పరే.

బా. ౧౦. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు.

ద్విరుక్తము యొక్క పరరూపము మామ్రేడిత మనంబడు. తఱచుగ ననుటచేత నొకానొకచోట వైకల్పిక సంధియుంగలదని తాత్పర్యము.

ఔర....ఔర....ఔరౌర

ఆహా... ఆహా... ఆహాహా

ఎట్టా....ఎట్టా....ఎట్టెటా

ఓహో....ఓహో....ఓహోహో

ఏమి....ఏమి.... { ఏమేమి / ఏమియేమి }

ఏగి ఏగి యనుచో క్త్వార్థంబగుట సంధిలేదు.

గు. ఆమ్రేడిత మనఁగా రెండుసార్లుచ్చరింపఁబడిన పదములలో రెండవది. 'బార+బార' ఆమ్రేడితం ద్విస్త్రి రుక్తం' అని యమరముసఁ జెప్పినట్లు రెండు మూఁడుసార్లుచ్చరింపబడినదని యర్థము కాఁగా 'తస్యపర మామ్రేడితం' అను కౌముదిసూత్ర ప్రకారమీ యర్థము వచ్చెను. తఱుచుగ ననుటచేతఁ గొన్నిచోట్ల వికల్పమని తెలియుచున్నది. 'ఏమియేమి' అన్నది వికల్పమున కుదాహరణము 'ఏగి యేగి' యన్నపుడు క్త్వార్థకారమగుటచే సంధికాదు.

చిం. పరిమితౌ నమస్తానాం

హ కా. అనంద్వవగ్గతే నంధి రపదాదిన్వరే ప్యచః

బా. ౧౧. అంద్వవగాగమంబులందప్ప నపదాది స్వరంబుఁ పరంబగునపు డచ్చునకు సంధియగు.

మూర .... ఎఁడు .... మూరెఁడు
వీసె .... ఎఁడు .... వీసెఁడు
అర్థ .... ఇంచు .... అర్థించు
నిర్జి .... ఇంచు .... నిర్జించు

అంద్వవగా గమంబులు పరంబు లగునపుడు యథాసంభవముగా గ్రహించునది. రాములందు-రాములయందు: హరియందు: ఎనిమిదవది, ఎనిమిదియవది.

అగు. 'అంచు, అవ' అనునవి పరమైనప్పుడు తప్ప, మరి ఏ పదాది కాని యచ్చు పరమైనను సంధి నిత్యముగానగును. 'ఎఁడు, ఇంచు' అన్న వానిలోనున్న యచ్చు పదాదినున్నది కాదు. పదమనఁగా విభక్తి ప్రత్యయ

ములు కాని క్రియాప్రత్యయములైన డుజ్ఞులు కాని కలసి. 'ఎడు,ఇంచు' అన్నవి ప్రత్యయములే కాని పదములుకావు. వీనికి స్వతంత్రముగా నర్థము 'వియ్యఁగల శక్తిలేదు' అందుచే, 'ఎడు,ఇంచు' పరమైనపుడు సంధియైనది. 'అందు,అవ' పరమైనపుడు సంధి వికల్పముగానైనది. ప్రయోగములఁబట్టి యీ సంధి బహుళముగా జరుగుచున్నవి. 'హరియందు' నిత్యప్రవృత్తియు, 'రాములందు, రాములయందు' వికల్పమును, 'పదునొక్కటవ' అన్నచో నిత్యముగను రూపములగును

సూ. వా నిడు, నడు, కడు, చిఱు, కుఱుగత
డఱయోః ప్రాణే పరే తు టౌ ద్వౌ స్తః।

వా ౧౨. కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల 'ఱ,డ'ల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగు.

| | | | | |
|---|---|---|---|---|
| కుఱు | .... | ఉసురు | .... | కుట్టుసురు |
| చిఱు | .... | ఎలుక | .... | చిట్టెలుక |
| కడు | .... | ఎదురు | .... | కట్టెదురు |
| నడు | .... | ఇల్లు | .... | నట్టిల్లు |
| నిడు | .... | ఊరుపు | .... | నిట్టూరుపు |

౧౩. 'కుఱు, చిఱు,'లలోనున్న 'ఱ'కారమునకు 'కడు,నడు,నిడు'లలో నున్న 'డ' కారమునకు ద్విరుక్తటకారము (ట్ట) ఆదేశమగును అనఁగా ఱ డ లను గొట్టివేసి 'ట్ట' వచ్చును కుఱ్+ఉ+ఉసురు=కుట్ట్+ఉ+ఉసురు = కుట్టు+ఉసురు = కుట్టుసురు. ఇట్లే తక్కినవియు.

'కడునెండ యెక్కు-వంతకు భార. అర. 2ఆ.' 'కడునధికు తోడఁదొడరిన, భార. సభా, 1ఆ.' వీనిలోని "కడునెండ, కడువధికుతోడ" నన్నపదములు సమానపదములుకాక వ్యస్తపదములు. సూత్రములోఁ జెప్పకున్నను సమస్త పదములకే యీ చెప్పిన సంధి నిత్యమని చెప్పుకొన్నచో నీ దోషమేరాదు. "కుఱుచ,చిఱుత" శబ్దంబుల కంత్యాక్షర లోపమురాగా శేషించిన రూపములే "కుఱు, చిఱు" పదములు. ఈ లోపము వృత్తిలోఁ (సమాసమైనపుడు)గలుగును. "చిట్టెలుక" మున్నగుచోట్ల "చిట్టి+ఎలుక" అనియు, చిట్టిలోని టాద్విత్వమునకు లోపమురాగా "చిటివాప" మున్నగు రూపములేర్పడినవని, ప్రౌఢవ్యాకర్త చెప్పెను.

చిం గసడదవా స్స్యుఃప్రథమామాత్రా దాత్మా న్మదో ర్ద్వినైవైతే

హ. కా. గసడదవాః పరుషాణాం,పరతః ప్రథమాంతతో బహుళం స్యుః.

బా. ౧౩. ప్రథమ మీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు.

| | | |
|---|---|---|
| వాఁడు — | కొట్టె — | వాఁడుకొట్టె, వాఁడుగొట్టె |
| అపుడు — | చనియె — | అపుడు చనియె, అపుడు సనియె |
| నీవు — | టక్కరివి — | నీవు టక్కరివి, నీవు డక్కరివి |
| మీరు — | తలఁడు — | మీరుతలఁడు, మీరుదలఁడు |
| వారు — | పోరు — | వారుపోరు, వారు వోరు |

అప్పుడెప్పుడను శబ్దములు నిత్యైకవచనాంతములు·వాగనుశాసనులు యదా తదా యనిగ్రహించుట ప్రపంచార్థమని యెఱుఁగునది. ఈ కార్యము కళలగు క్రియాపదములమీఁద నహతముకానంబడియెడి.

రారు కదా రారుకదా, రారుగదా

వత్తురు పోదురు వత్తురువోదురు, వత్తురుపోదురు

గు ప్రథమా విభక్త్యంత పదముఁమీఁది పరుషములకు గసడదవలు వరుసగా (యథాక్రమముగా) వచ్చును. చివర "డుమువులు" ఉన్నను. ద్వితీయాదివిభక్తి ప్రత్యయములు లేకున్నను(అన్న, తండ్రి, సీత మున్నగు వానిలో డుమువులు లోపించును.) ప్రథమావిభక్తిలోనున్నట్లే, తెలియ వలెను. "వాఁడు, నీవు" ఏకవచనములు. "మీరు, వారు" బహువచనములు "అపుడు"అన్న దవ్యయము. అవ్యయములు లా ప్రప్రథమా విభక్తికములై. యుండును. కావఁబ్రథమా విభక్త్యంతములే వన్నయ కళలను జెప్పునపుడు 'సుస్' అని ప్రథమా విభక్తిని ముందుగాఁ జెప్పి, "యదా తదా" అని తర్వాతఁ జెప్పినాఁడు. అప్పుడెప్పుడను నవి ప్రథమావిభక్తికములేయైన యెడల 'సుస్' అనుటతోనే సరిపోవుచుండ, మఱలఁజెప్పుటచే 'అప్పుడిప్పు డెప్పు'డను నవి ప్రథమా విభక్తికములుకావని ప్రశ్న యుదయించినది. దానికి సూరి "ప్రపంచార్థమని యెఱుంగునది" అని సమాధానమిచ్చెను స్పష్టార్థమై చెప్పినదేకాని పునర్గ్రహణమునకుఁ బ్రత్యేక ఫలమేమియు లేదని తాత్పర్యము "తలఁడు"అన్నది "తలఁగు"ధాతువునకు సంత్యవర్ణము క్రియాపరిచ్ఛేదము· 101సూత్రముచే లోపించఁగా నిష్పన్నమైన రూపము. "తొలఁగుడు" అని యర్థము. రారు-వచ్చు ధాతువు వ్యతిరేకార్థకప్రథమ పురుష బహువచనరూపము· పోరు-పోవుధాతువుయొక్క(వ్య ప్ర· పు.2 ( రూపము.

"పరుషా వా స్వరూ పేణ ప్రథమాంతో పరిస్థితాః॥ కాకొ సంటో థనే చాపి హ్యవ్యయే కర్మధారయే॥ అచేతనార్థకే శబ్దే ఇతి శృంగార భూషణః" అని శృంగారభూషణుని మతమున "కాకు సర్వబోధకములైన

"ఎ ఏ ఆ" ప్రభృతులును, సంబోధనాంశము , అవ్యయము -, సచేత నార్థకములును పూర్వమైనప్పుడు వికల్పము. "సనావృత వృత్తంబుఖగాని సింహములకున్ వేగంబచేదొందు గ్రావతగం బొంపట కార్యమీయుభ యము స్వంతుష్టిమైనున్కికిన్." భార. ఉద్యో. దీనిలోని "కాన" అన్నది సనార్థకము (కాన - అడవి) కాని "కావన్...అంపుచే" అనునదికాదు. కావున దీనిపైనున్న తకారము దకారముకాలేదు.

**చిం. న వికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః॥**

**హ. కా. వైకృతేభ్య స్సాంస్కృతికపరుషాణాం న తే మతాః॥**

బా. ౧౪. తెనుఁగుమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు.

| | | | | |
|---|---|---|---|---|
| వాఁడు | .... | కంసారి | .... | వాఁడుకంసారి |
| వీఁడు | .... | చక్రపాణి | .... | వీఁడు చక్రపాణి |
| ఆయది | .... | టంకృతి | .... | ఆయదిటంకృతి |
| అది | .... | తథ్యము | .... | అది తథ్యము |
| ఇది | .... | పథ్యము | .... | ఇది పథ్యము |

గు. తెనుఁగు శబ్దముతర్వాత వచ్చిన సంస్కృత శబ్దములోని కచట తపలకు గసడదవలురావు. వాఁడు అన్నది తెనుఁగు పదము. కంసారి సంస్కృతపదము. అందుచే నిట కకారమునకు గకారమురాలేదు. విస్పష

నోత్తర రామాయణమున "ఇట్లుదపంబు సేయుచుండెద" 5 ఆ. "పెంపు పరీక్షింప" వను. "ఎవ్వండు పఠించెడువాడు ధన్యుఁడు మునిప్రవరా" కాశీ. "పీరల్గోపించిన" ఉ. హరి. అని తెనుఁగులమీది పరుషములకును గసడదవాదేశము కన్పట్టుచున్నది. "తపశ్శబ్దభవము దపను" అని చూచు కొన్నచో నీ దోషంబు రాదు. "తెనుఁగుమీది" అనుటచే సంస్కృతశబ్దములమీఁది వానికి రావచ్చునని తోచుచున్నది. "కావలియై సురరాజ్య, శ్రీ వాలింపంగఁదగు విశేషంబున" భార. ఉద్యో. 1 ఆ శ్రీ+పాలింప" అనుచో సంస్కృతంబు మీఁదిది కాన దీనికి వాదేశము నిరాబాధము. చింతామణిలో "ప్రథమాసూత్రాత్" అని మాత్రపదము వేసి, నేను, తాను ప్రథమలుకన్న రావలెఁ వచ్చునని శంకించుకొని, "ఆత్మాద్యకోర్నైవ" అని వానికి ద్రుతప్రకృతికములై నందున సరళాదేశమేకాని గసడదవలు రావని చెప్పెను వానికి సూరి ద్రుతప్రకృతికములలోఁ జెప్పినందున విట వేరుగాఁ జెప్పలేదు.

చిం. పరుషాణాం గసడదవా స్యుః పదా ద్వన్ద్వే
హ.కా. ద్వంద్వే పదోపరిస్థానాం పరుషాణాం భవంత్యమీ

బా. ౧౫ ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు.

| | | | | |
|---|---|---|---|---|
| కూర | .... | కాయ | .... | కూరగాయలు |
| కాలు | .... | చేయి | .... | కాలుసేతులు |
| టక్కు | .... | టెక్కు | .... | టక్కుడెక్కులు |
| తల్లి | .... | తండ్రి | .... | తల్లిదండ్రులు |
| ఊరు | .... | పల్లె | .... | ఊరువల్లెలు |

గు. ద్వంద్వ సమాసమున నుత్తరపదాదియందున్న పరుషములకు గసడదవలగును అనుటనఁగాఁ దెలుపుగనగునని భావము. కూర+కాయ=

కూరగాయలు మున్నగుచోట్ల నాదేశము వచ్చినది. ద్వంద్వ సమాసమునం బూర్వపదము తఱుచు (సమాస 7. సూత్రముచే) స్త్రీ సమమగును. దీన నీయాదేశమురాని ప్రయోగములును గలవు. అందచందములు, కండతుండె ములు, రాకపోకలు, అప్పచెల్లెండ్రు "కశ్యప భార్యలిరువు రప్పచెల్లెం డ్రవిమిషుల నమర గణముంగనిరి" నిర్వ. 4 ఆ ఇట్లాదిపదాంత్య స్వర దీర్ఘము సంస్కృతములోను గలదు. మిత్రావరుణులు, అగ్నీషోములు మున్నగునవి. అన్నాదమ్ములు మున్నగు ప్రయోగములు విశ్లే సాధువు లగును.

## చిం. పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యుః
## హ.శా. ద్రుతప్రకృతికా ద్యాంతి పరుషా స్సరళాత్మతాం

బా. ౧౬. ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు.

| | | |
|---|---|---|
| పూచెను | కలువలు | పూచెను గలువలు |
| తోఁచెను | చుక్కలు | తోఁచెను జుక్కలు |
| చేసెను | ట*క్కలు | చేసెను డక్కులు |
| నెగడెను | తమములు | నెగడెను దమములు |
| మొగిడెను | పద్మములు | మొగిడెను బద్మములు |

గ. పూచెను— చివర నకారమున్నది కాన నిది ద్రుతప్రకృతికము దీనిమీఁదనున్న "కలువలు"లో కకారమునకు గకారము వచ్చినది. ఇట్లే "కచటతప"లకు 'గజడదబ'లు వరుసగా వచ్చును.

## చిం. తద్ధ్రుతం చ బిందు స్స్యాత్
## అధికారగతే తస్మి న్నపి సరళా ఏవ వంతి తే పరతః

## సూ.కా. వాదేశ సరళాధస్తు ద్రుత స్సంశ్లేష బిందుభాక్

బా. ౧౭. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు. సంశ్లేషంబనఁగా మీఁది హల్లుతోఁ గూడి కొనుట

| | |
|---|---|
| పూచెను గలువలు | పూచెంగలువలు<br>పూచెఁగలువలు<br>పూచెన్గలువలు |
| తోఁచెను జుక్కలు | తోఁచెంజుక్కలు<br>తోఁచెఁజుక్కలు<br>తోఁచెన్జుక్కలు |
| చేసెను దక్కులు | చేసెందక్కులు<br>చేసెఁదక్కులు<br>చేసెన్దక్కులు |
| నెగడెను దమములు | నెగడెందమములు<br>నెగడెఁదమములు<br>నెగడెన్దమములు |
| మొగిడెను బద్మములు | మొగిడెంబద్మములు<br>మొగిడెఁబద్మములు<br>మొగిడెన్బద్మములు |

పక్షంబున స్వత్వంబగు. స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతి భావము.

గు. ద్రుతప్రకృతికముమీఁద నాదేశముగా (పరుషమును గొట్టివేసి దాని స్థానమున) వచ్చిన సరళములకు ముందున్న - పూర్వమందున్న ద్రుతమునకు—న్—ను కారములకు బిందు సంశ్లేషములు- బిందు— బిందు మున్న, అఱసున్న, సంశ్లేషమనఁగా మీఁది హల్లుతోఁ గూడికొనుట, ఇవి విభాషగా వచ్చును. విభాష—వికల్పము: వైకల్పికమనన్న నొక్కటే. సూత్రమునఁ జెప్పిన కార్యము వచ్చినవచ్చుట, లేదా రాకుండుట రాని పక్షమున మఱొక రూపము కల్గును. అనఁగా ద్రుతమునకు నఱసున్న వచ్చిన రూపమొకటి-పూచెఁగలువలు: బిందుసున్న వచ్చిన రూపము రెండు— పూచెంగలువలు: సంశ్లేషము వచ్చిన రూపము మూఁడు-పూచెన్గలువలు: పక్షంబున-ఇవేవియు రానిపక్షమున, స్వత్వము. ద్రుతము ద్రుతముగానే యుండుట. అప్పుడు, చింతామణి- అవికారగతే తస్మిన్నపి - ద్రుతము బింద్వాది రూపములుగా మాఱకున్నను: తే-పరుషములు: సరళా ఏవస్తి- సరళములే యగును అన్న ప్రకారముగా పూచెను గలువలు" అని యగును. అనఁగా మొత్తము నాలుగు రూపము లేర్పడునని తేలినది. ఉదాహరణము లైదు నైదు సరళములకుగా నీఁబడినవి.

చిం. ఙగ్వా ద్రుత ప్రకృతికా త్పరత స్సరళే స్థిరే చ సస్య స్యాత్ అలుకి చ సంశ్లేష స్స్యాత్.

హ. కా. వా స్యాతాం లోపసంశ్లేషౌ ద్రుతస్య సరళే స్థిరే.

బా. ౧౫ ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబులగునపుడు లోప సంశ్లేషంబులు విభాషనగు.

| | | |
|---|---|---|
| వచ్చెను - గోవులు | { | వచ్చెగోవులు<br>వచ్చెఙ్గోవులు<br>వచ్చెనుగోవులు |
| మెఱసెను — ఖడ్గము | { | మెఱసెఖడ్గము<br>మెఱసెఙ్ఖడ్గము<br>మెఱసెనుఖడ్గము |

గు. పూర్వసూత్రమున నాదేశ సరళములు పరమైనపుడు వచ్చు రూపములఁ జెప్పియున్నాఁడు. ఇప్పుడు నైజమైన సరళములుకాని, స్థిరములు (పరుష సరళములుకాక తక్కిన యక్షరములు) కాని పరమైనపుడు ద్రుతమునకు లోపముకాని సంశ్లేషముకాని వికల్పముగానగును. పక్షమున స్వత్వమగును. మొత్తము మూఁడు రూపములు సిద్ధములగుచున్నవి. పరుషములు పరమైనపుడు లోపమురాదు. ఇక్కడ నదివిశేషము. ఇక్కడ నలమన్నరాదు.

**చిం బిందుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్.**

**హ వర్గయుక్పరశేష స్యా త్పూర్వ బిందు ర్ద్రుతః క్వచిత్.**

బా· గ౯· వర్గయుక్సరళములు పరములగునపు డొక్కా నొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానం బడియెడి.

| | | | | |
|---|---|---|---|---|
| వచ్చెను | .... | ధాత్రీపతి | .... | వచ్చెంధాత్రీపతి |
| పాడెను | .... | గంధర్వుఁడు | .... | పాడెంగంధర్వుఁడు |
| కన్ | .... | దోయి | .... | కందోయి |

రు· చింతామణిలో "క్వచిత్, కేచిత్" అన్నదానికి "వర్గయుక్కులు, సరళములును పరమైనపుడు"నని నిర్దేశించినా టీకాకర్తలు. వర్గయుక్కు-

అనగా వర్గములలో సరియక్షరములు. క చ ట తపవర్గులైదు. అందుసరి— 2,4 అక్షరములు·"ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ,భ."వీని నేయొత్తక్షరములని పలుకబడినిఁబట్టియో, క్రిందనున్న గీతలఁబట్టియో పిల్తురు కాని యది సరికాదు· క్రిందగీసిన గీత లొత్తులుకావు. ఒత్తులమపదము హల్లులు సంయుక్తములగునపుడు వానికి బదులుగా వ్రాయఁబడు గుర్తులకే రూఢ మైనవి కస్ను-రూపాంతరము కను:దానికి రూపాంతరము కస్ ఇట22వ సూత్రముచేఁ బొల్లుహ్రస్వమైన "క"మీఁద సఱమన్నరాము· "ఒకానొకచో" నన్నంపున ప్రయోగములు తక్కువయని సూచన యగుచున్నది.

ఏ రావతా ప్రుతమున కన్నిహల్లులను బరములైనపుడు వచ్చు రూప ములన్నియు నీఁయబడినవి. అచ్చులు పరమైనచో "వచ్చెన్+అతఁడు-వచ్చెనతఁడు" అను నట్లు కలియును కాని చింతమణికారులవి మతమున యకారాదిపదములు కొన్ని యున్నంపున (అద్యః క్రియాసు భూతార్థదో కిన మాద్యగం వినా సర్వః) వాని విషయమై యేమగును? అన్న ప్రశ్న యుదయించినది. "సర్వ త్రాజ్య తాకార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతి కేభ్యః" ద్రుతప్రకృతికములకుఁ బరమైన యకారమునకునచ్చునకుపలెనే కార్యము తెలియఁదగినది. అని చెప్పుటచే యకారాది పదములున్నట్లు నిశ్చయముకాఁగా మఱి యచ్చు పరమైనప్పుడేమి జరుగునో? యన— "యత్సంశ్లేషా నాచి ద్రుతస్య ద్రుతమున కచ్చుపరమైనపుడులోప సంశ్లేష ములురావు." అని చెప్పియున్నాఁడు.

ద్రుతమునకు మకారము పరమైనపుడు గొన్నిచోట్ల ద్రుతమునకును మకారమే వచ్చుచున్నది· "క్వచిత్క్వచిత్" అనుటచే ద్రుతమున కట్టి తఱి పూర్ణబిందువురాఁగా బిందువునకు మకారము పరమైనపుడు మకారము వచ్చును· "కమ్మని లతాంతమ్ముల కుమ్మొనసివచ్చు." భార. ఆది. 5ఆ (కున్+మొనసి) "వృష్టిఁజేసెమ్మ హానది" భార. అర. 3ఆ· చేసెన్+

మహానది) వీనిలో ద్రుతమున కనుస్వారము రాఁగా నది మకారమైనది. "అహమాదీనాం ద్విత్వం" అను సూత్ర వ్యాఖ్యానమున నహోబల పండితీయమున 'శబ్దానా మంత్యభాగేషు యోఽనుస్వారః ప్రదృశ్యతే। తస్యాపి పరతో మ స్స్యా త్సర్వత్ర కవిసమ్మతేః. కేచి ద్యదంత్యభేదస్య మనుస్వారమకారయోః అనుస్వారమకారయో రభిన్నత్వంచ మకారే పర ఏవ" అనుట కిదే తాత్పర్యము.

చిం ద్రుతస్య స్యా ల్లుక్ వాక్యాంత గత పదానాంచ

హ. లోపో బహుళ మంతే స్యా ద్దురితాచోఽపి ద్రుతస్య వా.

బా. ౨౦. అవసానంబునందు ద్రుతస్వరంబునకేనివి, ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు.

వాఁడువచ్చెన్, వాఁడువచ్చె, వాఁడువచ్చెను. ఈ లోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబయియుండు. గుర్వవసాయియగు పద్యంబుతుదను వ్యత్వంబులేదు. అతిశయముగ బుద్ధిమంతుడఁగు బుధపేవన్.

గు. అవసానమనఁగా సమాప్తి. వాక్యసమాప్తి, లేక పద్యసమాప్తియైనను కావచ్చును. ద్రుతముయొక్క యచ్చునకు లోపము- వచ్చెన్: ద్రుతమునకు లోపము-వచ్చె. పద్యాంతము అందు గణానుసారముగఁ గవివివక్షాధీనమైయుండును. గురువుచివర నుండవలసిన-సంధిపద్యమునైనచో 'బుధపేవన్' అన్నట్లు లోపించదు. [illegible] గువవియైనచో [illegible] సూర్యునకు లతాంగి (మొక్కె [illegible] ఇది ర అ, అవి లోపము [illegible]

**సూ. శృంగార భూషణమతే ద్రుతా దపి పరో ద్రుతః**

వా. ౨౧. కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. అదియునున్నాకః దివంబునుంబోలె.

గు. ద్రుతముమీఁద నకారము కొన్నిచోట్లఁ గనపడుచున్నది అదియును+న్+నాక, దివంబును+న్+పోలె; ఈ నకార మనవసరమైనను శైలికొరక గుణమునే కల్గించును దోషములేదని భావము. 'నాకునుం బోలంగ నీవ భర్తవది' భార. ఆది 3 ఆ. 'సంతతసత్కీర్తి పిండసత్కృతి యును నత్యంత మహారాజ్యమును, భార."

**సూ. శబ్దాద్య హ్రస్వతో నార్ధబిందు, ర్లోపో ద్రుతవ్యచ వినేఁకాఁటా.**

వా. ౨౨. అఁట, యిఁక, మఁడు శబ్దంబులందప్ప నుడితొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును, ద్రుతంబునకు లోపంబునులేవు.

ముంగొంగు, క్రొంబసిఁడి, కన్దోయి.

గు. నుడి=మాట-పదము. అఁట= వచ్చినాఁడట, నేర్పెనఁట. ఇఁకన్ =(రూ) ఇఁగ= ఇంకను. మఁడు-వచ్చినాఁడు మఁడీ, చేసెఁజూడీ మున్నగుచోట్ల వాఁడబడు మఁడు—సుమ్మునకు పర్యాయమైనది. ఈమూఁడు పదములందుఁ దప్ప, మాట మొదటిహ్రస్వముపై నర్ధబిందువులేదు. "ఎఁడు" అను మాసార్థ ప్రత్యయమునకున్నను, అది ప్రత్యయమేకాని పదముకాదు. పదమనఁగా విభక్తిప్రత్యయాంతమైనది. ప్రత్యయమునకు విభక్తిప్రత్యయములుండవు. కాననది పదముకాదు. "అంట, ఇంక, మండు" అనియు నీమాట లుండవచ్చును సంజ్ఞా. 14చే. నిండుమన్నయు రావచ్చును.

ముందు+కొంగు 36వ సూత్రముచేఁ దొలియచ్చుమీఁది వర్ణంబులు (ందు) లోపించగా ము+కొంగునకు 37చే నుగాగమంబురాఁగా ము+ను+కొంగు ద్రుతకార్యము ముంగొంగు. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు రావలసి యుండఁగా బిందువులలో బిందు బిందువు మాత్రమే వచ్చును. 37 సూత్రమున వృత్తిలో వ్రాయఁబడిన 'వ్యవస్థిత విభాషచే నీనుగాగమ ద్రుతంబునకుసంశ్లేషంబులే'దన్నవాక్యముం బట్టి 'ముఙ్గొంగు' అని సంశ్లేషముకాదు. కాన నొకేరూపముండును.

క్రొత్త+పసిఁడి 38వ సూత్రప్రకారము లోపనుగాగమములు రాఁగా క్రొ+న్+పసిఁడి=క్రొంబసిఁడి యగును. ఇం కే రూపమునురాదు.

కన్ను+దోయి=కన్దోయి ప్రకీర్ణకపరిచ్ఛేదము 7వ సూత్రముచే ద్విత్వనకారలోపమురాఁగా 'కను+దోయి'యై ప్రకీర్ణ. 16చే నులోని యుత్వము లోపించఁగా "కన్+దోయి" యగును. 18చే పరళము పరమైనపుడు ద్రుతమునకు లోపమువచ్చి 'కదోయి' అనునవిష్టరూపమునిద్ధింపఁ బోఁగా, ఈ సూత్రముచే కన్‌లోని నకారము ప్రథమస్వరముమీఁదిది కాన లోపించక సంశ్లేషము వచ్చును. 19చే బిందుసున్నయు వచ్చును. కందోయి కానరెండు రూపము లేర్పడును. హరికారికలలో "ఇఁక, అఁట" మాత్రమే చెప్పఁగా సూరి "చుఁడు" కూడఁ జెప్పినాఁడు.

చిం. వాత్మాన్మదో ర్ద్రుతస్య సాల్లుక్
హ. అస్మదాత్మద్రుత సంశ్లేష బా ధ్య న

బా. ౨౩. తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

తాను .... చదివె .... తాఁజదివె తాను జదివె
తాను .... విసె ... తావినె, తానువినె

దీర్ఘంబుమీఁదిది గాన దీనికి సెలసున్నలేదు.

గు. చివర ద్రుతమున్న నేను, తాను పదములు ద్రుతాంతములై ద్రుతప్రకృతికములేయగును అంతియకాని ప్రథమా విభక్త్యంతములైనంత మాత్రాన కళలుగావు కాఁగా, విద ద్రుతమునకు సలసున్న వచ్చును. దీర్ఘమీఁదిది కనుక సంజ్ఞా 16చే విందుసున్నరాదు. సంశ్లేషము 17వ సూత్రముచే రావలసియుండఁగా నీ సూత్రముచే దానిని నిషేధించు చున్నాఁడు. తాను+వినె=తావినె, లోపము వచ్చిన రూపము. "తాన్విని వె" అను సంశ్లిష్ట రూపమురాదు. "కవదొవలను గాండీవము సవలసిదంబను ముందఱ రథముకిస్టషే। నువిదప డిగియెద శుభకర। మవునివ్విధమిట్లు పే యమనుడునతండున్. భార. కర్ణ. 2 ఆ ఇందు మూఁడవ పాదమున "ఏను+పిదప" అని సంధికాఁగా గసడదవాదేశ సంధియని కొందఱు భ్రమింతురు. కాని "ఏనుబిదప" అని కొన్ని ప్రతులలో నున్నందున పఠ్యాదియే గ్రహింపఁదగినది. అంతేకాని "ఏను" కళమాత్రమెన్నఁడును కాదు.

చిం. ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు

హ ద్రుతలోప స్సమాసేషు

బా. ౨౪. సమాసములందు ద్రుతమునకు లోపంబగు.

ఎల్లయర్థములు, ఎల్లకలుషములు, సర్వపర్యాయంబయిన యెల్లి శబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబు నకు ముందు ప్రయోగంబులేదు.

గు. సమాసములలో ద్రుతమునకు లోపము వచ్చును ఎల్లన్+అర్థ ములు ద్రుతలోపంపరాఁగా - ఎల్ల+అర్థములు=యడాగమము - ఎల్లయర్థ

ములు. అక్లే,ఎల్లన్+కలుషములు. ద్రుతము లోపించుటచే సరళాదేశము రాలేదు. "ఎల్లకలుషములు" అనియేయైనది. ఎల్లన్ అను పదము సర్వవర్యాయము. అన్నియను వర్థముకలది. ద్రుతాంతమైన యవ్యయము. ఇది సమాసం చేయనిచో (వ్యస్తముగా) విశేష్యమునకు ముందు ప్రయోగింపఁబడదని సూరి వ్రాయగా భీమఖండమున శ్రీనాథుఁడు పీనొకఁడనే భిక్షనకు వ్వత్తునో యెల్లన్ శిష్యులఁ గొంచువత్తునా! అనివ్యస్తముగా విశేష్యమునకు ముందు వాడెఁనాడు. "సమాసంబునయందు" అన్న సూరి సూత్రం తప్పనియు, "సమాసమునందు" అని కాని, "సమాసమందు" అని కాని యుండవలెనని కొందఱు వ్రాయుచున్నారు. ఇట్టి ప్రయోగము లెన్నే నున్నవి "సంతరించితి విందుశవ్వసంబునందయము" "పరమునయందుఁగన్నులు బృధూదరదేశమునందు నోరు" భార. ఆర. 6అ "మునివ్రవరునితనువునయం దుద్భవమై." భార. ఆర 3అ. మొదలైనవి.

చిం. సుమ్మోత్వః.

పరుషే సరళే చైవ సమాసే సుముతో భవేత్।

అద్రుత స్వరకా దందు పట్టికూర్చి విభక్తిషు।

తసేచకుత్ర చిదతో వికారాచ్చాపి శేచన॥

(పుంప్వాదివికారాత్)

హ. స్త్రీసమానాన్తు సుక్.

హ. పుంప్వోశ్చ పరుషే తద్వ త్సరళే చోపరి స్థితే।

సోఽయం క్వచిత్ స్థిరేపి స్యా న్నస్యా న్నలుఁగడాదిషు.

బా. ౨౫ సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడుముగాగమంబగు. ఇచటం బరు

షంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులచే మూఁడు రూపంబులు సరళంబులు పరంబులగునపుడు లోపసంశ్లేష పూర్ణబిందువుల చేత మూఁడు రూపములు. విధాన సామర్థ్యమువలన దీనికి లోపములేదు. వక్ష్యమాణ విధిచే స్వత్వములేదు.

| | |
|---|---|
| చిగురు కయిదువు | చిగురుంగయిదువు<br>చిగురుఁగయిదువు<br>చిగురుగ్గయిదువు |
| తళుకు ...గజ్జెలు | తళుకుగజ్జెలు<br>తళుకున్గజ్జెలు<br>తళుకుంగజ్జెలు |
| సింగపు....కొదమ | సింగపుంగొదమ<br>సింగపుఁగొదమ<br>సింగపున్గొదమ |
| ఉన్నతంపు....గొడుగు | ఉన్నతంపుగొడుగు<br>ఉన్నతంపున్గొడుగు<br>ఉన్నతంపుంగొడుగు |

నలఁగద్వ్యాల ని యాగమంబు లేదండ్రు. ఈయాగమం బొకానొక చోట స్థిరంబుపరంబగుచోఁ గానంబడియెడి. గురువ పున్మరువు.

గు. సమాసములలో హ్రస్వ+ఉకారమంత మందుఁగల స్త్రీసమము లకును (ప్రథమా విభక్తిలో "డుమువు" లు చేరనివి)పు, ంపుు చివరనున్న

పదములకును పరుషము ఐనాని, స-శములుకావి పరమైనపుడును గాగమము-(సకారమెక్కువగా వచ్చుట) వచ్చును చిగురు+న్+కయిదువు- చిగురు-త్రీనమము, ఉకారాంతము' కయిదువులో పరుషము పరమైనది కాన నుగాగమము (న్)వచ్చినది. ఇప్పుడు ద్రుతకార్యము- (16,17 సూత్రము లచే రూపములు) అఖుసున్న,బిందుసున్న,సంశ్లేషమునువచ్చి మూఁడురూపము లు, తళుకు—స్త్రీసమము. గర్జులో సరళము పరమైనది. కాన 18వ సూత్రముచే లోపము, సంశ్లేషము 19 సూ.చేఁ బూర్ణబింద్వ్రకనగును. 24వ సూత్రముచే నీ ద్రుతమునకు లోపమురాదా? అను ప్రశ్నరాఁగా "విధానసామర్థ్యమువలన దీనికి లోపములేదు"అన్న ప్రత్త్యుత్తరముఅనఁగా-నునా గమ మీ సూత్రముచే విధించినాఁడు. వెనుకటి సూత్రముచే లోపించినచో విధానమే వ్యర్థమగును. కాన నిట లోపమురాదు- ఇఁక నా విధింపఁబడిన లోపము సహజ ద్రుతాంతశబ్దములకే యని యెఱుంగునది.వక్ష్యమాణవిధి-26వ సూత్రవిధివలన,దీనికి స్వత్వము-"చిగురును గయిదువు"అన్నరూపం లేదు. పరుషసరళములనే సూత్రమునఁ జేర్కొన్నను స్థిరములు పరమైనపుడుగూడ నీ యాగమము - నుగాగమము—సంశ్లేషము, వచ్చినరూపము గరువపు+న్+మురువు-గరువపున్మురువు-అవికన్పడుచున్నది. "నాలుగు+కడలు" అన్నచో "నాలుగు" నకు "నలు" ఆదేశముగాఁగానలు+కడలు= నలు+న్+కడలు=నలుఁగడలు: నలుంగడలు, అని యగును- కావి సంశ్లేష రూపముండదను నర్థమున "ని యాగమంబు లేదంద్రు" అనెను.

హ. కా. సేషు ద్రుతవ్య న స్వం.

బా. ౨౭. సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబులేదు.

గు. సమాసములలో ద్రుతమునకు స్వత్వము-"ను" రూపముతో నుండుట, జరుగదు చిగురున్+కయిదువు—చిగురును గయిదువు-కాదు.

సూ. కా. మగ్లుజ్న తలఁబ్రాలుషు.

బా. ౨౭. తలఁబ్రాలు మొదలగుసమాసంబుల ద్రుతమునకు లోపము లేదు.

తలఁబ్రాలు, ఒడిఁబ్రాలు, పేసఁబ్రాలు. ఊఁచఁబండి, ఊరఁబిచ్చుక, తోడఁబుట్టువు, తోఁబుట్టువు, ఒల్లఁబాటు, ఒడఁబాటు - ఇత్యాదులు.

గు. 24చే సమాసములందు ద్రుతములోపము రావలసియుండఁగా నీ పేర్కొన్న సమాసములకు మాత్రము ద్రుతలోపమురాదని యర్థము. తల+ను+బ్రాలు (పంపైఁబోయు నియ్యము·),తలఁబ్రాలు. ఇట్లే తక్కిన వియు. 26వ కిది యపవాదసూత్రము.

౨౦ సామానాధికరణ్యే షూదంతానాం టుగాగమో ఒచి స్యాత్.

సూ. టు గచ్యుతః కర్మధారయే.

బా. ౨౮. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు.

| | | | | |
|---|---|---|---|---|
| కఱకు | — | అమ్ము | — | కఱకుటమ్ము |
| నిగ్గు | — | అద్దము | — | నిగ్గుటద్దము |
| పరసపు | — | అలుక | — | పరసపుటలుక |

గు. కర్మధారయసమాసములో, హ్రస్వ (ఉ) కారమునకు,అచ్చు పరమైనచో, టుక్ అగమము ట్-అనున దంతావయవముగా వచ్చుట, జరుగును. కఱకు+ట్+అమ్ము-కఱకుటమ్ము. ఉదాహరణములు మూఁడును

విశేష పూర్వపద కర్మధారయములే. "కర్మధారయంబునందు" నని యేక వచనము చెప్పక, బహువచనము చెప్పుటచే కర్మధారయేతర సమాసము లలోఁగూడ నీ యాగమముండునని సూచింపఁబడినది. అప్పుడు— 'సమాసంబుల' అనుటయే యుక్తము వేల్పుటావు (షత) మదపుటేనుఁగు (తృ.త) మొదలైనవి. ఉకారాంతములకేకాక తక్కినవానికి నీయాగమము కన్పట్టుచున్నది మిద్దెటిల్లు, పల్లెటూరు, చుక్కెద్దు, తేనెటీఁగ, పక్కటెముక మొదలైనవి.

హ. తత్ర పేర్వాది శబ్దానా మచ్యయం స్యా ద్విభాషయా.

బా. ౨౯. కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరం బగునపుడు టుగాగమంబు విభాష నగు.

| | | | | |
|---|---|---|---|---|
| పేరు | — | ఉరము | — | పేరుటురము, పేరురము |
| చిగురు | — | ఆకు | — | చిగురుటాకు, చిగురాకు |
| పొదరు | — | ఇల్లు | — | పొదరుటిల్లు, పొదరిల్లు. |

గు. పూర్వసూత్రముచే నిత్యముగాఁ జెప్పిన టుగాగమమును దీనిచేఁ గొన్నిచోట్ల వికల్పముగాఁ జెప్పుచున్నాఁడు. టుగాగమము రాఁగా - పేరుటురము. రానిచో- ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి నిత్యమను సూత్ర ప్రకారము సంధికాఁగా- పేరురము' అగును

చిం. దారార్థే ఒత ఉదపి రః

హ. ఆలౌ రుగపి పేదాదేః

బా. ౩౦. పేదాది శబ్దంబుల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమం బగు.

పేద .... అలు .... పేదరాలు
బీద ... అలు .... బీదరాలు

పేద, బీద ముద్ద బాలెంత, కొమ, జవ, అయిదువ, మనుమ, గొడ్డు, ఇవి పేవాదులు. ఇందు జవ్వని శబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది. 'ఏకాంతమునం దనున్న జవరాండ్ర'నవి ప్రయోగము.

గు. పేద+అలు. "అలు" అనఁగా స్త్రీయని యర్థము. బీదదైన వనిత యని. ఇది కర్మధారయము. ఇందు రుక్+ఆగమము=ర్ అంతావ యవముగా వచ్చును. పేద+ర్+అలు=పేదరాలు. ఇట్లే బీదరాలు, ముద్దరాలు, బాలెంతరాలు, కొమరాలు, "జవ్వని+అలు" అని యుండఁగా "జవ్వని"కి 'జవ' ఆదేశమై జవ+ర్+అలు=జవరాలు - అయినది. అయిదువరాలు, మనుమరాలు, గొడ్డురాలు మొదలైనవి.

హ. కా. ఉచ్చాత స్తత తత్సమే

బా. ३०. కర్మధారయంబునం దత్సమ శబ్దంబుల కాలు శబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబునగు.

ధీర .... అలు .... ధీరురాలు
గుణవంత .... అలు .... గుణవంతురాలు

ఇచ్చట వృత్తియం దాలు శబ్దము స్త్రీమాత్రపరము.

గు. పేదరాలు, ధీరురాలు మున్నగు సమాసములలోనున్న "అలు" శబ్దమునకు స్త్రీ యనియే యర్థము, కాని భార్యయని యర్థముకాదు. వృత్తి యందున్ = సమాసనందున్న త్సమశబ్దములకాలుశబ్దముపరమై, కర్మధారయ

మైనచో అత్వంబునకున్—అకారమునకు, ఉత్వంబు-ఉకారము; వచ్చును. ధీర+ల్+ఆలు. "ధీర"లోని అకారమును గొట్టివేసి యుకారము వచ్చి "ధీరు" అయినది. కర్మధారయమనఁగా ధీరమైన స్త్రీయని యర్థము వచ్చునది. తత్పురుషాసమలైనచో - ధీరునియొక్క భార్యయను నర్థమున నీ రూపమురాదు. అప్పుడు 'మగనాల, మగవియాలు' అనునట్లు 'ధీరుని యాలు' అనియే యగును. ఉత్వరుగాగమములు రెండును రావు.

చిం. మోశ్చ విభక్త్యేకవచనతే పుంపూ

హ. పుంపూ స్యాతాం చ మో రత్ర

సూ. ౩౨. కర్మధారయంబులందు మువర్ణకంబునకుఁ బు,ంపులగు.

| | | | | |
|---|---|---|---|---|
| సరసము | .... | మాట | .... | సరసపుమాట, సరసంపు మాట |
| విరసము | .... | వచనము | .... | విరసపువచనము, విరసంపు వచనము |

గు. కర్మధారయ సమాసమున మువర్ణమునకు'పు,ంపు'లాదేశముగా వచ్చును. సరసము+మాట-సరసపుమాట, సరసంపుమాట.

చిం. నస్స్యాత్ తద్ధర్మతః

హ. తద్ధర్మ భేదక స్యోతో భవే దచి నుగాగమః

సూ. ౩౩ ఉదంతమగు తద్ధర్మార్థక విశేషణమున కచ్చు పరమగు నపుడు నుగాగమంబగు.

| | | | |
|---|---|---|---|
| చేయు | .... | అతఁడు | చేయునతఁడు |
| చేసెడు | .... | అతఁడు | చేసెడునతఁడు |

గు "చేయు" అను ధాతువులో తద్ధర్మకాలిక క్రియాజన్య విశేషణములు మూఁడు "చేసెడు, చేసెటి, చేయు." అందుకారాంతములు రెండే.

వాని కచ్చు పరమైనచో నుగాగమగును చేయు+న్+అతడు – చేయు నతడు. చేసెడు+న్+అతఁడు – చేసెడునతఁడు "అమరులకరవినోదము చూపు నమయమాంత్రికు నొక వెరలగ్ని దీప్తులనఁగ" హంస 5 ఆ. (వెరలు+అగ్ని) ఇట్లు నుగాగమము లేకుండ వ్రాసిన ప్రయోగము లగ్రాహ్యములు.

చిం. షష్ఠ్యా ఉతో ఽచి ను మ్వేచ

హ. నుగో ఋ రచి షష్ఠీ సే

బా. ౩౪ షష్ఠీసమాసమునం దుకార ఋకారంబుల కచ్చు పరమగు నపుడు నుగాగమం బగు.

రాజుయొక్క — అజ్ఞ — రాజునాజ్ఞ

విధాతృయొక్క — ఆనతి — విధాతృనానతి

గు. షష్ఠీ తత్పురుష సమాసములో ఉకార, ఋకారములకు అచ్చు పరమైనచో నుక్+ఆగమముగా వచ్చును. రాజు+అజ్ఞ ఇది షష్ఠీసమాసము సూరియొక్క అని చెప్పుట స్పష్టముగా తెలియుటకే. నుగాగమము రాఁగా రాజు+న్+అజ్ఞ – రాజునాజ్ఞ అగును. చింతామణిలో 'చ'కారమునే ఋకారగ్రహణముకాఁగా, సూరి కంఠోక్త్యా చెప్పినాఁడు విధాతృ+ ఆనతి. విధాతృ-ఋకారాంతముకదా. దానికచ్చు పరముకాఁగా, 'విధాతృ +న్+ఆనతి' అని నుగాగమము రాఁగా విధాతృనానతి యైనది. ఈ యాగ మము కొన్నిచోట్ల లోపించినట్లగపడును. 'గోకులమిల్లిలు దప్పకుండ' హరి.పూ 5 ఆ. (గోకులము+ఇల్లిలు) 'విద్వరోత్తమ బింబంబొప్పు' హరి. 6 ఆ. (బింబంబు+ఒప్పు) "అద్దిరరాకుమారు మొగమందము" రుక్మి 5 ఆ.

(మొగము+అందము) 'దినవెచ్చమునకునై తనమేనఁగల సొమ్ము గొంటి కత బచ్చెంటఁగుదువవై.' పాండు 3ఆ. (బచ్చు+ఇంటన్) 'శిర సందంబర యన్' కళా. 7ఆ. (శిరసు+అందంబు) 'అలరఁజేసితి విషధరాజంత వాని' నైష. (రాజు+అంత) 'గట్టు రాజల్లుఁడు వింటి నేర్పున' రామాభ్యు. (రాజు+అల్లుడు) 'అన్నన్న మొగము వెన్నునియన్నన్న జయించుఁగనుల. విజయ. 1 ఆ. (వెన్నునియన్న-పుష్పవతి-లక్ష్మిమొక్క, అన్న-చంద్రుడు) ఇట్టి మహాకవి ప్రయోగములు గ్రాహ్యములు.

**౯. ఉదంత స్త్రీసమస్యచ। పుంసోప్యేకపిగుణార్థస్యాదంతస్యాపి తనే పరే.**

వా. ౩౫. ఉదంత స్త్రీసమంబులకును, బుంపులకు, నదంత గుణ వాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు.

| | |
|---|---|
| సొగసు — తనము | సొగసుందనము<br>సొగసుఁదనము<br>సొగసున్దనము |
| పరవపు — తనము | పరవపుందనము<br>పరవపుఁదనము<br>పరవపున్దనము |
| తెల్ల — తనము | తెల్లందనము<br>తెల్లఁదనము<br>తెల్లన్దనము |

గు. హ్రస్వమైన యుకారాంతములైన స్త్రీసమములకును, ష, ంపు లకును హ్రస్వమైన యుకారాంతములైన గుణవాచకములకును 'తన'శబ్దము పరమైనచో నుగాగమము - "న్" జరుగును. ఉకారాంత స్త్రీసమంబునకు- సొగసు+న్+తనము. ద్రుతకార్యము అర్ధబిందు,పూర్ణబిందు, సంశ్లేషము లచే మూఁడురూపములు. 'తెల్ల'అదంతగుణవాచకము. "తెల్ల, నల్ల, పచ్చ, పెల్ల", మున్నగునవి అదంత గుణవాచకములు.

హ. కా. ప్రాతా ద్యాద్యాచ్పరే వర్ణా లుప్యంతే బహుళం తు సే.

బా. ౩౭. సమాసంబున ప్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబు గానగు.

ప్రాఁత — ఇల్లు — ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు
లేఁత — దూడ — లేఁతదూడ, లేదూడ
పూవు — రెమ్మ — పూరెమ్మ, పూవురెమ్మ

గు. ప్రాఁత + ఇల్లు విశేషణ పూర్వపదకర్మధారయ సమాసము. ఇందు 1 దొలియచ్చు. ప్+ర్+అ, త్+అ. ఇందులో "అ" మొదటి యచ్చు. దాని త్వరాతి వర్ణముల కన్నిటికిని లోపమువచ్చును. ప్రా+ ఇల్లు యడాగమమురాఁగా-ప్రాయిల్లు, బహుళముకాన, వికల్పముగా లోపించఁగా -అనఁగా లోపం రానప్పుడు - ప్రాఁత+ఇల్లు యడాగమము- ప్రాఁతయిల్లు.

హ. కా. పరుషే లుప్తశేషస్య తవే దపి నుగాగమః

బా ౩౮ లుప్తశేషంబునకుం బరుషములు పరమగునపుడు నుగాగ మంబగు.

ప్రాఁత – కెంపు – ప్రాఁగెంపు

లేఁత – కొమ్మ – లేఁగొమ్మ

పూవు – తోఁట – పూఁదోఁట

మీఁదు – కడ – మీఁగడ

కెంపు – తామర – కెందామర

చెన్ను – తావ – చెందావ

చెన్నుశబ్దం వృత్తినిశోణార్థకంబు. బహుళగ్రహణముచే మీఁదు ప్రభృతులందు విటలోపంబు నిత్యంబు. వ్యవస్థితవిభాషచే నీ ద్రుతంబునకు సంశ్లేషములేదు.

గు. లుప్తశేషము = లోపించఁగా మిగిలినది. దానికిఁ బరుషములు పరమైనచో ముగామము వచ్చును. ప్రాఁత+కెంపు. 36సూత్రముచేఁ దొలి యచ్చుమీఁది వర్ణము లోపించఁగా మిగిలినది. ప్రా+కెంపు నుగాగమము రాఁగా- ప్రా+న్+కెంపు. ద్రుతకార్యం. సరళాదేశం, ద్రుతమునకు అరసున్న రాఁగా - ప్రాఁగెంపు-అగును. దీర్ఘముమీఁదిది కాన దీనికి బిందు మున్నారాదు 'చెన్ను' అన్నది వృత్తివి=సమాసములో, శోణ + అర్థకంబు—ఎఱుపను నర్థం బిచ్చును. సూత్రమున లోపం బహుళముగా నగునని బహుళపదము వాడినందున నాలుగురకముల రూపములువచ్చును. "మీఁదు+కడ=మీఁగడ" అనియే లోపం నిత్యం. "మీఁదుగడ" అను రూపముండదని యర్థం "క్రొత్త+కుండ" అనుచోటలోపమురాదు. క్రొత్తకుండ అనియే యగును విభాష - ప్రాఁత యిల్లు ప్రాయిల్లు అన్య రూపం-"క్రిందు+కన్ను-క్రిఁగన్ను" ఈకారముకమాట బహుళపద సామర్థ్య మేయని యెఱుంగునది.

వ్యవస్థిత విభాషయనఁగా : 8వ సూత్రముచే ద్రుతమునకు సంశ్లేషం వచ్చి "ప్రాన్గెంపు" అని కావలసియుండఁగాఁ బ్రయోగానుసారముగా విభాషయుండుటచే నీ 37వ సూత్రముచే వచ్చిన ద్రుతాగమమునకు సంశ్లేషము రాదని యర్థం. ఈ విషయం కొంత 22వ సూత్రమువద్ద వివరింపఁబడినది.

**హ.కా. ఆద్యశేషస్య క్రొత్తస్య నుగ్ద్వే పరహలః క్వచిత్**

బా. 36. క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం, గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబు వగు.

క్రొత్త .... జాయ .... క్రొంజాయ
క్రొత్త ... చెమట .... క్రొంజెమట
క్రొత్త .... పసిఁడి .... క్రొంబసిఁడి
క్రొత్త .... కారు .... క్రొక్కారు
క్రొత్త .... తావి .... క్రొత్తావి

పరుషేతరంబులు పరంబులగునపుడు నుగాగమ ప్రాప్తిలేమిం జేసి వానికి ద్విత్వంబగు.

క్రొత్త .... గండి .... క్రొగ్గండి
క్రొత్త .... నన .... క్రొన్నన
క్రొత్త .... మావి .... క్రొమ్మావి

కెంధూళి కెంజడలని ప్రయోగంబులు గాఁబడియెడి. బహుళగ్రహణముచేఁ గ్రొత్తకుంద లిత్యాదుల లోపంబు లేదు. క్రిఁగడుపు, క్రిఁగాలు,

క్రీఁదొడ - ఇత్యాదులఁ గ్రింద శబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణము చేతనని యెఱుఁగునది.

గు. ప్రాఁతాది శబ్దములకును, క్రొత్తశబ్దమునకు సంధిలో భేదమున్నందున దీనినిఁ బ్రత్యేకముగాఁ జెప్పుచున్నాఁడు. క్రొత్త+వాయ. పూర్వ సూత్రముచే మొదటి యక్షరము మాత్రము మిగులఁగా క్రొ+వాయ. నుగాగమము రాఁగా- క్రొ+న్+వాయ. ద్రుతకార్యము క్రొంబాయ. వ్యవస్థిత విభాషచే సంశ్లేషము రాదు. తొలి హ్రస్వముమీఁది దగుటచే నఱసున్న రాదు. "క్రొత్త+కారు" - అద్యక్షరశేషమునకు - క్రొ+కారు-నకు మీఁది హల్లునకు- కకారమునకు, ద్విత్వము రాఁగా - క్రొ+క్+కారు-క్రొక్కారు అయినది. పరుషములు పరమైనపుడు మాత్రమే నుగాగమము వచ్చును., పరుష+ఇతరములు=పరుషములుకాని యక్షరములు పరమైనపుడు మీఁది హల్లునకు ద్విత్వము మాత్రమే వచ్చును. క్రొత్త+గండి - క్రొ+గండి - క్రొ+గ్+గండి=క్రొగ్గండి. కెంధూళి, కెంజడలు "ధూ, జ" అన్నవి పరుషములు కాకపోయినను నుగాగమము వచ్చి ద్రుతకార్యము రాఁగా కెంపు+ధూళి = కె+ధూళి = కె+న్+ధూళి కెంధూళి. ఈ రూపము లీసూత్రప్రకారము సాధింపఁబడవు కాన నిపాతము లనుకోవలెను. నిపాతములనఁగా - వ్యాకరణ సూత్రములచే సాధ్యంకావి, ప్రయోగమునందున్న రూపములు. బహుళమన్నందున వచ్చు నాల్గురూపములు పైసూత్ర వ్యాఖ్యానమున నీయఁబడినవి. క్రిందు+కడుపు=క్రి+కడుపు—క్రి+న్+కడుపు-క్రీఁగడుపు. క్రి-క్రీగా దీర్ఘమగుట బహుళమనుట వలన జరిగినది. ఇట్లే తక్కినవియు.

హ. కా. శేషాంచి త్కుషచి న్నుకప్లోపో ద్విత్వంచ దృశ్యతే,

సూ. ౩౯. అన్యంబులకు సహిత మిత్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి.

ఒకానొక శబ్దంబున కొకానొక శబ్దము పరంబగునపుడు తొంటి యట్లు లోప, సుగాగమంబులును, గొండొక శబ్దము పరంబగునపుడు లోప ద్విత్వంబులును బ్రయోగంబులందుఁ జూపట్టెడునని తాత్పర్యము.

| | | | | |
|---|---|---|---|---|
| పది | — | తొమ్మిది | — | పందొమ్మిది |
| తొమ్మిది | — | పది | — | తొంబది |
| పంక | — | చెఱఁగు | — | పంజెఱఁగు |
| పగము | — | కోరు | — | పంగోరు |
| విందు | — | వెఱ | — | వివ్వెఱ |
| విందు | — | వెఱఁగు | — | వివ్వెఱఁగు |
| నెఱ | — | తఱి | — | నెత్తఱి |
| నెఱ | — | నడుము | — | నెన్నడుము |
| నెఱ | — | మది | — | నెమ్మది |
| నెఱ | — | వడి | — | నెవ్వడి |

గు అన్యంబులకున్ - ప్రాఁతాదులు, క్రొత్త శబ్దముకాక యితర శబ్దములకుఁగూడ ఇత్కార్యంబు — లోప, సుగాగమ, ద్విత్వములు, గానంబడియెడి= ప్రయోగముల ననుసరించి వచ్చుచున్నట్లు కనిపించుచున్నవి. ఈ యర్థమే మూలములో నైత మియ్యబడినది. పది+తొమ్మిది=ప+న్+తొమ్మిది=పందొమ్మిది ఇది నుగాగమము వచ్చిన రూపము. విందు+వెఱ=ని+వెఱ=నివ్వెఱ. ఇది మీఁది హల్లునకు ద్విత్వమువచ్చిన రూపము

38వ సూత్రమున 'క్రొత్తాది శబ్దములకు'నని "ఆది" పదము వేసినచో ని 39వ సూత్ర మక్కఱయే లేకపోవును. అయిన నిది స్పష్టార్థమేయనుకో వచ్చును. 'నెన్నడుము'లోఁ బూర్వపదము "నెఱి" అని యందురు. నెఱ=నిండు: నెఱి=రమ్యమైన. పూర్ణమైన నడుమనుటకన్న రమ్యమైన నడుమనుటయే రమ్యము. తత్సమ శబ్దంబులు పరమగునపుడుకూడ నీద్విత్వ మగపడుచున్నది. నెఱ+మనము=నెమ్మనము 'నెచ్చెలి, నెవ్వఱి, నెవ్వగ' అనుచోట్ల 'నెఱ'యే పూర్వపదము. కవ్వడి మున్నగునవి యీ సూత్రము క్రిందికే వచ్చును.

సూ.కా భవ త్యామ్రేడితపరే కడాదేః ప్రథమా దచః।
సర్వేషా మపి వర్ణానా మదంతం తద్వయంమతం॥

బా ౪౦ ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదుల తొలి యచ్చు మీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారం బగు.

ఈ సూత్రంబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు విషయంబని యెఱుంగునది

| | | | | |
|---|---|---|---|---|
| కడ | — | కడ | — | కట్టకడ |
| ఎదురు | — | ఎదురు | — | ఎట్టెదురు |

కడ, ఎదురు, కొన, చివర, తుద, తెన్ను, తెరువు, నడుము, పగలు, పిడుగు, బయలు, మొదలు—ఇత్యాదులు కడాదులు.

గు. ఆమ్రేడితము= రెండుసార్లుచ్చరింపఁబడిన పదములలో రెండవది (చూ. 10 సూ.) పరమైనచో తొలియచ్చు=మొదటి యచ్చు: మీఁది వర్ణంబులెల్లన్=తర్వాతి యక్షరములు కన్నిటికిని: అత్+అంతమగు.

హ్రస్వాకారాంతమైన ద్విరుక్తటకారము = టాద్విత్వము=ట్+ట్+అ=ట్ట, కడ—దీనిలో క్+అ,డ్+అ—వర్ణములున్నవి కడ. అందుఁ దొలి యచ్చు క్+అ. దానిమీఁది యక్షరములు డ్+అ.లను గొట్టివేసి "ట్ట" ఆదేశముగా వచ్చును. కడ+కడ=కట్టకడ. భృశార్థంబునందు ద్విరుక్తంబు =అత్యంతము ననునర్థముతో రెండుసార్లుచ్చరింపఁబడినవి. విషయంబు= లక్ష్యములు. "కడ+కడ" అనఁగా మిక్కిలి కడ యని యర్థము చిట్ట చివర, తుట్టతుద, నట్టనడుము=మిక్కిలి మధ్య. పట్టపగలు, బట్టబయలు, "మిట్టమధ్యాహ్నము, నట్టనడువీధి" మున్నగువానిలో మధ్యాహ్నము, నడువీధి యన్న పదములే ద్విరుక్తములైనవని యెఱుంగునది. 'తెట్ట తెన్ను, తెట్టతెరువు' అన్నవి ప్రయోగ బాహుళ్యమున నున్నట్లు కన్పడదు.

**హ.కా. విభక్తిలోపో బహుళం పరే త్వామ్రేడితే భవేత్**

బా. ౪౧. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు.

అప్పటికిన్....అప్పటికిన్ { అప్పటప్పటికిన్ / అప్పటికప్పటికిన్

అక్కడన్ అక్కడన్ { అక్కడక్కడన్ / అక్కడ నక్కడన్

ఇంటన్....ఇంటన్ { ఇంటింటన్ / ఇంటనింటన్

ఊరన్....ఊరన్ { ఊరూరన్ / ఊరనూరన్

గు. అప్పటికిన్+అప్పటికిన్— ఇందామ్రేడితము పరమైనది కనుక విభక్తియైన "కిన్" అన్నది బహుళముగా- వికల్పముగా లోపించఁగా అప్పటి+అప్పటికిన్=అప్పటప్పటికిన్. 'అప్పటప్పటికిని జిహ్వాత్రుప్పు దుల్లి. మను 2 ఆ.' లోపించినచో 5వ సూత్రముచే 'అప్పటికప్పటికిన్' అయినది. వికల్పమనక, బహుళమన్నందున 'ఇంచుక, నాఁడు'లలో నవ్య రూపము-తుదియక్షరము లోపించుట జరిగినది. ఇంచుక+ఇంచుక= ఇంచు+ఇంచుక—ఉకారసంధి కాఁగా—ఇంచించుక యైనది.

హ. యథా ప్రయోగం గ్రాహ్యా న్యన్ద త్తుమురా దయో బుధైః

బా. ४२ అందమకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

అందమకు, ఇఱ్ఱింకులు, ఇల్లింగ్గలు, చెల్లచెదరు, చెల్లాచెదరు, తుత్తుమురు, తుత్తునియలు, మిఱుమిట్లు - ఇత్యాదు లెఱుంగునది.

గు. అందమకు మొదలైనవి ప్రయోగముల ననుసరించి గ్రహింపఁ దగినవే కాని యనుగతిగా నొక్క సూత్రముతోఁ జెప్పుటకు వీలులేనివని యర్థము. అమకు+అమకు = అందమకు ఇంకులు+ఇంకులు= ఇఱ్ఱింకులు; ఇగ్గిలు+ఇగ్గిలు (మిక్కిలి వెనుకతొలఁగుట) ఇల్లిగ్గిలు, చెదరు+చెదరుచెల్లచెదరు, = చెల్లాచెదరు, తుమురు+తుమురు= తుత్తుమురు =మిక్కిలిపొడి, తునియలు+తునియలు = తుత్తునియలు, మిట్లు+మిట్లు= మిరుమిట్లు.

చిం. ఇచ్చ విభక్త్యంతిమస్య హ సమాన ఇ చ్చేత తోడ వలనానాంనకాంమతం

బా. ४३. చేత తోడ వలనల కిత్వంబు సమానంబులందగు.

| | | | | |
|---|---|---|---|---|
| నీచేతన్ | .... | ప్రోపు | .... | నీచేతి ప్రోపు |
| నాతోడన్ | .... | చెలిమి | .... | నాతోడి చెలిమి |
| నీవలనన్ | .... | భయము | .... | నీ వలని భయము |

గు. సమాసములో చేత, తోడ, వలనల కికారము వచ్చును. నీచేత+ప్రోపు. సమాసములో విభక్తి ప్రత్యయము లోపించనిచో 'అలుక్సమాస' మందురు. ఈ అలుక్సమాసములో చేతన్+ఇ=చేత్+అన్—లోని 'అన్'ను గొట్టివేసి "ఇ" రాఁగా, 'నీచేతి ప్రోపు' అగును. ఇట్లే నాతోడి చెలిమి, నీవలని భయము మన్నగునవి. "తోడి"కి బదులు 'తోటి' యని కొందరు వాడుదురు, అది తప్పు

చిం. షే రతి చ

హ. అలి గంద్వింద్వేందుషు స్యా, దెందో ర్వై వేతి కేచన.

బా. ౪౪. అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునందగు.

| | | | | |
|---|---|---|---|---|
| నా యందున్ | — | కరుణ | — | నా యందలి కరుణ |
| ఇందున్ | — | జనులు | — | ఇందలి జనులు |
| ఎందున్ | — | వారు | — | ఎందలి వారు |

ఎందు శబ్దమున కలిగాగమము కొందరు లేదందురు.

గు. 'అందు, ఇందు, ఎందు' పదములకు సమాసమున "అలి" యాగమము=అలి-ఆగమముగా వచ్చుచుండును. నాయందున్+అలి+కరుణ= నాయందలి కరుణ "ప్రథమేతర విభక్తి సంధి యుటఁ బ్రవర్తింపదు. ఉకారమునకు సంధి నిత్యముగనే యగును. లేనిచో "నాయందునలి కరుణ" అను ననిష్టరూపము నిష్పన్నము కావలసి వచ్చును. కొందఱి మతమున "ఎందు" శబ్దమునకు "అలి" యాగమము రాదు.

చి. శబ్దా త్తచ్ఛబ్దాశః.

హ. అతస్తు బహుళం లోపోవృత్తౌ వద్యవి శబ్దయోః.

బా. ४३. అది, యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు.

నా .... అది నాది, నాయవి

నా .... అవి .... నావి, నాయవి

ఉవంతములగు తద్ధర్మ విశేషణంబులకు మీఁద లోపంబు లేదనియు విదంతంబులగు తద్ధర్మ విశేషణంబులమీఁద నిత్యం బనియు బహుళ గ్రహణముచే నెఱుంగునది.

వచ్చునది, వచ్చునవి, వచ్చెడిది, వచ్చెడివి.

"అది, అవి" శబ్దములలోని, అత్తునకున్ = అకారమునకు, వృత్తిని=సమానమున—లోపము బహుళముగావగును. నా+అది=అకారమునకు లోపమురాఁగా-నాది: లోపమురాని పక్షమున, యడాగమము వచ్చి 'నాయది'యగును. బహుళమనుటచేఁదద్ధర్మవిశేషణములైన-వచ్చెడు, వచ్చెడి, వచ్చు-వీనిలో ఇకారాంతములకుఁ బరమైనపుడు నిత్యముగా లోపము - వచ్చెడి+అది = వచ్చెడిది: వచ్చెడి+అవి = వచ్చెడివి ఉకారాంతములకుఁ బరమైనచో లోపమురాదు వచ్చున్+అది=వచ్చునది: వచ్చున్+అవి=వచ్చునవి నీ+అది - నీది: నీయది. సమాసము కానిచో 9వ సూత్రమున సుదాహరించినట్లు 'ఉండెడినది' అని యుండును. 'మీరు నాకు నేను మీకు నెన్నఁడుము న్నహితమాచరించినదియులేదు'

భార. వభా. 1అ ఇచ్చట - ఆచరించిన+అది=అకారసంధిచేయఁగా— ఆచరించినది, యడాగమమున-ఆచరించినయది అని యూహించునది

చిం, ప్రథమావైభక్తిక మో ర్బిందు శ్చ మహాన్ పతిక్రియార్థేషు

హ. వా. లోపః పూర్ణబిందుశ్చ పద్యాదిషు పరేషు మోః.

శా. ४८. పద్యాదులు పరములగునపుడు ముపర్ణంబునకు లోప పూర్ణ బిందువులు విభాష నగు.

| | |
|---|---|
| భయము - పడె | భయపడె<br>భయంపడె<br>భయముపడె |
| సూత్రము - పట్టె | సూత్రపట్టె<br>సూత్రంపట్టె<br>సూత్రముపట్టె |

ఈ కార్యము కర్తృవాచి ముపర్ణకంబునకుం గలుగదు. గజము పడియె, అశ్వము పడియె.

గు. పదు+ఆదులు=పద్యాదులు, పదు మున్నగు శబ్దములు-పడు, పట్టు, పాటు, పఱచు, పెట్టు - అనునవి. పరములైనపుడు "ము" కారము నకు లోపముగాని, బిందుసున్నగాని, వికల్పమనుటచే నీ రెండును రాని రూపంబును కల్గును. భయపడె-మువర్ణలోపమువచ్చినది. భయంపడె-బిందు మున్న వచ్చినది. భయముపడె - లోపపూర్ణబిందువులు రానిరూపము. కర్తృ వాచి=కర్తను చెప్పెడి మువర్ణకమునకుఁ బరమైనపుడు, పద్యాదులకీ

రూపములురావు. గజము, అశ్వము-కర్తలు, కాన, గజపడె, అశ్వపడె, అని కాలేదు. "భయముపడియె"నన్నపుడిది, కర్మవాచకమైన మువర్ణకము. "అప్పుడు ధర్మహానికి భయంపడి నిల్చితివో కదంకతో" భార. విరా. 6ఆ "పరఁగువీధుల సూత్రపట్టినట్లు" ఆము. 1ఆ. "ఎట్లు ప్రబలరిపుల నీవును నాపదఁ కోర్చి భంగపాటు తీర్చికొనుము. భార. విరా. 1 ఆ "భంగ పఱుతునదుము పఱుతుఁజెఱుతు" భార. విరా 2ఆ. ఇత్యాది ఉదాహరణ ములు. పద్యాదులలోఁ జెప్పిన -"పఱుచు, పాటు" అనునవి "పడు"ధాతువు నుండి పుట్టిన రూపములే. పఱుచు-పడుధాతువు ప్రేరణార్థకరూపము. "పాటు" పడు ధాతువుయొక్క కృదంతరూపము "అదంతపాది శబ్దేషు పత్యర్థేబింబలోపకౌ వర్ణకస్యాత్రకధితౌ క్వచిత్సుకవిసమ్మతేః॥" అన్న నధర్వణకారికలో "అదంత పాదిశబ్దే" అని చెప్పుటచే "పాటు" అను అకారాంతశబ్దములకు సంగ్రహణముచేయఁగోరికొందఱు 'అ+అత్=అత్' అని చెప్పికొనిరి. కాని యారీతిగాఁ జెప్పినను "అత్+అంత=అదంత" యగును. కాని "అదంత"యని కాదు కాక, అట్లుచెప్పి అకారాంతమైన "పాటు" శబ్దమును సాధించినను, "పెట్టు" అన్న యెకారాంతశబ్దము నెట్లు సంగ్రహింపవీలగును? అన్న ప్రశ్న కుత్తరముగా చింతామణిలో "పతి క్రియార్థేషు" అని 'పతి' ధాత్వర్థక క్రియలకే కాని "పెట్టు" అన్నదానికి రాకూడదని వన్నయ యుద్దేశమనికూడా చెప్పిరి. కాని "పతిక్రియార్థే" అని యేకవచనము చెప్పినను "పడు, పాటు, పఱుచు" మున్నగునవి వచ్చుచుండఁగా "పతిక్రియార్థేషు" అని బహువచన సామర్థ్యముచే "పతిక్రియార్థకేతర పదము పరమైనను వచ్చు"నని స్ఫురించుచున్నది. ఇట్లే టుగాగమ సంధిలో 'సామానాధికరణ్యేషు' అని చింతామణిలోను, "కర్మ ధారయంబుల"నని సూరియు బహువచనము వాడుటచే కర్మధారయేతర సమాసములలోఁగూడ వచ్చుననివారియుద్దేశ్యముగా లోగడచెప్పఁబడినది.

ప్రకృతమునఁ గపింజలాధికరణ న్యాయమున "ఎదు, పెట్టు, పట్టు" మూఁడు విట గ్రహింపఁదగినవి.

హ. మో ర్మధ్యమస్య లోపో వా పరయోర్హల్వి రామయోః.

బా. ౪౩. మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాష వగు.

చూడుము — నన్ను — చూడు నన్ను, చూడుమునన్ను

ఇటు — చూడుము — ఇదుచూడు, ఇటుచూడుము.

చూడుమనియె, వినుమనియె- ఇచ్చట వచ్చుపరమయినది కాఁబట్టి లోపములేదు.

గు. మధ్యమపురుషలోని ముకారమునకు హల్లు పరమైనను, తరువాత నక్షరములు లేకున్నను లోపము వికల్పముగావచ్చును. "చూడుము+నన్ను" హల్లుపరమైనది కాన 'ము' లోపించినది - చూడున్నన్ను: వికల్పము కాన "చూడుము నన్ను" లోపింపని రూపము "ఇటు+చూడు" చూడుము తరువాతఁ బదములేదు కనుక 'ము'లోపమువచ్చి "ఇటుచూడు" అయ్యనది. అచ్చు పరమైనచో "చూడుము+అనియె" ఉకారసంధిగాఁగా "చూడుమనియె" అని యైనది. అంతేకాని, "చూడనియె" ననియెన్నడును కాదు. సంధియైన రూపములు ప్రయోగములో విరళముగానున్నవి. "అడిచె వీదు పంచెము (అదుము+ఇచె=అడిచె)" కళా-6అ.భవచ్చిత్తేప్సితంబెద్ది చెప్పనినన్ (చెప్పుము+అనినన్)" మార్కం. 1అ. "కావుకావనువారిఁగదిసి (కావుము+అను వారిన్)" వసు. 1అ. ఇత్యాదు లూహ్యంబులు.

సూ. వా స్యా ల్లోప స్తు సర్వత్ర వ్యతిరేకస్య మధ్యమో॥

బా. ౪౭. వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు.

నమ్మకుము — ఇట — నమ్మకిట, నమ్మకుమిట

గు. వ్యతిరేకార్థక క్రియల మధ్యమ పురుషముకారమున కచ్చు పర మైనను లోపము వికల్పముగా వచ్చును. ఎల్లయెడలన్=ఏది పరమైనను. పై సూత్రమునఁ జెప్పిన హలవసానముఖను, నిషేధించినయచ్చుపరమైనన- అని యర్థము. నమ్మకుము+ఇట అచ్చుపరమైనది. అయినను సంధియైనది. నమ్మకిట వికల్పముకాన 'నమ్మకుమిట' అనియు నగును.

సూ. ఆమ్రేడితే పరే మధ్య ముదుజ్లోపో విభాషితః

బా. ౪౮. ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముదుజ్లకు లోపంబు విభాషనగు.

ఉండుము — ఉండుము — ఉండుండుము, ఉండుముండుము

కొట్టుఁడు — కొట్టుఁడు — కొట్టుకొట్టుఁడు, కొట్టుఁడుకొట్టుఁడు

గు. ఆమ్రేడితము పరమైనపుడు మధ్యమ పురుషైకవచన మువర్ణకమునకును, బహువచనమైన డుక్‌నకును లోపము వికల్పముగానగును. 'ఉండుము+ఉండుము'లో రెండవ 'ఉండుము' పరముకాఁగా మొదటి దానిలోని "ము" వర్ణము లోపించినది "ఉండుండుము" లోపించనిచో "ఉండుముండుము". మధ్యమపురుష బహువచనమున డుక్-నకు-కొట్టుఁడు +కొట్టుఁడు' డుక్ "ఉత్తువింపు పూర్వంబగు"నన్న సూత్రముచే "దు" వింద పూర్వముకాఁగా వర్ధింపఁబడవచ్చి "కొట్టుఁడు" అనియైనది. 47వ

కిది యపవాద సూత్రము. అంత సామాన్యముగాఁ జెప్పఁగా నింవాత్రేడి తము పరమైనపుడని విశేషముగాఁ జెప్పినందున నిదివానికి బాధకమై యందుఁ జెప్పఁబడు కార్యములను నిరాబాధముగాఁ జేయును అపవాదమనఁగా సామాన్య సూత్రముకన్నఁ దక్కువ లక్ష్యములందుఁ బ్రవర్తించునదని యర్థము.

సూ. విసర్గలోపో ఽనుకృతౌ

బా. ౩౦. విసర్గంబున కనుకరణంబున లోపంబగు.

వర్ధతాం శ్రీః — అనియె — వర్ధతాం శ్రీయనియె.

గు. అనుకరణంబున = సంస్కృత పదము నున్నవాని నున్నట్లు తెనుఁగులోనికిఁ దెచ్చినపుడు, విసర్గంబునకు = "ః"కు లోపము వచ్చును. వర్ధతాం శ్రీః+అనియె = విసర్గ లోపించఁగా - వర్ధతాం శ్రీ+అనియె. యడాగమమురాఁగా - వర్ధతాం శ్రీయనియె.

చిం. లోపో నమ ఆదికే విసర్గస్య

సూ. ఓన్నమోతో భవే త్తు వా

అన్యత్రాప్యేత దిష్టం స్యా దితి కేచి ద్బభాషిరే॥

బా. ౩౧. అనుకృతిని నమశ్శబ్దము తుది యత్తున కోత్వము విభాషనగు.

తుభ్యంనమః—అనె— { తుభ్యం నమోయనె<br>తుభ్యం నమయనె

ఈకార్యము లాతిసోసహితము గావంబడియెడి "గతాను గతికో లోకో యటంచున్".

గి. అనుకరణమునం.. 'నమః'అను శబ్దముయొక్క చివరి అకారము ఓ కారము వికల్పముగానగును."తుభ్యంనమః+అనె" ఇటి60సూత్రముచే విసర్గలోపించ గా "తుభ్యంనమ+అనె" "నమ"లో మకారముమీఁది అకారమున కోకారముఁరాఁగా 'తుభ్యంనమో+అనె' సంధిలేనిచోటయడాగమముచేయఁగా 'తుభ్యం నమోయనె' అని యగును. 'మానమథనాయ మదనాయమథనఘాయ మనసిజాయి నమో నమయనుచుమ్రొక్కి' పను 3ఆ. "విశాచహరాయనమోయనుఁగావి" వరా ఆ. ఈకార్యము = ఈవిసర్గమున కోకారము వచ్చుట. లాతిసోసహితము = నమశ్శబ్దమునకేకాక తక్కినవానికివి 'గతానుగతికోలోకః+అటంచున్' 50చే విసర్గలోపము వచ్చి అకారమున కోకారముఁరాఁగా 'లోకోయటంచున్' అయినది.

హ. ద్వేహలోంత్యస్యానుకృతౌ.

టా. అ౭. అనుకరణంబునం దుదిహల్లునకు ద్విత్వదవంబగు.

కింతత్ .... అనియె .... కింతత్తనియె

కస్త్వమ్ . అనియె .... కస్త్వమ్మనియె

గి అనుకరణమునఁజివరి హల్లునకుద్విత్వమువచ్చును 'కింతత్'లోఁ జివరనున్న 'త్' కారమునకు ద్విరుక్తిరాఁగా 'కింతత్+త్+అనియె= కింతత్తనియె' అగును. 'జ్ఞాతిశ్చేదనలేన కిమ్మనెదువావారూఢినత్యమ్ముగన్' పను. ఆ ౩. అత్మార్థం పృథివీం త్యజే దేత్తనెదు వాక్యం బుఁకుతం చేవ్యపాకాశి. ఇట్టివి యూహ్యంబులు.

చి. అహమాదీనాం ద్విత్వం.

హ. మోహమా దేర్ద్వయింతువా.

బా. ౫౩. అనుకరణము సందహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు.

దాసోహం .... అనె .... దాసోహమ్మనె, దాసోహమనె

తత్కర్తవ్యం .... అనె .... తత్కర్తవ్యమ్మనె, తత్కర్తవ్యమనె

గు. అనుకరణమున 'అహమ్' మున్నగు శబ్దములలోని తుది మకారమునకు ద్విత్వము వికల్పముగానగును. 'దాసోహమ్+అనె' మకారమునకు 'అను' ధాతువు పరముకాఁగా మకారమునకు ద్విత్వము 'దాసోహమ్+మ్+అనె=దాసోహమ్మనె' వచ్చినది అదివికల్పమగుటచే 'దాసోహమ్+అనె=దాసోహమనె' అని యైనది. అహమాదులకనుటచేఁదక్కినపదముల లోని మకారమునకును ద్విత్వము కల్గును. తత్కర్తవ్యమ్+అనె లోని మకారమునకు విల్లే జరిగినది.

హ. ఉతో నామ్న ఇతౌ వుక్.

బా ౫౪. ఉదంత నామంబున కనుకరణంబునందు వుగా మంబగు.

ఇయంధేనుః .... అనె .... ఇయంధేనువనె.

అనుకృతిని విడుదకుంగుఱచయగునవి యొకండు వలికె, నది విరాకరంబు. "దుర్బలస్య బలం రాజా యనవినవే."

గు. హ్రస్వఉకారాంతమైన నామము ననుకరించునపుడు వుక్ + అగమము వచ్చును. "ఇయంధేనుః+అనె" 50చే విసర్గ లోపించఁగా "ఇయంధేను+అనె." ఇది ఉకారాంతమైనది కనుక వుగాగమమురాఁగా "ఇయంధేను+వ్+అనె = ఇయంధేనువనె" అయినది. విడుదకున్ = దీర్ఘమునకు: కుఱుచ=హ్రస్వము. ఒకండు = కశ్చిత్ (ఆదరణీయము కానప్పుడు చెప్పుమాట): నిరాకరంబు=నిరాకరింపదగినది. (ప్రమాణము లేని దగుటచేననుట) "రాజా+అన" రాజాలోని దీర్ఘము దీర్ఘముగానే యున్నది కాని హ్రస్వము కాలేదు కదా. అందుచే నొకనిమాట ప్రమాణముకాదని భావము.

## హ వాక్యాంతే సంధి ర్న దోషభాక్.

బా. ౫౫. వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదని యార్యు లంద్రు.

సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు. ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంతబులం జూపట్టెడు.

గు. వాక్యము చివరసంధి లేకున్నను దోషములేదు సంస్కృతమున సంధి "వాక్యేతు సా వివక్ష మపేక్షతే" అని వాక్యమున వివక్షాధీనముగా వికల్పమని చెప్పఁగాఁ దెనుఁగున వాక్యమధ్యన సంధి నిత్యముగాఁ బాటింప వలెనని యీ సూత్రముచేఁ దెలియుచున్నది. అది పద్యములలోనైనచో సంస్కృతమున రెండవ పాదాంతమున ముఖ్యాగా విరామము కల్గును. కాని తెనుఁగున నాల్గుపాదములను గలియవలెను, అట్లుకాక విరళముగాఁ బాదాంతములందు విసంధి కనపడుచున్నది. "పడగనున్నహనుమ భయ విహ్వలుఁడు గాఁడు, అరదమునకు సూతుఁడచ్యుతుండు" ఇక్కడఁబాదము

చివరనున్న "కాఁడు+అరదము" ఉకారాకారములకు సంధి నిత్యముగా రావలసియుండఁగా సంధికాలేదు "సర్వతీర్థాభిగమనంబు సర్వవేద। సమధి గమము సత్యంబుతో సరియగావు, ఎఱుఁగుమెల్ల ధర్మములకు నెల్లఁబెద్ద, యండ్రుసత్యంబు ధర్మజ్ఞులైన మునులు" భార· ఆది. 4 ఆ "కావు+ఎఱుగుము" ఇక్కడకూడ నుకారసంధియే. ఇట్లు సంధిచేయకున్నను దోషము లేదు.

చింతామణిలో నౌపవిభక్తిక సంధి యీ పరిచ్ఛేదముననే చెప్పఁబడి నది. కావి బాలవ్యాకరణము ననుసరించుచున్నందున నఁటనే దానిని వ్రాయుదును.

—: ఇందు జ్ఞప్తియందుంచుకోఁదగిన సంకేతములు :—

ఉత్తు, స్వరము, సంధి, యడాగమము, బహుళము, స్త్రీవాచకము, క్త్వార్థము, ఆమ్రేడితము, పదము, ఆదేశసరళము, సంశ్లేషము, స్వత్వము, వర్గయుక్కు, అవసానము, అనుకరణము, త్రిసమము, పుంపులు, టుగాగమము, రుగాగమము, మగాగమము, తద్ధర్మార్థకవిశేషణము, వృత్తి, విభాష, వ్యవస్థితవిభాష, లుప్తశేషము, ద్విత్వము, ద్విర్వచనము, భృశార్థము, లిగాగమము, కర్తృవాచి, మధ్యమముద్రుజ్ఞులు, నిడున, కుఱుచ, సంధి.

సంధి పరిచ్ఛేదము

—o—

శ్రీ

బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిని

# తత్సమ పరిచ్ఛేదము

చింతామణి. డు ము వు ల వః ప్రథమాస్యాత్

హరికారిక. డు మూ వు లూ చ ప్రథమా

బా. ౧. డుమువులు ప్రథమ

చిం. కూర్చిలను నమో భవే ద్వితీయాతు

హ నుర్ద్వితీయా

బా. ౨. నువర్ణంబు ద్వితీయ

చిం. తో చేత తోడ చేచ తృతీయాయాః

హ. తతః పరా చేతతోడా

బా. ౩. చేతతోడ తృతీయ

చిం. కొఱకు కయిచతుర్థ్యాః స్యుః

హ. కొఱకు కైచ చతుర్థీ

బా. ౪. కొఱకు, కయి చతుర్థి

చిం. పట్టి వలన కంటె ఇతిపంచమీ

హ. త్వథ పంచమీ కంటె వలన పట్టీతి

బా. ౫. వలన, కంటె, పట్టి పంచమి

చిం. అథలోపల కిఁకు యొక్కానాం

హ. షష్ఠి లోపల యొక్క కు

బా. ౭ కు, యొక్క, లోపల షష్ఠి

చిం. అంద్విందునాస్తు సప్తమీ

హ. సప్తమీ నాందు

బా. ౮ అందు, న సప్తమి

గు. తత్సమములనఁగా - సంస్కృత ప్రాకృత సమములని సంజ్ఞా పరిచ్ఛేదములో సంకేతించినను, ఇచటఁ దత్సమ పరిచ్ఛేదమని, దీనిలో సంస్కృత సమమైన యాంధ్ర పదములను మాత్రమే సాధించుచున్నాఁడు. పై సూత్రముల విభక్తి ప్రత్యయములు చింతామణి ప్రాచీనము, తక్కినవి తర్వాతివియు నగుటచే చింతామణిలోఁ జెప్పిన కొన్ని ప్రత్యయములను తక్కినవారు చక్కగా సంక్షేపించినారు ఉదా: ని, ను, ద్వితీయ. "ని" తీసివేసిరి. 'చే, చేత, తోడ, తో, తృతీయ' చింతామణి. 'చే తో' లను వదలిరి. 'కి, కు' షష్ఠిలో "కి"ని వదలిరి 'అందు, ఇందు, న, సప్తమి'లో 'ఇందు' వదలిరి. ద్వితీయలో "మార్చి"ని వదలిరి ఈ వదలిన వానిని రూపాంతరమున సాధించిరి. అది ముందు స్పష్టమగును.

హ. నుక్తాదేః

బా. ౯. తృతీయాదులకు నుగాగమంబగు.

రామునిచేతను, రామునితోడను, రామునికొఱకును, రామునివలనను, రామునికంటెను, రామునకును, రామునియందును.

వ్యా. తృతీయ మొదలు సప్తమి వఱకునున్న విభక్తి ప్రత్యయము లకు 'నుక్+ఆగమము' ను-అంతాగమముగా వచ్చును. నుక్ అని కొవొల్లు చేర్చుటచే ఆ యర్థము వచ్చినది. ఇది సంజ్ఞాపరిచ్ఛేదమున వివరింపఁబడినది.

సూ. షష్ఠియొక్క కయి న్వినా

బా. ౭. కయి, పట్టి, యొక్క-లకు నుగాగమంబు లేదు.

రామునికయి, జ్ఞానముఁబట్టి, రామునియొక్క.

వ్యా. 8వ సూత్రముచే 'కయి, పట్టి, యొక్క'లకును నుగాగమము ప్రాప్తించఁగా దీనిచే నిషేధించినాఁడు. విభక్తి ప్రత్యయములలో నుగాగ మము వచ్చినవి. ప్రత్యప్రకృతికములు: రానిని కళలు నని తెలియునది.

సూ. చేత లోపల తోడానాం శేష అద్యక్షరవ్య వా

బా. ౧౦. చేత తోడ లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు.

ప్రత్యయంబు వర్ణకంబని ప్రాచీనులు వ్యవహరింతురు.
రామునిచే-రామునితో-వనములలో.

వ్యా. 'చేత, తోడ, లోపల' అను వానిలోని మొదటి యక్షరములు మాత్రమే వికల్పముగా మిగులును. అనఁగా "చే, తో, లో" అనియగును, అర్థము మాత్రము మారదు. "ప్రత్యయ ఇహ వర్ణకః" అని చింతా మణిలో—సంస్కృతములోఁ బ్రత్యయమని వాడఁబడునదే తెనుఁగున వర్ణక మని చెప్పఁబడునని చెప్పినాఁడు.

హ. డు రేకవచనే ముర్వు స్తథా న శ్చాథవాచకః

బా. ౧౧ డుమువున లేకవచనంబులు.

ఏకత్వ సంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు.

రాముఁడు, సోముఁడు, వనము, ధనము, ధేనువు, భానువు.

వా. "డు, ము, వు, న" ఈ ప్రత్యయము లేకవచనమునమాత్రమే చేరును. "రాముడు, వనము, ధేనువు, ఆకాశమున" ఇవన్నియు నేకవచనములే. "న" సప్తమీ విభక్తి ప్రత్యయము. దీనికి మూలమున నుదాహరణ మియ్యలేదు.

హ. లు ర్బహూనాం

బా. ౧౨. లువర్ణంబు బహువచనంబు.

బహుత్వ సంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు. రాములు, సోములు, వనములు, ధనములు, ధేనువులు, భానువులు.

వ్యా. సంస్కృతమున ద్వివచన మొకటున్నది. తెనుఁగునలేదుకాన, ఒకటికన్న నెక్కువ-అనేకము-వస్తువులను బోధించునది బహువచనము. బహువచనమున "లు"చేరును. రాములు మున్నగునవి యుదాహరణములు. "లువర్ణంబు" అని మూలమున నేప్రమాదముననో పడియుండవచ్చును. "లువర్ణకంబు" అని యుండుట లెస్స.

హ. తదితరే వర్వే చోభయవాచిన,

బా. ౧౩వి తక్కెను. యుభయంబులు.

మిగిలిన ప్రత్యయము లేకత్వ బహుత్వములకు బోధకములని యర్థము. వనమును, వనములను, వనముచేతను, వనముల చేతను, వనముతోడను, వనములతోడను.

వ్యా. తక్కిన ప్రత్యయము లేకవచనమందు, బహువచవచన మందును వచ్చును ఏక-వనమును, బహు.,వనములను తక్కిన విస్తే.

చిం. ఓయీ త్యా మంత్రణంచ వికృతౌస్యాత్.

హ. ఓస్యా దామంత్రణేతస్య.

బా. ౧౪. ఓ యామంత్రణంబునందగు.

ఓ యను శబ్దము సంబోధనంబునం దగునని యర్థము. ఇది సంబోధ్య వాచకమునకు ముందే ప్రయోగింపంబడును. ఓశబ్దంబు తొలఁగియు సంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును ఓరాముఁడ! ఓ రాములార! రాముఁడ! రాములార!

వ్యా. సంబోధన ప్రథమా విభక్తికి ప్రత్యయములు మున్ను చెప్ప నందున నిప్పుడు చెప్పుచున్నాఁడు సంబోధనమున "ఓ"వచ్చును. విశేష మేమనఁగాఁ దక్కిన ప్రత్యయములన్నియుఁ బ్రాతిపదికకుఁదరువాతరాఁగా నిది ముందే వచ్చును. ఓ రాముఁడ-ఓ రామ! సంబోధించునపుడు—ఓశబ్దంబు తొలఁగియు-ఓశబ్దమును వదలికూడ ప్రయోగించుటకలదు. "ఓరాముఁడ!" అన్నను "రాముఁడ!" అన్నను సమమే.

హ. యిశ్చ స్త్రిశ్చార్థ భేదతః.

బా. ౧౫ ఓ శబ్దంబునకుం బురుష, నీచస్త్రీ, పురుషామంత్రణంబు లందు యి, స్త్రి, రి వర్ణంబులు విశేషణంబాగమంబులగు.

ఓయి రాముఁడ! ఓరాముఁడ! ఓసి మస్థురాల! ఓమస్థురాల! ఓరి దుష్టుఁడ! ఓ మష్టుఁడ!

వ్యా. పురుష, నీచపురుష, నీచస్త్రీ, సంబోధనమునందు ఓ యను దానికిఁ గ్రమముగ "యి, సి, రి" అనునవి అంతాగమములు వికల్పముగా వగును. అనఁగా "ఓయి, ఓసి, ఓరి" అనిగాని, ఓ అనిగాని సంబోధనకు ముందు వచ్చును. పురుషామంత్రణము—ఓ రాముఁడ! నీచపురుషా మంత్రణమునకు-ఓరి దుష్టుఁడ! నీచస్త్రీ సంబోధనకు—ఓసి దుష్టురాల! వికల్పము కనుక, "యి సి రి" రాని పక్షమున "ఓ" అనియే యుండును.

సూ. మైత్ర్యాంచ రిక్సి కౌ జ్ఞేయా వేషాం దీర్ఘోపి దృశ్యతే।
స్వాతంత్ర్యేణ ప్రయోగోఽపి క్వచి త్సుకవి సమ్మతేః॥

బా ౧౭. ఓరి యోసి మైత్రియందుం గలవు.

ఓరి చిన్నికృష్ణ! ఓసి ముద్దుబాల! ఓయి మొదలయిన వానికిస్వతంత్ర ప్రయోగముంగలదు. సంగతియె యోయి! ఓసి పోవే. ఓరోరి యింకెందు బోవచ్చు? వీనికి దీర్ఘంబుంగలదు. ఓయీ విప్రకులావతంస! ఓరీ దుష్టవి ఖాటులారా! ఓసీ వనుఁజెనకొలాకు.

వ్యా. నీచ సంబోధనమందే కాక: స్నేహముతోఁ బిలుచునపుడును 'ఓరి, ఓసి' అనునవి వాడఁబడును. స్వతంత్ర ప్రయోగమనఁగా సంబోధన పదము లేకుండ ఓయి మొదలైనవి మాత్రమే వాడుట. ఉదా. సంగతియె యోయి=ఓయి! సంగతియే? వీనిక దీర్ఘముల కుదాహరణములు 'ఓయీ, ఓసీ, ఓరీ' అనునవి. ఈ పై రెండు సూత్రములకును అధర్వణకారిక లాధారము. "వికృతావత్రలోపస్స్యాత్సం బుద్ధ్యోయి పదేతు యేః। సపూర్వత్ర

స్త్రీత స్స్యాద్రో ఇతి స్త్రీ వాచకో భవేత్। పంక్తై రివ ప్రయోగస్తు స్యాద్వ యోరపి వాద్యవత్. నీచతాయాం రిసీ స్యాతాం క్వచిన్నైశ్చ్రాంచ తత్ప్రభృతిః అన్య త్రాపి క్వచిద్రోస్యా ద్రూఢ శబ్ద ప్రయోగతః" పై సూత్రముల యర్థమే కాక యిందు మరొక విశేషము చెప్పబడినది. స్త్రీవాచక సంబోధ్య వాచకము చివర "రో" అనునది చేరును. "కమల దళాక్షిరో వినవుగా కల యొక్కటి కంటి వేకువన్ ప్రభా. 4 ఆ రమణిరా భృత్యులందు నపరాధిము గల్గిన నాయకుల్. భాగ. 4స్కం. మొదటిది'రో అని దీర్ఘమునకును, రెండవది 'రా' అని హ్రస్వమునకు నుదాహరణము. ఇదిగాక, దేశ్య స్త్రీవాచక స్త్రీసమ శబ్దంబులపై నేకవచనమున "అల,కాన" అనునవి యంతాగమంబులగు. "భవ్యపతి దేవతావార వరమపుణ్య। ధర్మమే మఱకుండుమీ తల్లికాన. నై, 7 ఆ. మాసామికాన, మాయమ్మకాన మున్నగునవి. "అక్కల కన్యకాత్వమిటు లాఱడిపోవ నకారణంబనీ, కెక్కడిచూలు వచ్చె" నిర్వ, 2 ఆ. 'అల' దీర్ఘమునకును. "కే" నడిచి కొను పెంపుల, లాలలు దొరఁగంగ నన్నలా! అని యొటలున్ ఉ, హరి. 4 ఆ.

చిం. స్త్రీ పశు జ డా న్యనా న్యే మహదాఖ్యాః
తద్విశేషణాశ్చాపి

హ. స్త్రీ తిర్యగ్జడ భిన్నా స్తద్వే దకా మహదాహ్వయాః

బా. ౧౩. స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును, వాని విశేషణంబులును మహత్తు లనంబడు.

తిర్యక్కు లనఁగాఁ బశుపక్ష్యాదులు. జడములనఁగా నచేతనములు.

వ్యా. స్త్రీలు, పశువులు, పక్షులు, జడములు (చెట్లు, కొండలు. నదులు మొదలైన వచేతనములు—చైతన్యములేనివి,)కాక తక్కినపదార్థము

బము, వాని విశేషణములును మహత్తులని చెప్పఁబడును.దీనివలన నమహత్తులవఁగా-తిర్యగ్జడములనియు, స్త్రీలకు మహతియనియు దెలియుచున్నది.

సూ. మిత్రా దిక్లీబమహతాంపుంలింగ నమతాతువా.

బా. ౧౮. క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విశేషం బుంలింగ తుల్యంబులగు.

మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు మిత్రాదులు.

వ్యా. సంస్కృతమున నపుంసక లింగములై, తెనుఁగునమహద్వాచకములై-పురుషులను జెప్పుచో, నవి వికల్పముగా మహత్తులగును.మిత్ర(న) స్నేహితుఁడు మిత్రః(పుం) - సూర్యుడు, శరణం(న) - దిక్కు, రక్షణ. ఇల్లను నర్థమున నిది యమహద్వాచకము పాత్రం(న)-పాత్రుఁడు-అర్హుఁడు పాత్ర-గిన్నె యను నర్థమున నమహత్తు ఇవి మహద్వాచకములై నపుడు—మిత్రుఁడు-మిత్రము, శరణుఁడు-శరణము, పాత్రుఁడు-పాత్రము అను రెండు రూపములను బొందును సూర్యుఁడు, ఇల్లు, గిన్నె అనునర్థమున"మిత్రుఁడు, శరణము, పాత్ర" అనియే యుండును. శరణశబ్దమునకు "శరణు"అనియు రూపాంతరము కలదు.

సూ. జి ద్బిందుపూర్వః

బా. ౧౯. జిత్తు బిందుపూర్వంబగు.

జకార మిత్తుగాఁగల దానికి ముందు బిందువు వచ్చునని యర్థము. కార్యార్థము ప్రత్యయాదులందు విబద్ధమయి, ప్రయోగించునపుడు మానం బడు వర్ణ మిత్తు నాఁబడు. ఉదాహరణముమీఁద స్పష్టంబగు.

వ్యా. ఇత్తు=ఇకారముత్తుగాఁ గలది. ఉిమపూర్వంబు = ఉిందు మన్నగాని, అరమన్నగాని పూర్వమందుఁగలది: అగు=అగును. "ఇత్తు" అనఁగాఁ బ్రత్యములకుఁ గొన్ని ప్రయోజనముంకై చేర్పఁబడి,ప్రత్యయము చేరఁబోవునరికిఁ దొలగిపోవునది. ఉదా : డుఙ్‌లో ఙ్ ఇత్తు. ఙ్‌ను ఇత్తుగాఁ జేర్చుటచే "డు"వర్ణమునకు ముందు బిందువు వచ్చునను ప్రయోజనము కల్గుచున్నది. కాని "రాము+డుఙ్" చేర్చవలసి వచ్చునరికి "రాముఁడు" అనియే యగును. కార్యార్థమై ప్రత్యయమునకుఁ జేర్చఁబడినను ప్రయోగమున నుండదని స్పష్టమైనది.

౫. డుమంత సంజ్ఞో డుఙ్ ప్రకృతిర్మతః

బా. ౨౦. డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతం బనంబడు.

స్పష్టము.

వ్యా. డుఙ్ ప్రత్యయమునకు, ప్రకృతి=ప్రాతిపదిక = నామము విభక్తి ప్రత్యయములు చేర్పఁదగిన మూలరూపము. డుఙ్ చేర్చుటకుఁ దగిన దానికి డుమంత మని పేరు.

చిం మహతో౽త ఉ ద్విభక్తౌ

౬. పుంలింగస్య మహద్వాచి నామ్నోంత్యస్యాత ఉద్భవేత్

బా. ౨౧. పుంలింగంబయి మహద్వాచకం బయిన నామంబు తుది యత్వంబు కుత్వంబగు.

నామంబనఁగాఁ బ్రాతిపదికము. డిద్ధ, రామ, భార్గవ, రాజ, పురుష-ఇట్టివి ప్రాతిపదికములు. డిద్ధు-రాము-భార్గవు-రాజపురుషు.

వ్యా. సంస్కృతమున పుంలింగమైయుండి, మహద్వాచకమనఁగా బురుషునిఁజెప్పు ప్రాతిపదిక చివరనున్న అకారమునకు ఉకారము వచ్చును. 'రామ'లోఁ జివర (మ్+అ) అకారమున్నదే, అది "ఉ"కారమై మ్+ఉ ='రాము' అయినది, అట్లే తక్కినవియును.

చిం. మహత స్సో ర్దు జనితో భవే త్పుంసి

హ. పుంలింగా న్మహతో డుజ్ స్యాత్

బా. ౨౨ పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు.

ఇచ్చట డుజ్జను దానియందు జకారమిత్తు గావున - జిత్తు బిందు పూర్వంబగునను సూత్రముచేత డువర్ణమునకు ముందు సున్న వచ్చును. పిమ్మట జకారము లోపించును. ఉ. డిద్ధుఁడు-డిద్ధుండు, రాముఁడు—రాముండు, భార్గవుఁడు-భార్గవుండు.

వ్యా. సంస్కృతమునఁ బుంలింగమై మహద్వాచకమైన ప్రాతిపదికకు డుజ్ చేరును. ఉదాహరణలన్నియును బుంలింగములు, మహద్వాచకములు. వానికి డుజ్ చేర్పఁగా-రాము+డుజ్. ఇప్పుడు 19 సూ.చే బిందు పూర్వమై 'రాముఁడుజ్, రాముండుజ్' అయి, ప్రయోగింపఁబోవునికి కార్యము పూర్తియైనందున ఇత్తగు జకారము లోపించఁగా "రాముఁడు" అగును. సంజ్ఞా 14 సూ చే హ్రస్వముపైఁదిది కాన వికల్పముగా నిండు సున్నయై "రాముండు" అగును.

దీనినిట్లు వ్రాయవచ్చును. 'రామ' పుంలింగమైన మహద్వాచకమైన డుమంతము. 21 సూ.చే అత్వంబున కుత్వమురాఁగా 'రాము' 22చే డుక్ చేరఁగా "రాముడుక్" 19చే బిందు పూర్వత్వమురాఁగా "రాముఁడుక్" సంజ్ఞా 14చే, "రాముండుక్" ఉకారమిత్తుగావునఁ బ్రయోగమున నడిలోపించఁగా "రాముఁడు, రాముండు" అని రూపద్వయము నిష్పన్నము అగును.

చిం. ని రమో మహతాం ఉత్వ స్యాత్
కర్మప్రవచనీయకే కూర్చి॥
మహతో నితో విభక్తౌ టాదౌ వచన ద్వయే క్రమేణ స్తః॥
హ. టా దివిభక్తౌ నిర్నే త్యేతే డుమంతస్య నిగాగమః॥
ద్వితీయాద్యేకవచనే సర్వత్రాపి విభాషయా॥

బా. ౨౩. డుమంతంబునకు ద్వితీయా ద్యేకవచనంబు పరంబగు నపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు.

రామునిని, రాముని, రామునిచేతను - రాముచేతను, రామునికిని, రామునకును, సర్వత్రయనుట నగాగమ బాధనార్థము.

వ్యా. డుమంతములైన "రాము, డిద్దు, మగ"మున్నగువానికి, ద్వితీయాది విభక్తులలోని యేకవచనము పరమగునపుడు నిక్+అగమము= నికారమంతావయవముగా వచ్చును. సర్వత్ర=అన్ని విభక్తులలోను యీ చెప్పుటచే 28 సూ.చేఁ జెప్పఁబోవు నగాగమమును వికల్పించి నిగాగమము వచ్చునని తెలియుచున్నది. దీని ప్రక్రియ యేదనఁగా "రాము+ను" 23చే నిగాగమము వికల్పము కనుక నడిరాని పక్షమున - "రాము+ను" 23చే

"ను" వర్ణంబు "ని"యై "రాము+ని=రాముని" యగును. ఇట్లే తృతీయాది విభక్త్యులందును నిగాగమము వచ్చినచో రామునకును రానిచో "రామునికిని" అగును.

### ౫. పత్త్రిలింగ డుమంత స్యానుదంతస్య తు నిత్యతః

బా. ౨౪. అనుదంతమగు తెనుఁగుడుమంతమునకు నిగాగమము నిత్యముగానగు.

మగనిని, మగనిచేతను, మగనికిని అనుదంతంబను పర్యుదాసము చేత-తమ్మునిని, తమ్ముని, తమ్మునిచేతను, అల్లునిని, అల్లునిచేతను, అల్లుచేతను: బల్లిదునిని, బల్లిదుని, బల్లిదునిచేతను, బల్లిదుచేతను ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికంబని యెఱుంగునది.

వ్యా. హ్రస్వ ఉకారాంతములుకాని, డుమంతములైన తెనుఁగు శబ్దములకు నిగాగమము నిత్యము మగ—ఇది ఉకారాంతముకాదు, డుమంతము. దీనికి-మగ+ను చేర్చఁబోఁగా నిగాగమము వచ్చి "మగ+ని+ని=మగనిని" అనియే యగును. కాని "మగని" అనికాదు. 'మగనిచేత'అనవలెను. కాని "మగచేత" అనరాదు. పర్యుదాసమనఁగా "ప్రసజ్య ప్రతిషేధోయం క్రియయా సహయత్రన=ఞ పర్యుదాస స్స విజ్ఞేయో యత్రోత్తరపదేన న=ఞ" నిషేధము క్రియతో నన్వయించినపుడు ప్రసజ్య ప్రతిషేధమని, ఉత్తర పదముతో నన్వయించినపుడు పర్యుదాసమని చెప్పఁబడును. అనుదంతమనఁగా నుదంతముకాక, కొన్ని యుదంత ధర్మములు (డుమంతత్వాదులు) కలవను వర్థము వచ్చును. అట్టివి-మగ, మనుమ, రే, వ్రే, ఱే,కా, ప్రత్యయాంతంబులు మున్నగునవి మగాదులు. వీనికి నిత్యముగా వచ్చును. తెనుగుఁ డుమంతములైన-తమ్ము,బల్లిదు,అల్లు మున్నగువానికి 23 సూ.చే

వికల్పము. వర్ణ్యదాన సామర్థ్యమువలన అనుదంతములైన వగాదులకు రాదు. పాక్షికంబు=వికల్పము.

**హ. యన్తు దుమంతస్యోపరి,ను న్సంఘటిత స్తదుత్వ మిత్వం స్యాత్.**

బా. ౨౫. దుమంతంబు (ది నువర్ణకంబు నుత్వంబున కిత్వంబగు.

నువర్ణంబు ద్వితీయ యను సూత్రముచేత — రామును — అని ప్రాప్తింపఁగా నీ సూత్రముచేత నువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె. రాముని, భార్గవుని.

వ్యా. నన్నయ "ని ను" ద్వితీయా విభక్తి ప్రత్యయములుగాఁజెప్పి 'నిరమోమహతాం'అని ద్వితీయావిభక్త్యేక వచనమున "ని"మహత్తులకగు ననెను. వీరు "ను"ప్రత్యయమును మాత్రమే చెప్పి దానికి ఇత్వము సాధించుటకై సూత్రాంతరమును కల్పించిరి. దుమంతముమీఁదనున్న "ను"ప్రత్యయములోని యుకారమున కికారము వచ్చును అనఁగా "ను" "ని" గా మారును "రాము+ను=రాము+ని=రాముని" అగును.

**హ. ఉత ఇత్వం స్యా దేః పరభాజాం కు,ను,వు,క్రియా విభక్తీనాం।**

బా. ౨౬. ఇకారంబుమీఁది కు ను వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు.

హరిని, హరికిని, శ్రీని, శ్రీకిని, వారిని, వారికిని.

వ్యా. 'కు, ను, వు' అనునవికాని క్రియావిభక్తులుగాని ఇకారముమీఁద వచ్చునో వాని యుకారమున కికారము వచ్చును. "హరి+ను" హరి—

ఇకారాన్తముగదా సు-ఇకారముమీఁదనున్నది. కావున "ని" యైనది. అట్లే 'హరి+కు+ను=హరికిని.' అగును. శ్రీ+ను-ఈకారముకూడ ఇకార మనుటచే గ్రహింపఁబడును. కనుక దీనిమీఁద నుకారములోని యుకారమున కికారమువచ్చి 'శ్రీని' యైనది, క్రియావిభక్తికి – వచ్చితి+రు=వచ్చితిరి. వువర్ణకమునకు –సుబుద్ధి+వు=సుబుద్ధివి.

**హ. ఈధాతుయుష్మ దర్థేభ్య స్తాపా మోర్నేత్వమిష్యతే.**

బా. ౨౬. ఈధాతు యుష్మదర్థంబులమీఁది వాని యుత్వంబున కిత్వంబురాదు.

ఈరు, ఈవు, ఈను, ఈము, నీకు, మీకు.

వ్యా. "ఈ" అను ధాతువున కిచ్చుటని యర్థం. 25చే నుత్వమున కిత్వము రావలసియుండఁగా దీనిచే నిషేధించుచున్నాఁడు. ఈ ధాతువు మీఁది వానికి–ఈరు, ఈను, ఈవు, ఈము. యుష్మదర్థములు=నీవు మీరు అను నర్థముకల నీశబ్దము. దానికి- "నీకు, మీకు" అని యుకారమేయుండును గాని యికారమురాదు.

**చిం. నః కౌ.**
**హ. కు వర్ణకే నగో రుళ్ఛ.**

బా. ౨౭. కువర్ణకంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమంబగు.

రామునకును, విష్ణువునకును, సవితృనకును, విధాతృనకును.

వ్యా. కు ప్రత్యయము పరమైనపుడు ఉకార, ఋకారాన్తములైన శబ్దములకు నక్+ఆగమము – నకారము ప్రాతిపదిక తర్వాత వచ్చును.

'రాము+కు' ఉకారాన్త ప్రాతిపదికపై కు చేర్పఁబోఁగా, నగాగమము వచ్చి 'రాము+న+కును - రామునకు' నగును. అట్లే సవితృ, విధాతృ శబ్దములు ఋకారాన్తములు. వానికి నగాగము వచ్చినది. ఆగమశాస్త్ర మనిత్యమని కొందరు నగాగమము లేకున్నను దోషములేదనిరి. కావిపువర్ణము మీఁద కు చేర్పఁబడునపు డశ్లీల పదమై శ్రుతి కటువుగా నుండును. కాన నగాగమము నిత్యముగాఁ జేర్చుటయే మంచిది. 'ఏ తోపు సోర్వక, విద లాషుఁమును, దనుజరిపుకు' నిత్యాదు లశ్లీలములగును. 'రాముని ఋభపతి తండ్రిగ, రామాయణము రచించి ప్రాచేతసుకున్' భాస్కరరామా. 'వంతుకు వచ్చు సత్యగిరువమ్మికఁ జెల్లదటంచు మానిసీ' పారి. 1 ఆ. ఇట్లు నగాగ మము లేని ప్రయోగములున్నవి. 'వంతున వచ్చు'అని పాఠాంతరమున్నవి.

## సూ. తయో రంతే నుగాగమః

బా. ౨౯. ఉకార ఋకారంబుల కందు వర్ణకము పరంబగునపుడు నుగాగమంబగు.

రామునందును, విష్ణునందును, విధాతృనందును

వ్యా. ఉకార ఋకారాన్తములకు "అందు" అను సప్తమీ విభక్తి ప్రత్యయము పరమైనపుడు నుగాగము=ను చేరుట జరుగును. 'రాము+ అందు=రాము+న్+అందు=రామునందు.

## సూ. పుమ్వో రాగమయో రంతే నుగ్వేత్తు విభాషయా

బా. ౩౦. ఆగమ ము పువర్ణకంబుల కందువర్ణకము పరంబగు నపుడు నుగాగమంబు విభాషనగు.

వనమునందును, వనమందును, ధేనువునందును, ధేనువందును.

వ్యా. అగమముగా వచ్చిన ము, వు ప్రత్యయములకందుప్రత్యయము పరమైనపుడు నుగాగము వికల్పముగా వచ్చును. వనము- ఇచ్చట-ము- అగమ మువర్ణకము. వనము+అందును అని కలియునపుడు నుగాగమము వచ్చి "వనము+న్+అందును=వనమునందును అగును ఇది వికల్పము కనుక నుగాగమము రానిపక్షమున ఉకారసంధియై 'వనమందును' అగును. అట్లే ధేనువునందును, ధేనువందును అన్న రూపములు. ఈ "ము,వు,"లు ప్రథమా విభక్తి ప్రత్యయములు కావు. 40, 49 సూత్రములచే నాగమముగా వచ్చినవి.

హ. బహుతాయాం ద్వితీయాది విభక్తీనాం లడాగమః

బా. ౩౧. బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు.

రాములను, రాములచేతను, విధాతృలను, విధాతృలచేతను.

వ్యా. ద్వితీయ మొదలైన విభక్తులకు బహువచనమున లకారము ముందాగమముగా వచ్చును. 'రాము+ను' దీనికి బహువచనమున 'రాము+లను=రాములను' అగును.

చిం. ఆమన్త్రిణ సుఙ సోన్తః క్రమేణ చాదార దాగమావన్తే

హ. సంబుద్ధ్యంత పదాంతోతోఽద్వా

బా. ౩౨. సంబోధనంబు సందేశార్థంబయిన పదంబు తుది యుకారంబున కకారంబగు.

ఓ రాముఁడ! ఓ వృక్షమ! ఓ శంభువ! ఓ కొడుక!

వ్యా. సంబోధన ప్రథమైక వచనమునకు "సంబుద్ధి" యని పేరు సంబుద్ధిలో ప్రాతిపదిక చివరనున్న ఉకారమునకు అకారము వచ్చును; ఓ+రాముఁడు= డులోని యుకారమున కకారమాదేశముకాఁగా 'ఓరాముఁడ! అయినది, మిగిలినవిట్లే.

సూ. తస్యేత శ్చ దీర్ఘతా

బా. ౩౩. సంబోధనమునందుఁ బదంబు తుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు.

ఓ రాముఁడా. ఓ రాముఁడ! ఓ చెలియా. ఓ చెలియ! ఓ హరీ! ఓహరి! ఓతండ్రీ! ఓతండ్రి!

వ్యా. సంబోధనమునఁ బ్రాతిపదిక చివరనున్న అకార, ఇకారములకు దీర్ఘము వికల్పముగానగును 'ఓరాముఁడ!' అనిరాముఁడు శబ్దమునకు 32 సూ.చే అకారమురాఁగా దీనిచే దీర్ఘమువచ్చి "ఓరాముఁడా!" అయినది. ఇకారాంతమునకు "ఓహరీ!" దీర్ఘము రానిపక్షమున "ఓరాముఁడ! ఓహరి!"అని హ్రస్వమేయగును.దీనికధర్వణకారిక 'సంబోధనేనాదీర్ఘస్యాత్ప్రయోగస్య తథాగతేః భవే దత్రాదితామేవ దీర్ఘత్వం ప్రకృతేఋచేః"

చిం. నామంత్రణే డు జిత్యస్యే

సూ. లోపోవా సంబుద్ధిడుజః కృతో స్సంస్కృత నామతః।

బా. ౩౪. కృతోత్కృంబగు సంస్కృత నామంబున సంబుద్ధి డుజ్జునకు లోపంబు విభాషనగు.

ఓరామ-ఓకృష్ణ-పూర్వసూత్రముచేత దీర్ఘంబు—ఓరామా! ఓకృష్ణా! సంస్కృత నామంబులంజేసి - ఓతమ్ముఁడ - ఓ బల్లిదుఁడ-ఇత్యాదులందు లోపంబు లేదు.

వ్యా. కృతోత్కంబగు-కృత=వ్యాకరణ సూత్రముచే సాధింపబడిన ఉత్కంబగు=ఉకారము కలిగిన, సంస్కృత నామంబు = సంస్కృతము నుండి తెనుఁగులోనికి వచ్చిన ప్రాతిపదికకుఁ బరమైన సంబోధన ప్రథమైక వచనములోని డు ప్రత్యయమునకు లోపము వికల్పముగా నగును. ఓరామ—రామశబ్దము సంస్కృతనామము 21,22,లచే ఉత్వము.డుజ్ఞువచ్చి "రాముఁడు" అయినది. సంబోధ నైకవచనములో 34చే డుజ్ఞు లోపించఁగా "ఓరాము" అయి, 32చే ఉత్వమున కత్వమురాఁగా రామ! 33చే దీర్ఘము రాఁగా "ఓరామా!" అగును సంస్కృత నామంబులచే 'బల్లిదు'మున్నగు కృతోత్కములైన తెనుఁగు నామములకు రానందున "ఓ బల్లిదా!" వంటి అనిష్ట రూపంబులురావు. కృతోత్కమనుటచే సహజముగా నుకారాంతములైన సంస్కృత నామములగు "శంభు, విష్ణు" మున్నగువానికి డుత్వలోప, అత్వములు వచ్చి "ఓశంభా ఓ విష్ణా!"వంటి అనిష్టరూపములును కలుగవు "శంభుఁడ! భానుఁడ!" వంటి రూపములుండును. అమహత్తులకుఁ గూడ మహత్తులుగా వివక్షింపఁబడినపుడు ఉత్వ డుజ్ఞులు విభాషగావచ్చి, సంబుద్ధిలో పాక్షికమైన లోపము వచ్చును. "మేఘా! మేఘుఁడా! మేఘమా!" ఇత్యాది.

**సూ. నైసర్గికోదంత నామ్నో వాద్యాయాం తస్య తూః ప్లుతః**

బా. ౩౫. ఉదంత సంస్కృత నామంబుమీఁద సంబుద్ధి డుజ్ఞునకు మాకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు.

ఓవిష్ణూ ౩. ఓశంభూ ౩. పక్షంబునందు-విష్ణుఁడ-శంభుఁడ-ఇత్యాది.

వ్యా. ఉకారాంతమైన సంస్కృత ప్రాతిపదికమీఁద సంబోధన ప్రథమైక వచనమున దుఙ్వ్యర్థకమునకు ఉకార ప్లుతము వికల్పముగా నాదేశ మగును ప్లుతమనఁగా మూఁడు మాత్రాకాలము యిచ్చరింపఁబడునచ్చు. హ్రస్వమున కొకమాత్ర: గురువునకు రెండుమాత్రలు.ప్లుతమునకు మూఁడు మాత్రలకాలము నియమింపఁబడినది. మాత్రాకాలమనఁగా హ్రస్వమైన యచ్చు నుచ్చరింపుటకుఁ బట్టుకాలము. "విష్ణు" అను దాని యుకారము నకు బ్లుతమురాఁగా 'విష్ణూ 3' అని యగును. వికల్పముగాన ప్లుతమురాని పక్షమున - విష్ణుఁడ! యగును. ఉదంత సంస్కృత నామంబనఁగా సహ జోదంతమని గ్రహింపవలెను 'సంబోధనే ప్లుతం ప్రాహుః కేచిద్దూరాదికే భిక:' అను వధర్వణకారికచే 'అకటా యేమనిదూరుదాన వినువాథా!' కశా. 'ఎవ్వివిఁగాంతుఁ దెల్పఁగదవే తెరువద్ది' మను. మొదలైన అకారాద్యచ్చుల కున్న ప్లుతములు సాధితములగును. ప్లుతము గురువేయగును.

చిం. ఆమంత్రణ ను జసో స్తః క్రమేణ చా దార దాగమా వ న్తే.

హ. సంబోధనే స్యాదే కాన్యవచనే త్వారగాగమః.

బా. ౩౨. సంబోధనంబు బహువచనంబున కారగాగమంబగు.

ఓ రాములార-ఓకృష్ణులార-దీనికిం బాక్షికంబుగ దీర్ఘంబగు. ఓ రాములారా-ఓకృష్ణులారా.

వ్యా సంబోధన [illegible] మునకు 'ఆరక్+అగమము='[illegible] మువదచివర-అంతావయవముగావచ్చు[illegible].ఓరా

ములు+అర=ఓరాములార. దీనికి 3౨సూ.చేవికల్పముగా దీర్ఘమురాఁగా-ఓరాములారా! అగును. సంబోధ్యవాచకములు, వాని క్రియలును బహువచనాంతములైనను, క్రియలఁదవచ్చు అమ్మాపలుమాత్ర మేకవచనాంతములేయగును. 'మనయశోద చిన్ని మగవానిఁగనెనఁట, చూచివ తమమ్మ మదతులార!' భాగ 10 స్కం.

సూ. అర ఙ్మధ్యమయోగే వా.

బా ౩౨. మధ్యమ పురుషయోగంబునం దారగాగమంబు విభాషనగు.

వినుఁడు బాలకులు-వినుఁడు బాలకులార-వచ్చితిరి కాంతలు-వచ్చితిరి కాంతలార. 'అన్నలార! మిమ్ము నడిగెద' నొకమాట.' ఇచ్చట మధ్యమ పురుషయోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు.

వ్యా. సంబోధ్యమునకు మధ్యమపురుషక్రియతో సంబంధమున్నపుడు సంబోధన వాచకపదమునకు 'అర' గాగమము వికల్పము. "బాలకులు! వినుఁడు" వినుఁడు-మధ్యమ పురుషక్రియ. దీనితో బాలకులకు సంబంధమున్నది. కాన అరగాగమము వికల్పముగా వచ్చినది. 'అన్నలార! మిమ్ము నడిగెద నొకమాట' దీనిలో "అడిగెదను" అన్నదుత్తమ పురుష క్రియ. కాన సంబోధనమునకు మధ్యమపురుషతో సంబంధములేదు.అందుచే అరగాగమము నిత్యముగానే వచ్చును.

చిం. లు జసోః శసోఽలాంతాత్ లాంతాత్తు రురా తయోః క్రమేణ నః

సూ. అదంతాదిరాద్య లోపధాత్.

పరస్య మహతో లస్య విభక్తౌ. రేఫ ఇష్యతే.

సూ. ౩౮. అదంతంబయి, దీర్ఘ పూర్వలోపధంబయిన మహత్తు మీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు.

బాలురు-బాలురను - బాలురచేతను. నృపాలురు - నృపాలురను – నృపాలురచేతను. దయాళుశబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి. దయాళురు—దయాళురను-దయాళురచేతను.

వ్యా. అదంతంబయి = హ్రస్వఅకారాన్తమై: దీర్ఘపూర్వలోపధంబయిన—ఉపధయనఁగాఁ జివరి యక్షరమునకు ముందువర్ణము. "అలోంత్యాత్పూర్వఉపధా" అని సూత్రము. దీర్ఘము పూర్వమందున్న లకార ముపధగాఁగలిగినదై మహత్తయిన శబ్దముమీఁది విభక్తి లకారమునకు రేఫము వచ్చును.

'బాల+లు'బాల-లో బా+ల్+అ-ల్ ఉపధకనుక నది లోపధము. దీనికిఁబూర్వమునదీర్ఘ మున్నది. కాన దీర్ఘపూర్వలోపధమైనది అకారాంతమై, మహద్వాచకమునైనది. కాన దీనికిమీఁదవచ్చు బహువచన లకారము రేఫమైనది. 21చే అత్వమున కుత్వమురాఁగా "బాలు+రు=బాలురు" అయినది. "నృపాల, గుణశీల" మున్నగునవిట్లే-నృపాలురు, గుణశీలురు— అగును. ఈ సూత్రము తత్సమ పరిచ్ఛేదములోని దగుటవలనను, వెనుక 34,35 సూ లలో సంస్కృత నామంబులకవి చెప్పటంబట్టియు నీకార్యం సంస్కృత శబ్దంబులకేగాని తెనుఁగు శబ్దంబులకుఁగాదు. కావున "గోల, మాల, బేల" మున్నగు వానికిరాదు. అదంతంబనుటవలన "దయాళులు, కరుణాశీలి, దృఢతాలు" మున్నగు వానికిరాదు. మహద్వాచకమన్నందున 'పుష్పమాల'మున్నగు వానికిరాదు, దీర్ఘపూర్వత్వ విశేషణముచే "సబల, వికల"మున్నగువానికిని రేఫమురాదు దయాంలాతి గ్రాహ్యోతిర

దయాలః యను నదంత దయాల శబ్దమునకు, కరుశాల శబ్దమునకును నదంతత్వముండుటచే రేఫవచ్చినను,ఆలుచ్-ప్రత్యయాంతమైన 'దయాలు' శబ్దముపై నీ సూత్రముచే రేఫమురాదంమన విశేషించి చెప్పుకొన్నాఁడు. దయాఌ+లు=దయాలురు ళళయోరభేదాత్ - దయాళురు. జలస్తోమంబు నల్పంకలం। దెలరన్నాభిచయంబులోఁగొనిమె వానింజాల గాంభీర్యశీలురు పంపోభము నొందువారి నెచటన్‌లోఁగొంచు వర్తింపరే." పారి. 4 అ ఇందు గంభీర్యశీవల శబ్దబహువచనమేగాని గాంభీర్యశీల శబ్దముకాదు.

చిం. స్యాద మహతాం విభక్తౌ సోకృపము.

హ. అదంతానా మమహతాం క్లీబానాంచ మువర్ణకః.

బా. ౩౯. అమహ న్నపుంసకముల కదంతంబులకు మువర్ణకంబగు.

వృషము, ఋషము, దైవము, కళత్రము — అపత్యము క్లీబంబులు మిత్రామలను సూత్రంబునఁ బాక్షికంబుగం బుంలింగత్వం బతి దేశించుటం జేసి మిత్రాది శబ్దంబులకు ద్వైరూప్యంబని యెఱుంగునది ఉ. మిత్రుఁడు-మిత్రము, శరణుఁడు-శరణము.

వ్య. హ్రస్వాకారాంతములైన, అనుహత్తులకును, నపుంస లింగ శబ్దంబులకును మువర్ణకమువచ్చును. "వృషము-ఋషము" ఇవి అకారాంతములు,అమహద్వాచకములును.నపుంసకలింగములు కాకపోయినను పైరెండు లక్షణములు పట్టినందున మువర్ణకము వచ్చినవి. "దైవము-కళత్రము-అపత్యము"అనునవి అకారాంతములైన నపుంసకములు.కానవీనికి మువర్ణకము వచ్చినది. ఇట్లు చెప్పక, అదంతములు, నమహత్తులునైన నపుంసకములకే

యన్నచో వృక్షము - ఋక్షము మున్నగువానికే రాకపోవును. నపుంసక ములకని చెప్పినచో దైవము మున్నగునవి అమహత్తు కానందున రాక పోవును కావున సూత్రముననున్న 'అహమన్నపుంసకములకు'నన్న దానిని విడదీసి అదంతములకు నన్నది ప్రత్యేకముగా నన్వయించుకోవలెను. 18 సూ.చే మిత్రాది శబ్దములకు బుంలింగత్వం వికల్పముగానతిదేశించుట (లేనివానికిఁ గల్గించుట)చేఁ బుంలింగమైనపుడు మిత్రుఁడనియు,క్లీబత్వమున మిత్రమనియు రూపంబులు.

## సూ. తేషా మన్య విభక్తౌ ముక్

బా. ४०. వానికి ముపర్ణకేతర విభక్తి పరమగునపుడు ముగాగ మంబగు.

వృక్షముఁ, వృక్షమును, ఋక్షముఁ, ఋక్షమును.

వ్యా. వానికిన్=పై సూత్రమున నుదాహరించిన వృక్షాదిశబ్దములకు ముపర్ణక+ఇతర విభక్తి=ప్రథమైక వచనముకాక తక్కిన విభక్తులు- పరమైనపుడు, ముగాగము వచ్చును. వృక్ష+లు ముగాగమము రాఁగా వృక్ష+ము+లు = వృక్షములు. వృక్ష + ము + ను = వృక్షమును ఇత్యాదులు.

## సూ తన్యమోః కార్య మిష్యతే

బా. ४౧. ముపర్ణకంబునకు విధించు కార్యము ముగాగమంబు నకు నగు.

ముపర్ణకంబునకు విధించు లోపాదేశాది కార్యములు ముగాగమము నకు సహితము పచ్చునని యర్థము.

వ్యా. ము ప్రత్యయమున కేయే కార్యములు చెప్పఁబడునో, అవ న్నియు నీ ముగాగమంగా వచ్చిన 'ము' కారంనకును వచ్చును. ముపర్ణ

కమునకుఁ గొన్ని లోపాదేశాదులు ముందుఁ జెప్పుచున్నాఁడు. అవన్నియు నీ ముకారంనకుఁగూడ కల్గుటకే ఈ సూత్రం చెప్పఁబడినది.

చిం. తదుపరి పునర్మ బా ప్రాచాం

హ. మోర్మ ద్విత్వం పూర్ణబిందు పూర్వోబు ర్వా విభాషయా

బా. ౪౨. ముపర్ణకంబునకు మాముకిమేనిం బూర్ణబింపు పూర్వక బువర్ణంబేని విభాషనగు.

వృక్షమ్ము—వృక్షంబు, ఋక్షమ్ము-ఋక్షంబు. పూర్వసూత్రముచే మాగాగమమున కీకార్యంబగు. వృక్షములు-వృక్షంబులు. ఋక్షమ్ములు-ఋక్షంబులు.

వ్యా ప్రథమైక వచన మువర్ణకమునకు మాముకి=మకారపుఁబొత్తు గాని, బిందుసున్న ముందున్న బు—ంబు-గానివచ్చును. "పాపదేశస్యబింబు ప్యాన్మా వరే మేళనం భవేత్" అనుకారిక ప్రకార మాగమమునా వచ్చిన మకారమునకు బు పరమగునపుడు బిందుత్వమును. మకారం పరమైనపుడు కలియుటయు జరుగును. వృక్షము-మాముకివచ్చిన-వృక్షమ్ము. వృక్ష+ంబు =వృక్షంబు. 41లో ముపర్ణకమునకుఁ జెప్పిన కార్యము మాగాగమము నకుఁ గూడ వచ్చునగుటచే - వృక్షములు — ఇచ్చట నాగమ మువర్ణంనకు మాముకిరాఁగా వృక్షమ్ములు, పూర్ణబిందుపూర్వక మువర్ణంరాఁగా వృక్షంబులు-అగును. అట్లే తక్కినవోట్లను.

చిం వికృతౌ క్వ చిచ్చలోపో మోర్దీర్ఘ శ్చాత అది మవ్యభవేత్

సూ. ముగాగమస్య లోపస్స్యా ల్లు లయోర్నేచ క్వచిత్.
తత్పూర్వ స్వర దీర్ఘేణ సహ వైభాషికో మతః.

వృ. ౪౩. "లు, ల, న"లు పరంబులగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును, దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు

వజ్రాలు-వజ్రాలను-వజ్రాన పగడాలు-పగడాలను-పగడాన. ఒకానొకచోట ననుటచే నీ కార్యంబునకుం బ్రయోగ వైరళ్యంబు సూచింపంబడియె.

వా. "లు, ల, న"లు పరమైనపుడు కొన్నిచోట్ల మువర్ణమునకు లోపమువచ్చి దానికిఁ బూర్వమందున్న యచ్చునకు దీర్ఘము వికల్పముగా నగును. వజ్ర+ము+లు-43చే మువర్ణమునకు లోపము, తత్పూర్వస్వరమునకు దీర్ఘమురాఁగా 'వజ్రాలు.' అగును. ఇట్లే 'వజ్రాలను-వజ్రాన' మున్నగునవి. 'ఒకానొకచోట' అనుటచేత ప్రయోగవైరళ్యంబు = ప్రయోగములు తక్కువగానున్నవని తెలియుచున్నది.

చిం సోర్లుగితః.

సూ. రైగ్లావు గ్యంత నామర్త్యః ప్రథమైకంతు లోపభాక్.

వృ. ౪౪ ఇగ్లౌరా యుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు.

ఇకారాంతములకు. గ్లౌరై శబ్దములకు. మఱియు మగాగమాంతంబులకుం బ్రథమైకవచన లోపంబగు.

హరి—గిరి—శ్రీ—ధీ.

వ్యా. ఇకారాంతములైన శబ్దములకు, గ్లౌ, రై శబ్దములకు, ఉగంతంబులకు-68 సూ.చే జెప్పఁబోవు ఉగాగమము వచ్చు శబ్దములకును, ప్రథమైకవచన ప్రత్యయమైన "డు" లోపించును. "హరి" ఇకారాంతము. దీనికి డు చేరఁగా "హరి+డు" డు లోపించి "హరి" అగును. ఇకారాంతములనుటచే ఈకారాంతములును గ్రహింపఁదగినవి. కాన 'శ్రీ-ధీ' అన్నవి కూడ నుదాహరింపఁబడినవి. "ఇగ్లౌరై+ఉగంతంబుల = ఇగ్లౌరాయుగంతంబుల" అని సూత్రము. తక్కిన వాని కాశబ్దములక్రిందనే యుదాహరణ లీయఁబడును.

చిం ఉ ద్బహుత్వే.

హ. బహుష్వి దుత్.

బా. ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు.

హరులు—గిరులు—కవులు—రవులు—యామినులు—భామినులు.

తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబు లేదు. శ్రీలు — స్త్రీలు లక్ష్మీలు.

వ్యా. ఇత్తునకున్ = హ్రస్వమైన ఇకారమునకు-బహువచనము పరమగునపుడు ఉకారమాదేశమగును. హరి+లు=రిలోనియికారమునకుకారము రాఁగా "హరులు" అగును. యామినీ భామినీ శబ్దములు సంస్కృతమున ఈకారాంతములైనను 54 సూ.చే హ్రస్వముచేయఁగా "యామిని-భామిని" అగును. అప్పుడు బహువచనమున "యామినులు - భామినులు" అగును. తపరకరణమనఁగా—"ఇకారంబునకు"అనేక"ఇత్తునకు"వని "ఇత్" అనుట 'తపరస్తత్కాలస్య' అను సూత్రముచే తపరకరణముచేయుటచే హ్రస్వఇకారమునకే గ్రహణము కాని దీర్ఘము గ్రహింపఁబడదు. కాన శ్రీ+లు=శ్రీలు

అనియే యగునుగాని 'బ్రులు' కాదు. గుప్తార్థప్రకాశికలో "రశ్మి, రాశి, పర దేశి, పేశి" ఇత్యాది శవర్ణపూర్వకేకారాంతములకు బహువచనము చేర్చునపుడు శవర్ణమునకు "స" వర్ణంబగును. రాశి-రాసులు, రశ్మి-రస్ములు-పరదేశి-పర దేసులు, పేశి—పేసులు" ఇట్లగునని చెప్పఁబడినది. కాని యుదాహరణముగా లక్ష్యములేవియు నీయఁబడలేదు. రాశి—కిఁదద్భవము రాసి. దానికి బహువచనము-"రాసులు" అగును. తక్కినవియు నాలోచింపఁదగినవి. నన్నయ "స్త్రీణాం హ్రస్వః స్యాత్-నవ దేశ్యపదే నచైకవర్ణేపి" అని చెప్పిన దానిఁబట్టి దేశ్యపదమైన "లకోరి"కి బహువచనమున 'లకోరీలు' అని సూరి యుదాహరించెను. కాని దేశ్యపదములైన "నవలా, నేజా, లకోరి, తేజీ" మున్నగువానికిఁ బ్రయోగమున హ్రస్వరూపము లగపడు చున్నవి 'హ్రస్వోదేశ్యే క్వచిత్' అను నథర్వణకారిక దీనికిమూలము కావచ్చును. దీర్ఘమునకు 'నతనాభిన్నవలా నాకానాకమరున్నారీశిరోరత్న మున్' మను. 2ఆ హ్రస్వంబునకు-"అన్నవలముష్టిమోమును, డిన్నవి నెన్నడుము నగపు దేరెడుకన్నుల్" విక్ర. 5ఆ. "కల్వమొగ్గనేజావటు చిమ్మి" భాను. 3ఆ "అనుఁగుఁజుట్టంబైన యలవసంతునిరాక, విరవాది బలు నేజ విఱుఁగజూచి" చంద్ర, 3ఆ. "నేజము గొవియిపోటున, నేజమువిం జేర్తునను" శశాంక 5ఆ "హెచ్చిన బొమ్మవిండ్లు గనియించిన చూపు లకోరి కోలలన్" చంద్రా. 1ఆ. ఈరీతింగెందలి రు, ల, కోరి మురశాణి కాతఁగూర్చు చకోరీ చంద్ర. "గాణనొప్పారు పైరాణంబు సింగిణి, తళు కు లకోరీల తలుకనంబు" మను. 6ఆ. "తెల్లవిమొకి కత్తలావితేజీ హయ మున్"నైష.5ఆ."కోమటులెల్ల వస్తువులు గుఱ్ఱములెల్లను తేజులప్పురిన్" విక్ర 1ఆ. అదిగాక కొందఱు "తద్భవస్యాపి శబ్దస్య దీర్ఘాంతత్వం క్వచిద్భ వేత్". అను నథర్వణకారిక యాధారముగా "పల్లకి" శబ్దమునకు "పల్లకి"

అని దీర్ఘమున్నదనిరి బహువచనమున "పల్లకీలు-పల్లకులు" రెండు రూపములునుండును. మఱికొందఱు "ప్రోల్లసత్పల్లకీ శబ్దైః" అను ప్రయోగానుసారము సంస్కృతమునఁగూడ పల్లకీశబ్దమున్నదనిరి. "పల్లకీలు సందిళ్లములు వారువంబులను దంతులు నాదిగల్గు వాహనం, బు" కళా. 2ఆ. "పల్లకులన్ మహోష్ట్రములఁ భద్రగజంబుల నందలంబులన్" జై. 2ఆ.

**౫౦. ఇదుపోత్త మోత్త మాసాం బహువచన ఉపోత్తమేత ఇద్భవతి.**

**హ. వికృత్యా మిదంతో పోత్తమ ఇత్తథా।**

బా. బా. వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచన పరంబగునపు డుత్వంబగు.

ఇచ్చట వికృత శబ్దమునే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు. కలికి—కలుకులు. ములికి—ములుకులు. చెలిమి—చెలుములు. బలిమి — బలుములు. ఉపోత్తమేత్వంబున కనుటంజేసి-జిగి, విసి - ఇత్యాదులందుత్వము లేదు. జిగులు-విసులు.

వ్యా. "త్ర్యాదీనా మంత్య ముత్తమం. తస్య సమీప ముపోత్తమం" అను వచనానుసారము మూఁడు మొదలెన్నియక్షరములున్నపదములోనైనఁ జివరి యక్షరమున కుత్తమమనియు, దానికి ముందున్న యక్షరమునకు 'ఉపోత్తమ' మనియుఁ బేరు. కలికి-యనిలో మూఁడక్షరములున్నవి. కి- ఉత్తమము లి-ఉపోత్తమము కలికి+లు-45చే-కలికులు-ఇప్పుడు45చే'లి'లోని యికారమునకుకారముఁరాగా కలుకులు' అయినది సూత్రములో 'వికృతి' అను పదమునకు దద్భవమనియేగాక. తత్సమముకాదని యర్థము చెప్పుకొన్నందున "కలికి, ములికి, చెలిమి, బలిమి"వంటి యాచ్ఛికపదముల కీకార్యము

వర్తించినది. తత్సమేతరముల కన్నం బునఁ దత్సమపదములకీకార్యము రాదు నమితి-నమితులు. దీనిలో నుపోత్తమమైన 'మి' ముగా మాఱలేదు. ఉపోత్త మేత్వమనుటవలన రెండక్షరములేయున్న "జగి, ఐసి" యను పదములలోని యుపోత్తమేత్వమున కుత్వము రాలేదు "జిగులు" అయినది కాని "జుగులు" కాలేదు.

హ. నో పోత్తమే దు ద లశో పధే ష్వనవాదిషు.

బా. ౪౭. రలదోపధ నవాద్యాదుల యుపోత్త మేత్వంబున కుత్వంబు గాదు.

పందిరి-పందిరులు, పిడికిలి-పిడికిళ్ళు; రాపిడి-రాపిడులు; తొమ్మిది తొమ్మిదులు.

వ్యా. "ర, ల, ద" లు ఉపధగాఁ (చివరి యక్షరమునకు ముందక్షరముగా) గల పదములకు, నవాద్యాదులకు-తొమ్మిది మొదలైన వానికి నుపోత్త మేత్వమున కుత్వము రాదు. 46న కిది బాధకము. పందిరి — రోపధము కనుక నుపోత్తమమైన "ది" "దు"గా మాఱలేదు. 'పందిరుల' అయినది అట్లే 'పిడికిళ్ళు, రాపిళ్ళు' అన్నవి. తొమ్మిది-బహువచనమున "తొమ్ముదులు" కాలేదు. అవిందములచే "ఎనిమిది, పగిది, చెయిది" మున్నగు పదములలోని యుపోత్త మేత్వమునకు నుత్వంబు రాదు. "ఎనిమిదులు, పగిదులు, చెయిదులు" మున్నగునవి యూహ్యంబులు.

చిం పర్యుత్రో దో తో ద్వ్యర్భవతి మువత్.
హ. గవో కారాంత శబ్దానాం పర్యుత్తాపి వ్యవర్ణకః

బా. ౪౮. ఉకారాంత గో శబ్దంబులకంతరు వుపర్ణకంబగు.

తరువు, ధేనువు, మధువు, గోవు. అంతటననుట స్త్రీలింగ ప్రథమైక వచనలోప బాధనార్థము.

వ్యా. ఉకారాంత శబ్దములకు, గోశబ్దమునకు నప్పిలింగంబులందును ప్రథమైక వచనమున "వు"ప్రత్యయము వచ్చును "తరు" ఉకారాన్తము. కనుక దీనికి "తరు+వు"అని వు చేర్పఁగా "తరువు"అయినది "గో" శబ్ద మోకారాన్తము. దీనికి "వు" చేరఁగా "గోవు" అయినది. "అంతట"ననుట వలన 57వ సూ.చేఁ జెప్పఁబోవు స్త్రీలింగ ప్రథమైకవచన లోపము ఉకారాన్త స్త్రీలింగ శబ్దములకును, గోశబ్దమునకును రాదు.

**హ. విభక్త్యౌ నుగ్వా భిన్నాయాం గోర్నిత్యం బహులంతు వాం.**

బా ల. వువర్ణేతరవిభక్తి పరమగునపుడు ఉకారాంతంబులకు బహుళంబుగా, గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు.

తరువులు-తరులు, ధేనువులు-ధేనులు, గోవులు.

వ్యా. వువర్ణకముకాక తక్కిన విభక్తి ప్రత్యయములు పరమైనపుడు ఉకారాంతములకు బహుళముగాను, గోశబ్దమునకు నిత్యముగాను వువర్ణ మాగమమగును. తరు+లు-చేయఁబోఁగా వుగాగమమువచ్చి "తరు+వు+లు=తరువులు." వుగాగమము వికల్పముకాన తరులు" గోశబ్దమునకు నిత్యముకాన "గోవులు" అనియే కాని "గోలు" అని యుండదు. ఇదిగాక "రాహు, బాహు, కేతు, బిందు" శబ్దముల ప్రథమైకవచన వువర్ణకమునకు లోపము వికల్పముగానగును. రాహు-రాహువు "పర్వముదేకయును రాహు భానునిఁబట్టెన్." భార. శల్య. 2ఆ. "లగ్గలించి నా మొము బాహు వ్రేసించి కదవఁజాలినమల్లురఁగాననెందు." భార విరా. ఆ2. ఇట్లు

ఫువర్ణకలోపము సంస్కృతశబ్దములకేగాక కొన్ని తెనుఁగు శబ్దములకును గన్పట్టుచున్నది. "పుట్టు-పుట్టువు." పట్టు, చుట్టు, తట్టు, రట్టు ఇత్యాదులు.

౨౦. దు జ్మహత్పదానాంవా.

హరి. ఉకారాంతాత్తు బహుళం మహతస్స్యా ద్వ్వర్ణకః.

బా. ౫౦. ఉకారాంతంబగు మహత్తునకు ఫు వర్ణకము బహుళముగా నగు.

విష్ణువు-విష్ణుఁడు, శంభువు-శంభుఁడు, వసువు-వసుఁడు.

వ్యా. ఉకారాంతములైన మహద్వాచకములకు పువర్ణకము వికల్పముగానగును. విష్ణువు. పువర్ణకము రానిపక్షమున 22సూ.చే దుక్ వచ్చి 'విష్ణుఁడు' అగును "వజా భవ్యవిభా విభావసుఁడువసుఁడు" వసు. 'మను వట్వాది శబ్దానాం న దు జ్నిత్య ప్రయుజ్యతే.' అనునధర్వణకారిక ప్రకారము మను, పటు, మధు, కటు, దను ప్రకృతులు మన్వాదులు — వీనికి దుక్, విగాగమము రాఁగూడదు. కాని మధు, పటు శబ్దములకు దుక్ ప్రయోగములందుఁ గానంబడుచున్నది.

'చండస్ఫూర్తి పటుండు గాంచె' భాగ. "ఓ మగువ లాదవిన మామ స్మధు వతవి మేనమామ స్మధువిన్' వైజ. "పువర్ణకో భవిత్యత్ర క్వచి న్నిత్యం క్వచిత్తువా" అనునధర్వణకారిక ప్రకారము పుట్టు—పుట్టువు,అన్ను-అన్నువు-దండు—దండువు-ఇత్యాదులు గ్రాహ్యంబులు.

౨౧. అహ్రాపనూంవినా శబ్దా మవ్య వస్స్యాత్ప్రయోగతః.

సూ. ౩౧. కద్రువ నాగమాత.

కద్రువ-కద్రువను, కద్రువలను.

వ్యా. 48 సూ.చే ఊకారాన్తమైన కద్రూశబ్దమునకు - "కద్రువు" అను రూపము రావలసియుండఁగాఁ బ్రయోగానుసార మది దుష్టమైనందున "నాగమాత యర్థమైనపుడు కద్రువ" అని యుండునని నిపతింపఁబడినది. నిపతించుటయనఁగా సామాన్యశాస్త్రముచే వచ్చు రూపముకన్న వేఱైన రూపమును సాధించుటకై నిష్పన్నమైన రూపమును జెప్పుట. గోరోచనం వంటి రంగు అను నర్థమున కద్రుశబ్దము పుంలింగము. అప్పుడు 'కద్రువు' అనియే రూపముండును.

చిం. డా బవిధాత్రా దేరుః.

హ. రంత శబ్ద్యనతు స్త్రీవద్భావోత్వంచ భవేత్తథా.

సూ. ౩౨. ఋకారాంతంబగు నత్వంబును స్త్రీవద్భావంబునగు.

భ్రాత, జామాత, భర్త, హర్త, గంత, హంత.

వ్యా. ఋకారమంతమందున్న శబ్దములకు అత్వంబును=అకారమును, స్త్రీ వద్భావంబును=స్త్రీలింగ శబ్దముతో సమముగానుండుట (ప్రథమైక వచన లోపము కల్గుట) కల్గును. "భ్రాతృ"శబ్దము సంస్కృతమున ఋకారాన్తము. దీనికి ప్రథమైక వచనమున "అత్వము"రాఁగా "భ్రాత" అగును స్త్రీవద్భావము వచ్చుటవలన డుజ్ లోపమువచ్చి "భ్రాత"అయినది తక్కిన విట్లే

చిం తన్యచవా, తావుభౌ రమేశవమా.

హ. విధాతృ, ధాతృ, సవితృ నేతృ, దాతృ మహాత్సహ.

బా. ४३. విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్త్వార్థకత్వ స్త్రీ వద్భావంబులు విభాషనగు.

విధాత-విధాతృఁడు, ధాత- ధాతృఁడు, దాత—దాతృఁడు, సవిత-సవితృఁడు, నేత—నేతృఁడు

వ్యా. మహద్వాచకములైన విధాతృ మున్నగు శబ్దములకు అత్వ= అకారమును, స్త్రీ వద్భావంబు= ప్రథమైక వచన లోపము వచ్చుటయు నీ రెండును కలిసియే జరుగును. లేదా జరుగకుండును. ఇట్లు కలిపి చెప్పఁబడిన కార్యద్వయమునకు సన్నియోగ శిష్టవిధి యందురు. విధాతృ-అత్వము రాఁగా-విధాత+డు-చేయఁబోఁగా స్త్రీ వద్భావమువలన డుక్ లోపమువచ్చి-'విధాత' అయినది. అత్వస్త్రీ వద్భావములు రానిపక్షమున 22 సూ.చే డుఙ్వచ్చి 'విధాతృఁడు' అగును.

చిం. దీర్ఘాణాం హ్రస్వ స్స్యాత్: ఈదంతా ఇద్వదేవ కృత హ్రస్వాః

హ. హ్రస్వో నామాంత్య దీర్ఘ స్య

బా. ४४. నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు.

రమా-రమ, వనితా-వనిత, విద్యా-విద్య, లక్ష్మీ-లక్ష్మి, సేనానీ-సేనాని, ఇట్లు కృతహ్రస్వములకు హ్రస్వాంతములకుఁ బోలెఁగార్యంబగు. లక్ష్ములు- సేనానులు, సిరులు.

వ్యా. ప్రాతిపదికకున్న దీర్ఘము హ్రస్వమగును. రమా—మాదీర్ఘము హ్రస్వముకాఁగా, 'రమ'యైనది. లక్ష్మీ-లక్ష్మి. హ్రస్వము చేయఁబడిన యాకారాంతము కికారాంతములకువలెనే ప్రథమైకవచనలోపము. బహు

వచనము పరమైనపు డుత్వము వచ్చుట మున్నగు కార్యము౦ జరుగును లక్ష్మి-లక్ష్ములు, వధూశబ్దమునకు వధువు-వధువులు ఇత్యాది.

"కదనంబు సేసి మడిసిరి, నదినుత గురుకర్ణ శల్య నాగపురీశుల్" భార. ఆది. 1 ఆ. ఇచ్చట నీ కారాంతమైన నదీశబ్దము హ్రస్వమైనది. ఇది సిద్ధవమానమే కనుక నా హ్రస్వత్వమును సంస్కృతముననే సాధించుట మంచిది. "ఙ్యాపో స్సంజ్ఞా చ్ఛందసో ర్బహుళం" అను సూత్రముచే బహుళముగా హ్రస్వము వచ్చును. "ఏత్య దూతికృతమార్గదర్శనః'రఘు 19సర్గ. 23 శ్లో. అచ్చట మల్లినాథ వ్యాఖ్యలో 'ఙ్యాపో' రితిహ్రస్వః. కాశికావత్. 'అపి మాషం మషం కుర్యాచ్ఛందో భంగం త్యజే ద్గిరాం' అనియు 'వై దేహి బంధో ర్హృదయ౦ విదద్రే' అనుచోట వై దేహిపదమునకువచ్చిన హ్రస్వమునకు మల్లినాథుఁడే వ్రాసినాఁడు. ఆ రీతిగా 'నదినుత' అన్నచోట నదీశబ్దము హ్రస్వమగుట సుసాధితమే యగును. కాని యథర్వణాచార్యులు 'హ్రస్వో దీర్ఘ సమాసేపి క్వచిత్ జీవః ప్రయోగతః' అనుకారికచే సాధించినాఁడు. కొన్ని శబ్దములు సంస్కృతముననే హ్రస్వ దీర్ఘోభయాంతములుగా నున్నవి. "ధరణిః-ధరణీ, కోణిః-కోణీ, పురంధ్రిః-పురంధ్రీ, యువతిః-యువతీః, రాత్రి-రాత్రీ, రజనిః-రజనీ" ఇత్యాదులు.

చిం. నదేశ్యపదే, నచైక వర్ణేపి
హ. భవే న్నైకాక్షరవ్య నః

బా. ౨౨. ఏకాక్షరంబులకు హ్రస్వంబులేదు.
శ్మ, మా, భా, శ్రీ, స్త్రీ, హ్రీ, ధీ, భీ, భ్రూవు.

వ్యా ఒకే యక్షరమున్న సంస్కృతములకు హ్రస్వముగాదు. "శ్మమా" మున్నగునవి యేకాక్షరంబులే. 64 సూత్రమున కనవాదము.

"సకల క్ష్మాభుజాం దాతా సనాభిజనేత్రా." మను. 'భ్రూవు' భ్రూశబ్దమునకు 48 సూ.చే వువర్ణకమురాఁగా నేర్పడినది.

హ. వృద్ధాదే ర్వా డుకో లోపః

బా. ౫౭. వృద్ధాదుల డుజ్ఞునకు లోపము విభాషనగు.

వృద్ధ-వృద్ధుఁడు, మూర్ఖ-మూర్ఖుఁడు, నీచ-నీచుఁడు, గృహస్థ-గృహస్థుఁడు, వార్వాకు-వార్వాకుఁడు.

వ్యా. వృద్ధ మొదలైన శబ్దములమీఁది డువర్ణకమునకు లోపము వికల్పముగా నగును "వృద్ధ"శబ్దమునకు 21చే నత్వంబునకుత్వమురాఁగా వృద్ధ అగును. లోపము వికల్పముకాన 22చే డుక్ వచ్చినచో 'వృద్ధుఁడు' అగును "మూర్త మూర్ఖ నీచ వృద్ధా పుదంతా వపి సమ్మతాః। డుత్వేనైవ భవంత్యన్యే ప్రయోగ స్తత్ర కారణం" అను నథర్వణకారిక దీనికిమూలము. "నీవు మూర్ఖవు శిశుపాల" భార. సభా. "ఘనకోపము గదిరి నీవు గావున" భార. విరా. 2 ఆ.

చిం. అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమ స్యచ సులోపః

హ. స్త్రీలింగ ప్రథమైకస్య లోపః

బా. ౫౮. స్త్రీ లింగంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు.

రమ, క్షమ, వనిత, ఘనత, విద్య, దేవత, మీననేత్ర.

వ్యా. స్త్రీలింగ శబ్దములయొక్క ప్రథమైక వచనమునకు లోపము కల్గును. "రమ+సు" చేయఁబోఁగా నీ సూత్రముచే డు వర్ణకమునకు లోపము రాఁగా "రమ" యగును.

చిం. లుగ్వా చరిత్రాదే ర్మోః

హ. బహుళం మో ర్వ్యథాదిషు

బా. ఇల. చరిత్రాదుల మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు.

చరిత్ర-చరిత్రము, చరిత-చరితము. అలక, అభిలాష, అక్షత, ఘోష, తరంగ, భ్రమ, విజృంభణ వధ, వేగ, స్ఫురణ, హంస, ఇత్యాదులు చరిత్రాదులు. బహుళముపలన వర్ణ్యాదులకు మలోపంబు నిత్యంబు. వర్ణ్య, వసప ఇత్యాదులు.

వ్యా. చరిత్ర మున్నగు శబ్దముల మువర్ణకమునకు లోపము బహుళముగా నగును. చరిత్ర-దీనికి 3వచే మువర్ణకము రాగా చరిత్ర+ము= చరిత్రము. దీని మువర్ణకమునకు లోపము వికల్పముగాన లోపము వచ్చిన పక్షమున-చరిత్ర. "చరితాదిక శబ్దానాం లోపం తూభయథా భవేత్" అను కారిక ననుసరించి కుశాదులకు లోపము నిత్యమును చరితాదులకు వికల్పము నగును ఈ శబ్దములకు మువర్ణక లోపము మాత్రమే చెప్పినను, ముగాగమ లోపము కూడ వచ్చునని యూహ్యము. చరిత్రలు, చరిత్రలము, బహుళ గ్రహణ బలముచే వర్ణ్యాదులకు మువర్ణక లోపము నిత్యము. వర్ణ్య-వసన. వసన-సంవాళచ్ఛబ్దభవమని సూరియే చెప్పెను. అది కాక పనసచెట్టను నర్థమున సంస్కృత శబ్దము కుశశబ్దభవము కుంద యనునదము వైకృతము కాదు. "కుంతోక్తి" నీరను నర్థమున "కుశము" అగును.

హ. ఏక బహుత్వయోః

పయోగో దేశ నుకయోః తమోదాదిత్య వావినోః

సూ. ౫౯. స్వర్గివాచి దేవసుర శబ్దంబు లేకత్వ బహుత్వంబులం బ్రయోగింపంబడు.

దేవుఁడు, సకలమరులు. స్వర్గవాచియనుటచే భూదేవులు- భూసురుఁ డను ప్రయోగంబు లబాధితంబులయ్యె.

వ్యా. స్వర్గివాచి=స్వర్గములోనున్న వారిని జెప్పునట్టి—దేవ-సుర శబ్దములు క్రమముగా ఏక, బహువచనములలోనే యుండును 'దేవుఁడు' అని యేకవచనమేకాని 'దేవులు' అని బహువచనము లేదు. కొందఱు 'దేవి' శబ్దమునకును బ్రథమా బహువచనమున "దేవులు" అగును కనుక నానార్థ ములు రాకుండుటకై దేవశబ్దమునకు బహువచనము నిషేధింపబడెననిరి. కాని మావులు, అలు, తమ్ములు మున్నగు నెన్నో పదములు బహువచన మాత్రమున నానార్థముల నిచ్చుచుండ నిషేధము దీనికొక్క దానికే యుండె ననుట యప్రమాణము. ప్రయోగాభావమే ముఖ్యకారణము. అట్లే సుర శబ్దమున నేకవచనమున కల్లు (మద్యము) అర్థము వచ్చును కాన బహు వచనము మాత్రమే యున్నది-సురలు, స్వర్గివాచియైన పదమునకే యని చెప్పుటచే భూనివాసులైన బ్రాహ్మణులను చెప్పు "భూదేవుఁడు, భూసు రుఁడు" అను పదములు సాధు ప్రయోగములైనవి.

సం. స్త్రీత్వే బహుత్వే సురాదే రసమాసే
హ. సురో నిత్యం వాసుర, స్త్రీసమ స్సంస్కృతస్సేనతు

సూ. ౬౦. సురశబ్దంబు నిత్యంబుగా, నసుర శబ్దంబు పైకల్పి కముగా స్త్రీ తుల్యంబులగు. సంస్కృత సమాసంబునఁగావు.

సురలు—అసుర—అసురుఁడు. నిఖిలసురలు, మహాసురుఁడు, ఎల్ల సురలు, ఎల్లయసురలు, ఎల్లయసురలు

వ్యా. సుర శబ్దము నిత్యముగా స్త్రీసమమగును దీని కేకవచనమునఁ బ్రయోగములేదని పై సూత్రమునఁ (59) జెప్పఁబడినదికదా. అసుర శబ్దము వికల్పముగా స్త్రీ సమమగును. కాని సమాసమున మాత్రము కాదు సురలు, అసుర, అసురుఁడు. సంస్కృత సమాసముతో-నిఖిలసురులు. స్త్రీ సమమై నచో-నిఖిలసురలు అనియే యగును. కాని యత్వంబున కుత్వమురాదు. తెలుఁగు సమాసమున-ఎల్లసురలు అసుర శబ్దమునకు సంస్కృత సమాస మున—రావణాసురుఁడు: తెనుఁగు సమాసమున-ఎల్ల సురులు.

సూ. దూతాదౌ బహుళం స్త్రీత్వం

బా. ౨౧. దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబగనగు.

దూత-దూతుఁడు, యోధ-యోధుఁడు, కింకర-కింకరుఁడు, బహుళ గ్రహణముచే నమహత్త్వంబునందు నిత్యంబు. సింగంబు దూత జంబు కంబు

వ్యా. దూత మొదలైన శబ్దములకు స్త్రీవద్భావము= స్త్రీలింగ శబ్దము లతో సమముగా నుండుట-ప్రథమైకవచన లోపము బహుళముగాఁగల్గును. దూత-ప్రథమైక వచనం లోపించిన రూపం. లోపించని పక్షమున 21,22 లచే అత్వముత్తువచ్చి "దూతుఁడు"అగును. "నిత్య సత్యవ్రత నిషధేశ నీవునూ, కమరంగ దూతవై యభిమతంబు"భార. 2ఆ. "కోపింపంబడదు జననాథునకు దూ, తునిఁ జంపుట నరకమౌట ధ్రువమని రార్యుల్" భార. శాంతి. బహుళమనుటచే నమహద్వాచకమైనపుడు స్త్రీవద్భావమే కాని పుంలింగమురాదు. "సింగంబు దూతయగు జంబుకంబు"ఇట దూతయన్నది జంబుకమునకు విశేషణమైనది. కాన నమహద్వాచకమైనది. "దూతుఁడు జంబుకంబు" అని మహద్వాచకంగా వాడరాదు. కాని విశేష్యమును

మహద్వాచకంగా వాడినపుడు విశేషణమునుగూడ మహత్తుగా వాడవచ్చును. మేఘుఁడు, దూతుఁడు.

చిం భూవి వోస్తు బాయు త్తత్
హ భువో బా య త్త దిష్యతే

బా. ౭౨. పృథ్వీవాది భూశబ్దంబునకు భువియగు.

భువి, భువులు, భువిని, భువులను

వ్యా భూమియను నర్థంవచ్చు భూశబ్దమునకుఁ బ్రాతిపదిక "భువి" యన్నదగును. ఇకారాంత శబ్దములకువలెనే దీని రూపము లెఱుఁగునది, స్వయంభూ, ఆత్మభూ మున్నగు బ్రభవార్థక భూశబ్దమునకు-"ఆత్మభువు, స్వయంభువు" అనియే యగును "పృథ్వీపరస్తు భూస్స్వాంతో నాత్మభ్వాదిరి హేష్యతే" అథర్వణకారిక.

చిం స్త్రో వావౌ రైనావోః
హ నావేతి నౌపదస్య స్యాద్భూతౌల్యంకేచిదూచిరే

బా. ౭౩. నౌ శబ్దంబునకు నావయగు.

నావ, నావలు, మహానావ. కొందఱు నావియనియు నాదేశంబగు నంద్రు

వ్యా. నౌశబ్దమునకుఁ బ్రాతిపదిక "నావ"యగును. దీని అకారాంతము వకు వలెనే రూపములు. సంస్కృతరూపమును సిద్ధసమానముగాఁ దెనుఁగు చేసినపుడుకూడ "నావ" యనియే యగునని - యుదాహరించుచున్నాఁడు.

"మహానావ" కొందఱు "నావి" అనియు రూపమున్నదనిరి. కాని ప్రయోగములోఁ గానరాదు.

చి. స్త్రీ వర్గః

హ. ఓత్వం వాస్యాచ్చరై గ్లావౌ

బా. ౨౪. రై గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాషనగు.

ఇగ్లౌ సూత్రముచేతం బ్రథమైకవచనలోపంబు. రో—రై, గ్లో-గ్లౌ.

వ్యా. రై, గ్లౌ శబ్దముల ( బ్రాతిపదికలకు నోకారం వికల్పముగా వచ్చును. రో-గ్లో. ఓకారం వికల్పము కానసది రానిపక్షమున "రై,గ్లౌ" అనియే యుండును. "స్యాద్వ్యత్యయ యుగ్మస్య పత్ర వర్ణోద్వితీయకః ఐకారాంత స్వరూపేణ మతే భవతి పూర్వతేః " "రో వెలఁదిరై యిచ్చెను, గ్లౌయుదయించెను బ్రమోదకరుఁడై మింటన్ గ్లో కనుపించెన్"ఇత్యాదులు. వీనికి 54 సూ.చేఁ బ్రథమైక వచన లోపము కల్గును.

హ. ఐకార స్త్రీ నదృగ్వవేత్

బా. ౨౫. ఐకారం బీతుల్యంబు.

రైని, రైకి, కైని, కైకి, పైని, పైకి.

వా. ఐకారాంత శబ్దముల కీకారాంత శబ్దములకువలెనే రూపములుండును. 26వ సూ.చే నీకారాంతముల మీఁదికుఁనువు విభక్తుల యుత్వంబున కిత్వంబగునని చెప్పఁబడినది. "రై+ను" ఇత్వమురాఁగా "రైని" కై = చెయ్యి. కైని=చెయ్యిని. గుప్తార్థ ప్రకాశికలో "పైనన్ అని పెక్కుడు

తప్పుగాఁ బ్రయోగింతురు. "పైనిన్" అనవలయునని యున్నది. కాని "పై+నున్=పైనిన్-ద్వితీయావిభక్తి. సప్తమీవిభక్తి ప్రత్యయమైన—నన్ జేర్పఁగా "పై+నను=పైనన్" అనుట నిరాబాధము.

సూ. భిక్షా దయో భవంత్యత్ర బహుళం క్లీబ తుల్యతాం।
కంధరా నాసికా దంష్ట్రా గ్రీవోల్కా పాదుకా విధా।
భిక్ష్యాదయస్తు భిక్షాద్యా జ్ఞేయాస్తత్ర ప్రయోగతః

బా. ౭౭. కంధరాదులు క్లీబ తుల్యంబులు బహుళంబుగా నగును.

కంధరము-కంధర; విధాశబ్దమునకుఁ గ్లీబ తుల్యత్వంబు నిత్యంబు-విధము, కంధరా, నాసికా, దంష్ట్రా, గ్రీవా, పాదుకో, ల్కా ప్రభృతులు కంధరాదులు.

వ్యా. కంధర మొదలైన శబ్దములు నపుంసక లింగశబ్ద సమములు బహుళముగానగును. కంధరాదులు సంస్కృతమున స్త్రీలింగములు. వానికి నపుంసకలింగత్వాతి దేశము చేయఁబడినది. స్త్రీలింగమైనచో 57చేఁ బ్రథమైకవచన లోపమువచ్చి "కంధర"యగును. నపుంసక లింగత్వమున39చే మువర్ణకము రాఁగా "కంధరము"అగును. విధాశబ్దము నిత్యముగా నపుంసక తుల్యమగును. "విధము" అనియేకాని "విధ" అని రూపముండదు. "విధో విధానే హస్త్యన్నే ప్రకారేవేతనేపిచ" అని విఘంటు ప్రకారం విధ శబ్దం పుంలింగముగాఁ గూడనున్నది "కంధర" నాసిక, దంష్ట్రి, గ్రీవ, పాదుక, ఉల్కా మున్నగు శబ్దములు కంధరాదులు.

అజంత ప్రకరణము సమాప్తం



# హలంత ప్రకరణము

చిం. ప్రథమైకవచన తుల్యం సర్వత్ర హలన్తమగుణవ త్ప్రకృతి.

హ. హలన్తం ప్రథమైకాన్త తుల్యం నామాత్ర కథ్యతే

బా. ౭౭. హలంతంబు ప్రథమైక వచనాంతతుల్యం బింపు నామంబగు.

రుక్, రాట్, మరుత్, వీరుత్, కర్మ, వర్త్మ, శ్వ శబ్దంబు దప్ప నకారాంతంబులెల్లం బ్రథమైక వచన తుల్యంబులె యగునని యెఱుంగునది.

వ్యా. హలంత శబ్దములకుఁ సంస్కృతమునఁ బ్రథమైకవచనమయినది. తెనుఁగున నామమగును. అనఁగా నాపై విభక్తిప్రత్యయములఁ జేరును. "అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికం" అను సూత్రానుసారం ప్రాతిపదికము—నామమనఁగా - ధాతువు, ప్రత్యయము, ప్రత్యయాంతముగాక అర్థం కలిగిన శబ్దము. ఉదా :- రుక్-రాట్ మున్నగునవి శ్వశబ్దంతప్ప, కర్మ, వర్త్మ మొదలైన నకారాంతము లన్నిటికిఁ బ్రథమైకవచనమే నామమగును

చిం. ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్ అగుణవతాం సర్వహలాం సోర్లోపః

హ. ఏషా ముగాగమో ద్విత్వం భవే దంత్య హాఃన్సమం

బా. ౭౮. ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లునకగు.

ఉగాగమాంతంబులకిగ్లౌ సూత్రముచేఁ బ్రథమైకవచన లోపంబగు. రుక్కు, రాట్టు, మరుత్తు, వీరుత్తు ఉగాగమంబు లేమింజేసి యిచట నాంతం బుల కస్త్రీలింగంబులకుం బ్రథమైక వచన లోపంబులేదు. కర్మము, వర్మము, చర్మము, సుధన్వుఁడు, సుత్రాముఁడు.

వ్యా. తుది హల్లునకు ద్విత్వంబును, ఉకారాగమమును వచ్చును. ఉగాగమము కల్గినపుడివి ఉగంతశబ్దములగును కాన 'ఇగ్లౌ రాయుగంతంబుల ప్రథమైక వచనంబునకును లోపంబగు"నను 44 సూ.చేఁ బ్రథమైకవచనం లోపించును. రుక్-ఇది సంస్కృతమునఁ బ్రథమైకవచనము.ఇదే తెనుఁగునఁ బ్రాతిపదికము గును. దీనికి ద్విత్వోత్వములు రాఁగా - రుక్కు ఉకారాంత మగుటచే 48చే 'వు' వచ్చి, 44చే లోపించఁగా "రుక్కు" అనియే యుం డును "రాట్టు, మరుత్తు, వీరుత్తు"లిట్లే "కర్మన్" ఇది నకారాంత శబ్దము. దీనికిఁ బ్రథమైకవచనము 'కర్మ' దీని చివర హల్లులేదు. కనుక ద్విత్వోత్వ ములురావు. అకారాంతమయిన యమహద్వాచకముకాన 39చే మువర్ణకము వచ్చి 'కర్మము' అగును. కాని 'కర్మ' అని యెప్పుడును వాడరాదు. దీనికి 'కర్మువు' అను రూపాంతరం ప్రయోగంలో సున్నది ధర్మము—ధర్మువు' అర్ఘ్యము-అర్ఘువు, వర్గము—వర్గువు-వర్గు ఇత్యాదు లూహ్యంబులు "ఖ వేద్ద ర్మాది శబ్దానాం ముశ్చ వుశ్చాత్ర కుత్రచిత్" అనుకారికచే సమర్థితములు "అవని యరాజకంబగుచున యప్పుడు భూప్రజలందు సర్వధర్మువులుబొలంగు దేవముని ముఖ్యులు వాయుదురోలి వృష్టిలేదవు మఱి యర్ఘువుల్ దరుగువం మప." భార. ఆది 4ఆ. సుధన్వన్ శబ్దము ప్రథమైకవచనము "సుధన్వా" అన్నది. ఇదే తెనుఁగునఁ నామముగాఁగా 54చేఁ దుది దీర్ఘము హ్రస్వమై,

21, 22లచే నుత్వము, దుగ్రాగాఁగా "సుధన్వుఁడు" అగును. అట్లే "సుత్రాముఁడు" శబ్దమును.

చిం. ద్విత్వస్తు దీర్ఘతో బహుళం

హ. దీర్ఘా త్పరస్యతు హలో బహుళం ద్విత్వ మిష్యతే

బా ౬౯. దీర్ఘంబుమీఁది హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.

వాక్కు—వాకు, స్వరాట్టు-స్వరాటు.

వ్యా. హల్లు దీర్ఘముమీఁదిదైనచో ద్విత్వము వికల్పముగానగును ఉత్వము వచ్చును. "వాక్" దీనిలోని కకారమునకు 'వా' లోని దీర్ఘము పూర్వమందున్నందున ద్విత్వమురాఁగా "వాక్కు". వికల్పముకాన ద్విత్వం రాని పక్షమున "వాకు" అనియు నగును 68లో ద్విత్వోత్వములు కలిపి చెప్పఁబడినను, వానిలో ద్విత్వమును సూత్రమే యీ సూత్రము వికల్పించు చున్నందున "ఉత్వము" నిర్బాధముగా వచ్చును.

చిం. గుణవద్గణో ద్వితీయైక వచన తుల్యో భవే ద్వికృతౌ.

హ. ద్వితీయైకాంత సదృశం నామ స్యా న్మతుబాదికం

బా. ౭౦ మతుబాదికంబు ద్వితీయైక వచనాంతతుల్యంబు నామంబగు.

శ్రీమంతమ్, గుణవంతమ్, విద్వాంసమ్, అనడ్వాహమ్, శ్వానమ్, ఉపానహమ్, అప్సరసమ్—ఇత్యాదులు.

వ్యా. మతుప్+ఆదికంబు=మతుప్ప్రత్యయాంతములు మున్నగునవి-ద్వితీయా విభక్త్యేకవచనముతో సమమయినవి నామములగును. శ్రీరస్యాస్తీతి శ్రీమాన్. ఇది మతుబంత శబ్దము దీనికి సంస్కృతమున ద్వితీయైకవచనము—'శ్రీమంతమ్' పై నుదాహరించిన వన్నియు ద్వితీయైకవచనములే.

చిం అన్యేషాంచవాలు గ స్తన్య. గుణవతాం దుమూ ప్రాగ్వత్

హ. తదీయాంత్య మలోపస్స్యాత్

సూ. ౭౧ వానియంతిమ మకారంబునకు లోపంబగు.

శ్రీమంత, గుణవంత, విద్వాంస, అనడ్వాహ ఇత్యాది వీని కజంతములకుం బోలె రూపములు యథాయోగ్యంబుగ నగు. అతఁడు శ్రీమంతుఁడు. ఇతఁడు గుణవంతుఁడు. వాని వంశము శ్రీమంతము వీనివంశము గుణవంతము; విద్వాంసుఁడు - విద్వాంసము. అనడ్వాహము, శ్వాసము, అప్సరస. వక్ష్యమాణలక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదుల ఙ్యంతంబులె యిందు గ్రహింపంబడు—శ్రీమతి — గుణవతి - విదుషి — శుని. మహత్త్వ వాచ్యంబగునపుడు శ్రీమంతురాలు, గుణవంతురాలు, విద్వాంసురాలనియు బ్రయోగింపందగు.

వ్యా. "శ్రీమంతమ్" మున్నగువానిలోఁ దుది మకారము 'మ్' లోపించును. 'శ్రీమంత, గుణవంత' అని ప్రాతిపదికలగును. ఇప్పు డివి అకారాంతములైనవి రామ 'రామ' శబ్దమునకువలెనే 21, 22లచే నుత్వ దుత్వలు వచ్చును. శ్రీమంతుఁడు మహత్త్వవాచకమయినపుడే యుత్వదుత్వలు

వచ్చును. అమహద్వాచకమయినపుడు "శ్రీమంతము" అని 39చే నుపవర్ణకము వచ్చును "అప్సరాః-అప్సరస" అనియేయనుగాని "అప్సరస్సు" కాదు. స్త్రీత్వంబున=స్త్రీఅర్థమైనపుడు, వక్ష్యమాణలక్షణంబుచే = 85చేఁ జెప్పఁబోవురీతిగా: మతుప్+అండు—మతుబాదులు. (జీ+అంత—ఙ్యంత) ఈకారాంతంబులు మాత్రమే యిందు గ్రహింపఁబడును. మతుబంతము స్త్రీని బోధించునపుడు శ్రీమాన్-శ్రీమతీ, గుణవతీ, విదుషీ, ధనీ"అనిఙ్యంతము లైనవానికి 54 హ్రస్వత్వమురాఁగా—శ్రీమతి, గుణవతి, విదుషి, ధని అగును. "శ్రీమంత" శబ్దమును గ్రహించి తెనుఁగున స్త్రీవాచకమయిన 'అలు' పదము చేర్చినచో "శ్రీమంత+అలు=" సంధి 31చే నత్వంబున కుత్వంబును దుగాగమంబునురాఁగా "శ్రీమంతురాలు" అగును

"మతుప్, అకారాంత శబ్దములమీఁదను, మకారాకారము లుపధగా గల్గిన శబ్దములమీఁదను "మతుప్"లోని మకారమునకు ప్రాయికముగ, "వకారమగును" "బుద్ధి, మతి, శ్రీ"మున్నగువానికి మకారమేయుండును. "ధన, ఆచార, విద్యా"ది శబ్దంబు లకారాంతములే కనుక "ధనవంతుఁడు, ఆచారవంతుఁడు, విద్యావంతుఁడు" అనియు, "లక్ష్మీ" శబ్దముమకారోపధక మగుటచేత "లక్ష్మీవంతుఁడు" అనియు "యశస్, తేజస్" మున్నగు శబ్దముల కారోపధకములగుటచే "యశస్వంతుఁడు, తేజస్వంతుఁడు" ననియుఁ బ్రయోగింపఁబడును

## హ లోపో నస్యా న్ముదాది నోః

బా. ౭౨. ముదాదులకుఁ బ్రథమైకవచన లోపంబులేదు.
ముదము, ఉపానహము, స్రజము.

వ్యా 'ముత్' మున్నగు శబ్దములకుఁ బ్రథమైకవచనలోపంబు రాదు. 'ముత్' అన్నది హలంతము, స్త్రీలింగము నవచ్చి, 14చేఁ బ్రథమైకవచన

లోపమువచ్చి "ముత్తు" అను ననిష్టరూపము రావలసియుండఁగా, 70లోని మతుబాది గణములో ముహామలనుఁజేర్చి తద్దోషవారణం చేసెను 70చే "ముదమ్" అని ద్వితీయైకవచనాంతము నామమై, 67చేఁ బ్రథమైకవచన లోపం బ్రాప్తించఁగా దీనిచే నిషేధింపఁబడెను. 71చే "ముదమ్"మకారం లోపించఁగా, అకారాంతమయిన యమహత్తుగాన మువర్ణకము వచ్చి "ముదము" అయినది "ఉపానహము, స్రజము" లిట్లే.

హ. ఋత్విగాద్యా అమంతేన వద్భ్రాన్న్యై ర్విభాషయా।

బా. ౬౩. ఋత్విగాదులు ద్వితీయైక వచనాంత తుల్యంబులు విభాషను.

ఋత్విజుఁడు—ఋత్విక్కు, నీవృతము-నీవృత్తు, ఋత్విగాదికం బాకృతి గణంబు.

వ్యా. ఋత్విగాది శబ్దములకు ద్వితీయైక వచనములతో సమమయినవి నామములగుట వికల్పముగానగును. "ఋత్విక్" దీనికి ద్వితీయైకవచనం "ఋత్విజమ్" 71చే మకారలోపంరాఁగా "ఋత్విజ" అని అకారాన్తమయినది మహద్వాచకముకాన 21, 22చే అత్వంబున కుత్వంబును డుజ్ఞును రాఁగా "ఋత్విజుఁడు"అగును. వికల్పముకాక "ఋత్విక్" 68చే "ఉగాగమ ద్విత్వములు" రాఁగా "ఋత్విక్కు" అగును 'నీవృతమ్' అనువానికి 71చే మకారలోపముకల్గి, అమహద్వాచకం కనుక 39చే మువర్ణకమురాఁగా 'నీవృతము', ఉత్వద్విత్వములురాఁగా 'నీవృత్తు"అగును. ఆకృతిగణమనగాఁ బ్రయోగానుసారము మరికొన్ని పదములఁ జేర్చుటకు వీలైన గణము వణిక్కు-వణిజుఁడు, వేదవిత్తు—వేదవిదుఁడు, సురద్విట్టు-సురద్విషుఁడు. త్వక్కు-త్వచము, తటిత్తు-తటితము, జలముక్కు—జలముచము, మఘలిట్టు

మధులిహము, కకుప్పు-కకుభము, ప్రావృట్టు-ప్రావృషము ఇత్యాదులు. ఆపత్తు-ఆపద, తృట్టు-తృష, సంపత్తు-సంపద, క్షుత్తు-క్షుధ, దిక్కు-దిశ, రుట్టు-రుష, త్విట్టు-తిష-ఇవియును ఋత్విగాదులలోఁ జేర్పఁదగినవే. 68చే నుగాగమ ద్విత్వములువచ్చి 44చేఁ బ్రథమైకవచన లోపముగాఁగా "ఆపత్తు" మొదలైన రూపములును, ద్వితీయైకవచనాంత్వమున్న పక్షమున "ఆపదమ్" 71చే మకారలోపం కలిగి "ఆపద" అగును దీనికిఁ బ్రథమైక వచన మువర్ణకము, 57చే సంస్కృతమున స్త్రీలింగములగుటవలన లోపం వఁగా "ఆపద" యగును ఇట్టులని యాకృతి గణములోఁ జేరఁదగిన పదముల రూపము గ్రహింపనది.

## సూ. క్వచిన్మహత్వే మతుప్త స్యానాదేశమాచిరే.

బా. ౩౪. ఒకానొకచో మహత్వంబునందు మతుప్ప్రకారంబున కానాదేశంబు విభాషనగు.

హనుమానుఁడు—హనుమంతుఁడు, భగవానుఁడు - భగవంతుఁడు-ఇత్యాది.

వ్యా. ఒకానొకచోట మహద్వాచకములోని మతుప్రకారమునకు "ఆన" ఆదేశం వికల్పముగానగును. "హనుమంతుఁడు"ఇదిమతుబంతము. దీనిలోని మతున్ "హను+మత్"లోని తకారమున కానాదేశమురాఁగా 'హను+మ+ఆన=హనుమాన'అగును ఇది అకారాంతముకాన 21,22చే నుత్వదుజ్జులురాఁగా "హనుమానుఁడు" అయినది. ఇది వికల్పము కావున 71, 72చే "హనుమంత" ప్రాతిపదికకాఁగా 21, 22లచే నుత్వదుజ్జులు వచ్చి "హనుమంతుఁడు"అగును. హనుమంతుఁడన్నదానికి హనుమయనియు రూపాంతరమున్నది. "పడగనున్న హనుమ భయవిహ్వలుఁడుగాఁడు"భార. "హనూమాన్మారుతాత్మజః హనుమన్తం వ్యనర్దయత్" అను ప్రయోగానుసారము "హనూమానుఁడు, హనూమంతుఁడు" అనియు రూపములున్నవి.

హ. స్త్రీత్వం స్యా త్కృష్ణవర్త్మాదేః

బా. ౬౫. విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు.

స్త్రీలింగత్వాతిదేశంబుచేత సుత్వదుజ్జులులేవని యెఱుంగునది. విశ్వకర్మ, కృష్ణవర్త్మ, అశ్వత్థామ, యువ, యజ్వ—ఇత్యాదులు.

వ్యా. విశ్వకర్మ మున్నగు శబ్దములు స్త్రీలింగతుల్యంబులగును. స్త్రీలింగత్వ మారోపించుటచే సుత్వదుజ్జులురాక ప్రథమైకవచనలోపము వచ్చును. ఇది విశ్వకర్మన్ శబ్దము. నకారాంతము, మహద్వాచకమును. దీని ప్రథమైకవచనము 'విశ్వకర్మా' అని దీర్ఘాంతము. 67చే నిది ప్రాతిపదికగా గ్రహింపఁబడి, 64చే దీర్ఘమునకు హ్రస్వమై, 57చే స్త్రీత్వము వచ్చుటచే 57చేఁ బ్రథమైకవచన లోపంబురాఁగా "విశ్వకర్మ" అని రూపము నిష్పన్నమగును. "క్వచిన్మనుజ సంజ్ఞాయాందుక్ నాన్తాన్నవిధీయతే" అను నథర్వణకారిక ప్రకారము అశ్వత్థామాదులకుఁ బ్రథమైకవచనలోపము. అశ్వ+స్థామ = అశ్వత్థామ. పృషోదరాదిగణంబులోనిదగుటచే సకారమునకు తకారమువచ్చి "అశ్వత్థామ" అయినది. కొందఱు "అశ్వద్థామ" అని వ్రాయుట పొరపాటు.

హ. బ్రహ్మణో మహత స్తథా

బా. ౬౬. మహద్వాచకమయి పుంలింగంబగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు.

బ్రహ్మ—ఈ శబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు. తత్వతపోవేద యోగవాచకంబగునేని బ్రహ్మము నాఁబడు.

వ్యా. "వేద స్తత్త్వం తపో బ్రహ్మ బ్రహ్మా విప్రః ప్రజాపతిః" అను విషంటు ప్రకారము బ్రహ్మన్ శబ్దము వేదము, తత్త్వము, తపస్సు లను నర్థమున నపుంసకము బ్రాహ్మణుడు, చతుర్ముఖుఁడు యజ్ఞం చేయించు వాఁడు నను నర్థములో మహద్వాచకము, పుంలింగమునగు. కావుఁ బుంలింగమయినపుడు ప్రథమైకవచనము 'బ్రహ్మ' అని యుండఁగా 54చే హ్రస్వముకాఁగా 'బ్రహ్మ' అగును. నపుంసకమయినపుడు ప్రథమైకవచనము 'బ్రహ్మ' అని యుండుటచే 39చే మువర్ణకమువచ్చి 'బ్రహ్మము' అగును. 'పుం బ్రహ్మణో వేధసశ్చ హ్రస్వత్వేనైవ సంస్థితిః' అని యథర్వణకారిక.

చిం. ఆత్మన ఇమనన్తానాం డావా

హ. పుంస స్తథా త్మేమన్నాంత మర్త్య సంజ్ఞాను తద్వహు

బా. ౬౩. ఆత్మేమని జంతంబులకు, నాంతంబులగు మనుజ సంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగానగు.

ఆత్మ-ఆత్మము-ఆత్ముఁడు, మహిమ-మహిమము, అణిమ-అణిమము, గరిమ—గరిమము, లఘిమ-లఘిమము, దేవశర్మ-దేవశర్ముఁడు

వ్యా. ఆత్మన్ శబ్దమునకు, ఇమనిప్ ప్రత్యయాంతములకు, నకారాంతములైన మనుజ సంజ్ఞావాచక శబ్దములకును స్త్రీత్వం బహుళముగా నగును. "ఆత్మా యత్నో ధృతిర్బుద్ధి స్స్వభావో బ్రహ్మవర్ష్మచ" అను విషంటు ప్రకారం ప్రయత్నము, ధైర్యము, బుద్ధి, స్వభావాదులను దెలియఁజేయునపుడు "ఆత్మ, ఆత్మము" అగును. శివుని పరమాత్మనుఁ జెప్పునపుడు "ఆత్ముఁడు" అవియును అగును. స్త్రీత్వము వికల్పముగాఁ జెప్పు

టచే 57చే మువర్ణలోపముగాఁగా "మహిమ" 39చే మువర్ణకముగాఁగా "మహిమము" అగును. "మహిమ, గరిమ, లఘిమ, అణిమ" ప్రభృతులు "ఇమనిచ్" ప్రత్యయాంతములు. 'దేవశర్మ' ఇది నకారాంతమయినమనుజ సంజ్ఞ. దీనికి స్త్రీత్వంగాఁ ప్రథమైకవచనమున 'దేవశర్మా'అన్న దీర్ఘము నకు 54చే హ్రస్వమై, 57చే డుజ్వర్ణలోపం వచ్చి 'దేవశర్మ' అగును. పక్షమున దేవశర్మ ప్రాతిపదికమై అత్వంబున ఉత్వంబును, డుక్ను 21, 22లచే రాఁగా 'దేవశర్ముఁడు' అగును. ఇట్లు కృతవర్మన్ శబ్దమునకును "కృతవర్మ, కృతవర్ముఁడు" అని రెండు రూపములు వచ్చును. "ఉజ్వల ఘనశక్తిపైచి కృతవర్మని బాహులనొంచి ధైర్యనిశ్చలమతి" భార, ద్రోణ. 4 అ.

చిం డుస్స్వా త్సదా రాజ్ఞః

హ. రాజశబ్ద స్స్వార్థపరో మహత్త్వేరాజురూపభాక్

బా. ఽలా. మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజు నాఁబడు.

రాజు-ఖగరాజు, అమహత్త్వంబునందు- రాజము - వృక్షరాజము. ఉపసర్జనత్వంబునందు-హతరాజుఁడు పరశురాముఁడు.

వ్యా. రాజశబ్దము మహద్వాచకమై విశేష్య విఘ్నముకాకుండ రాజశబ్దార్థము ప్రధానమయినపుడు "రాజు" అగును. "ఖగరాజు" దీనిలోఁ గూడ "ఖగములకు రాజ"ని రాజశబ్దార్థము ప్రధానమయినది. తత్పురుష ముత్తరపదార్థ ప్రధానంకదా. కాన డుజ్వర్ణం లోపించి ఉత్వం వచ్చి "రాజు" అయినది. స్వార్థం ప్రధానమయిన నమహత్త్వముఁ జెప్పునప్పుడు "వృక్షరాజము" నట్లు "రాజము" అగును. సంస్కృతమున రాజన్ శబ్దము ప్రథమైకవచనము "రాజా" దీనికి 67చేఁ ప్రథమైక వచనాంతతుల్యము

నామమై, 57చే హ్రస్వమై, 39చే ముపర్ణకము రాఁగా "రాజము" అయినది. "వృషరాజ" మన్నదిహూడ తత్పురుషము గనుక ప్రత్యయాంతమై అకారాంతమయినది. కాన మువర్ణకం వచ్చి "వృషరాజము" అగును. సన్నయ రాజా శబ్దసాధనకు "డు" వచ్చుననెను. "రాజన్+డు" అని యుండఁగా "డు" డిత్తగుటచే టిలోపం వచ్చి "రాజ్+ఉ=రాజు" అగునని చెప్పెను. సూరి "రాజా" శబ్దమును నిపతించెను. ఉపసర్జనత్వంబు వంసన్=అప్రధానమయినపుడు-అనఁగా హతరాజాం దన్నదానికి - చంపఁబడిన రాజులు కలవాఁడని రాజ శబ్దార్థ మప్రధానమయినది. అన్యపదార్థముప్రధానమయినది కద. అందుచే దానిలో "హతరాజు" అన్నది ప్రాతిపదికకాఁగా21,22లచే నుత్వడుజ్జులువచ్చి "హతరాజుఁడు" అయినది. దుజ్వర్ణకాంతమయినపుడు రాజశబ్దము తాలవ్యముగాను "రాజా" అన్నప్పుడు దంత్యముగాను నుచ్చరింపవలెను. ఈ సంగతి "రాజా శబ్దంబు దంతయుక్తంబు గావంబడియెడి" సంజ్ఞా. 10 సూత్రమువద్దసూరి చెప్పెను ఒకేచోట ద్వ్యర్థికావ్యమున రాజ శబ్ది ముదంత్యముగాను, తాలవ్యముగాను ప్రయోగింపంబడినవది "అకట పాండురాజ యశమెన్నదైతి" రాఘవ. 1ఆ. ప్రయోగమునువాహరింతురు. రాజాశబ్దం వైకృతముకాన దంత్యమగుటలో దోషంలేదని కొందఱిమతం. సంస్కృతమునఁ తాలవ్యములైనవి తెనుఁగునదంత్యములుగాఁప్రయోగింపఁబడు పదములెన్నో యున్నవి. పంజరము-పంజరము, లజ్జ-లజ్జ, జాలము-జాలము, మంచము-మంచము ఇత్యాదులు. ప్రయోగానుసార మీ రాజ శబ్దమున కుభయరూపంబులు కానంబడుచున్నవి. తత్సమములనుగూడ దంత్యములుగా నుచ్చరింపుట వాడుకలోనున్నది. కాని యది పొరపాటు.

హ. ఇం దఱి జగతో న్నన్యలోప ఇష్టో విభాషయా

బా. ౭౯. జగదింద్ర జిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు.

జగము-జగత్తు, ఇంద్రజి—ఇంద్రజిత్తు. ఋత్విగాదియగుటఁ జేసి యింద్రజితుండనియు వాడంబడు.

వ్యా. 'జగత్, ఇంద్రజిత్' శబ్దముల తకారము వికల్పముగా లోపించును. జగత్-తకారలోపముగా "జగ"నపుంసకము కాన 39చే మువర్ణకము రాఁగా 'జగము' లోపము కాని పక్షమున 68చే సుగా మద్విత్వములు రాఁగా 'జగత్తు' అగును. ఇంద్రజిత్-తకార లోపముచేసిన "ఇంద్రజి" అనియు, లోపము చేయునపుడు 68చే సుగాగమ ద్విత్వములతో "ఇంద్రజిత్తు" అనియు, ఋత్విగాది గణములోనిది కాన ద్వితీయైకవచనాంత తుల్యము నామమై "ఇంద్రజితమ్" ప్రాతిపదికరాఁగా 72చే నంతిమ మకారము లోపించి "ఇంద్రజిత"మహద్వాచకము కనుక 21, 22చే నుత్వ డుజ్ఞులురాఁగా 'ఇంద్రజితుఁడు" అగును. 'నా కొమరుఁడింద్రజిత్తుఁడు' అచ్చ. రా. యు. కాం. 'ఇంద్రజిత్తుఁడిప్పు డినకులోద్భవునిచే' మొల్ల. యుద్ధ వారలటు గెంచి సౌమిత్రిచే నింద్ర జిత్తుఁడీల్గెననుచుఁ జెప్పుటయును. మొల్ల. యుద్ధ. ౭౮. ఇచ్చట ఇంద్రజిత్తుఁడను ప్రయోగములు సాధుత్వశంకా కళంకితములు ఆంధ్రకౌముదియందు మాత్రము 'ఇంద్రజిత్తుఁ"డన్న రూపము సాధువుగాఁ జెప్ప బడినది.

**చిం. సాన్తా దపయః ప్రకృతేః స్లోపః**

**హ. సాంతానాం పవ్యలోపః**

బా. ౮౦. సాంతంబుల పది సకారంబునకు లోపంబు బహుళంబుగానగు.

ఉరము-ఉరస్సు, వక్షము—వక్షస్సు, అర్చి-అర్చిస్సు, ధనువు-ధనుస్సు, ఆయువు—ఆయుస్సు. బహుళగ్రహణంబునంజేసి పయఃప్రభృతుల సకారంబునకు లోపంబులేదు. పయస్సు, వయస్సు, సరస్సు.

వ్యా. సకారాంత శబ్దముల తుదిసకారము బహుళముగా లోపించును 'ఉరస్' ఇది సకారాంత శబ్దము ఈ సూత్రముచే సకారలోపము రాఁగా 'ఉర' ప్రాతిపదికమైనది. అమహద్వాచక నపుంసకముకాన 39చే మువర్ణకము వచ్చి "ఉరము" అయినది. లోపము రానిపక్షమున 68చే ఉగాగమ ద్విత్వములువచ్చి 'ఉరస్సు' అగును "అర్చిస్"లోని సకారము లోపించఁగా "అర్చి" ఇకారాంతముకాన 44చేఁ బ్రథమైకవచన లోపము కల్గఁగా "అర్చి"అగును. "ధనుస్" సకారలోపమురాఁగా "ధను"ఉకారాంత ప్రాతిపదిక. 48చే వువర్ణకమువచ్చి "ధనువు" పక్షమున "ధనుస్సు" బహుళమనుటచే "వచస్, పయస్, సరస్" ఈ శబ్దములలోని సకారము లోపించదు. ఉగాగమ ద్విత్వము రాఁగా "పయస్సు, వయస్సు, సరస్సు" అగును వీనికి "పయము వయము, సరము" అను రూపములుండవు "ఓజస్సు, అనస్సు, అంహస్సు, అంభస్సు అగస్సు" మున్నగు శబ్దములకు మువర్ణకమురాదు. సరస్సునకు "సరము" అని ఘటికాచల మాహాత్మ్యమున-"పసమీరభరంబు వొల్చు మానససరంబు"అని ప్రయోగింపఁబడినది.

**హ అథద్వితీయైకావేత తుల్యతా,**
**సాంతానాం మహతాం వాప్యాదంత్య లోపోపివా భవేత్,**

బా ౮౧. మహద్వాచకంబులగు సాంతంబులకు తలోపంబేని ద్వితీయైకవచనాంత తుల్యత్వం బేనగు.

అంగిరుఁడు-అంగిరసుఁడు; ఉగ్రశ్రవుఁడు-ఉగ్రశ్రవసుఁడు ప్రచేతుఁడు-ప్రచేతసుఁడు, ఊర్ధ్వరేతుఁడు-ఊర్ధ్వరేతసుఁడు.

వ్యా. మహద్వాచకములైన సకారాంత శబ్దములకుఁ బరుషము లోపించుటకాని, ద్వితీయైకవచనాంతముతో సమమైనచే ప్రాతిపదిక యగుటకాని వికల్పముగానగును. అంగిరస్-ఇదిసకారాంత శబ్దము అంగిరో మహర్షి అర్థముగాన మహద్వాచకము. దీని కంతిమాక్షరము లోపించ "అంగిర"అని యకారాంతశబ్దమయినది 21,22లచే సువ్విధులు చేయఁగా "అంగిరుఁడు" అయినది. 'అంగిరసమ్' ద్వితీయైకవచనము నందలి మకారము లోపించి 21, 22లచే సుక్వదుగ్యాయురాఁగా 'అంగిరసుఁడు' అయినది ఉగ్రశ్రవుఁడు=మహర్షి; ప్రచేతుఁడు=వరుణుఁడు. ఊర్ధ్వరేతుఁడు =ఊర్ధ్వరేతస్కత్వము వ్రతముగాఁగలవాఁడు. 'ఉత్తమాశ్రమ నిష్ఠుఁడూర్ధ్వరేతుఁడైన కణ్వమహాముని' భార. అది 4ఆ 'ముక్తులయి భూరితేజులందఱును నూర్ధ్వరేతసులైనన్' భార. అది. 3ఆ.

సూ. నిత్యం సలోప స్త్రీత్వంచవేధసోఽ థపురోధసః స్యాతాం తే వా।

టీ. లా. వేధ పురోధ పురోధసుఁడు.

వేధశ్శబ్దంబునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దం బునకు వైకల్పికముగా సలోప స్త్రీవద్భావంబులు దీనిచే నిపతింపంబడియె.

వ్యా. 'వేధస్'- ఇది సకారాంతము. దీనికి 80చే సకారలోపము వికల్పముగావచ్చి వేధుఁడు—వేధసుఁడు అను రూపములు రాఁబోవుచుండఁగా దీనిచే సలోపము నిత్యముగాను, స్త్రీవద్భావమును జెప్పెనాఁడు. "వేధస్"

18

సలోపముచేయఁగా 'వేధ' త్రిత్వాదేశముచేఁ బ్రథమైకవచన లోపము రాఁగా "వేధ" యనియైనది. "పురోధస్" దీనికి సకారలోప, స్త్రీవద్భావములు వికల్పములు. కావున రెండును వచ్చినపుడు "పురోధ" అవియు, రాని పక్షమున "పురోధసమ్" అను ద్వితీయైకవచనాంతతుల్యము ప్రాతిపదికమై 71చే మకారలోపముకల్గి 21, 22లచే నుత్వడుత్వములురాఁగా "పురోధసుఁడు" అయినది. ఈ రూపములు నిపాతింపఁబడినవి. నిపాతించుటయనఁగా వ్యాకరణముచే నొక రూపము వచ్చుచుండఁ దద్భిన్నమయిన రూపమును జెప్పుట.

సూ. సకారస్య ద్విత్వం వా మన ఆదిషు

బా. వ్యా. మనఃప్రభృతుల సకారంబునకు ద్విత్వంబు విభాషనగు.

మనసు-మనస్సు, శిరసు-శిరస్సు, సదసు-సదస్సు: వం బయ్యేని— మనసము, శిరము, సదము.

వ్యా. "మనస్" మొదలైన శబ్దముల తుది సకారమునకు ద్విత్వము వికల్పముగానగును. ఉత్వము మాత్రము వచ్చును. మనస్సు-మనసు. 68చే సత్వద్విత్వములువచ్చిన రూపము-మనస్సు. ద్విత్వవికల్పముచే—మనసు. ఇట్లే శిరస్సు, సదస్సు, ఉరస్సు, పక్షస్సు. యశస్సు, తపస్సు, తమస్సు, తేజస్సు మున్నగునవి. 80చేఁ జివరి సకారము లోపించి 39చేమువర్ణకము రాఁగా-మనసము, శిరము, సదము- వంటి రూపములు వచ్చును.

చిం. భూదివోష్ట్ర జాయత్రత్

సూ. జాయత్త ద్యు హృదోరూపం క్వచిచ్చ వయోవదన్

సూ. ౮౪. ద్యుహృచ్ఛబ్దంబులకు దివి, హృది యగు.

దివి-దివులు, హృది-హృదులు.

వ్యా. 'దివ్, హృద్' అను వకార, దకారాన్త శబ్దములకు సంస్కృతమున సప్తమీ విభక్త్యేకవచనమైన 'దివి, హృది' అన్నవే తెనుఁగునఁ బ్రాతిపదికలగునని దీనిచే వివరింపఁబడినది ఏక—దివి, బహువచనము-దివులు.

చిం నియతస్త్రీ ప్రత్యయస్తు సర్వాసాం
హ. స్త్రీలింగా స్స్వస్వ నియత స్త్రీ ప్రత్యయ సమన్వితాః

సూ. ౮౫. స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులంగూడి యిందుఁ బ్రవర్తిల్లు.

| నామము | స్త్రీ ప్రత్యయాంతము | తత్సమము |
|---|---|---|
| కర్తృ | కర్త్రీ | కర్త్రి |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | బుద్ధిశాలినీ | బుద్ధిశాలిని |
| మతిమత్ | మతిమతీ | మతిమతి |
| గుణవత్ | గుణవతీ | గుణవతి |
| విద్వత్ | విదుషీ | విదుషి |
| వనజముఖ | వనజముఖా | వనజముఖ |
| | వనజముఖి | వనజముఖి |
| మీననేత్ర | మీననేత్రా | మీననేత్ర |

అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు ఙీప్రత్యయంబు లేమిం జేసి-మీననేత్రి, పద్మనేత్రి—ఇత్యాదు లసాధువులు.

వ్యా. పురుషవాచక శబ్దము స్త్రీవాచకము కావలసి వచ్చినపుడు సంస్కృతమున నీయీ స్త్రీ ప్రత్యయముచేత కో అవే తెలుగునను వచ్చును. సంస్కృతమున ప్రథమైకవచనమున దీర్ఘములైనవి తెనుగున 54 చే హ్రస్వములగును. కర్త్రీ-కర్త్రి మున్నగునవి. 'స్వాంగాచ్చోపసర్జనా దసంయోగోపధాత్' అను సూత్రముచే సంయుక్తాక్షరము ముందుగాగలవానికి ఙీప్ప్రత్యయమురాదు కాన 'మీననేత్రీ' కాదు. "మీననేత్రా" అని ఆకారాన్తమై తెనుగున ఆకారాన్తమైన "మీననేత్ర" అగును. "నాసిక-ఉదర-ఓష్ఠ-జంఘ దంత, కర్ణ, శృంగ, అంగ, గాత్ర, కంఠ" శబ్దములకు వికల్ప మగుటచే ఈవి యాకారాంతములు, నీకారాంతములునగును "కలకంఠీ, కలకంఠా" దీర్ఘములు హ్రస్వములై కలకంఠి-కలకంఠ" అనిరెండు రూపము లుండును. "నత్రూణామంబు మృగనేత్రి వారుగాత్రి 'షట్ప 4 ఆ.' అని వారు గాత్రితో నమముగా మృగనేత్రి యని యికారాంతముగానే తెలియకవానిరి. ఈ ప్రయోగమున్నంత మాత్రాన నిది ప్రామాణికముగాదు.

చిం. వికృతౌచ స్త్రీలింగాః స్త్రీలింగక సర్వ నామ ధేయాన్యః ఉభయవిధ మమహతీనాం.

హ. క్లీ బానాంతు మహత్యస్య స్త్రీలింగానాం విశేషణే

దా. టీ. మహతీతరంబులగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁ క్లీబత్వంబు విభాషనగు.

పద్మలత మనోహరి-పద్మలత మనోహారిణి, హృద్యంబగు విద్య. హృద్యయగు విద్య. మొదవులలోఁ గపిల వరిష్ఠంబు-వరిష

వ్యా. మహతీవాచకములుకాని స్త్రీలింగంబుల విశేషణములు నపుంసకత ములు వికల్పముగానగును పద్మలత, విద్య, కపిల-ఇవి తిర్యగ్జన వాచక

ములు. సంస్కృతమున నివి స్త్రీలింగములు కనుక వీని విశేషణములు స్త్రీలింగములుగాని, నపుంసకలింగములుగాని కావచ్చును. పద్మలత మనోహరి (నపుంసకము) మనోహారిణి (స్త్రీ) హృద్యము (నపుం) హృద్య (స్త్రీ) వరిష్ఠము (నపుం) వరిష్ఠ (స్త్రీ) ఇత్యాదు లూహ్యంబులు.

**సూ. భవచ్ఛత్రాదయోనాత్ర ప్రయోగ సరణౌమతాః**

బా. ౮౨. భవచ్ఛత్రాదుల కింపుఁ బ్రయోగంబులేదు.

భవదాదులగు హలంత సర్వనామంబులకును, శతృరేఫాంతాదులకును, దెనుఁగు భాషయందు వ్యవహారంబులేదని యర్థము. సమాసంబులం దొంటరం గడిసి యిందుఁ బ్రయుక్తంబులగు. భవద్గుణంబులు త్వదాశ్రయము, మత్పుణ్యము, లసద్రూపము, భవిష్యత్కాలము, ధూర్వహము— ఇత్యాదు లెఱుంగునది.

వ్యా. "భవత్" మొదలైన హలంతశబ్దములును, శతృప్రత్యయాంత శబ్దములును, రేఫాంత శబ్దములును దెనుఁగు భాషలోఁ బ్రయోగింపఁబడవు. కాని సంస్కృతమున సమాసముచేసి, తర్వాతఁ దెనుగులోనికిఁ దత్సమముగాఁ జేసికోవచ్చును. అనఁగా సమాసములోఁగూడ పూర్వపదముగా నున్నప్పుడేకాని పరపదముగా నున్నప్పుడు తెనుఁగులోనికి రాదని భావము. భవత్, మత్ మున్నగు శబ్దములు, 'లసత్ భవిష్యత్' మున్నగు శతృప్రత్యయాంతములు, 'ధూర్, గీర్' మున్నగు రేఫాంత శబ్దములు నిందు వాడఁబడవు. "భవద్గీర్ముఖ శబ్దానా మాద్యయో ర్యుష్మ దస్మదోః భాషాయాం న ప్రయోగస్స్యాదితి సిద్ధాన్త పద్ధతిః" అను నథర్వణకారిక దీనికి మూలము. సమాసాంతమునఁగాని, వ్యస్తముగాఁగాని వాడఁబడవు.

ఇది తత్సమ పరిచ్ఛేదము



# ఆచ్ఛిక పరిచ్ఛేదము

**హ. తత్సమేతర భాషేయ మచ్ఛేతి కవయోవదన్**

**సూ. ౧. సంస్కృత సమేతరంబయిన యీభాష యచ్చ యనంబడు.**
**స్పష్టము.**

వ్యా. అచ్ఛ(ప్ర)=అచ్చ(వి). అచ్చ తెనుఁగు భాషనుగూర్చి తెల్పు పరిచ్ఛేదము. సంస్కృత సమముకాక తక్కిన భాషకు "అచ్చ" భాషయని పేరు. అదే యచ్చ తెనుఁగు.

**చిం. వికృతౌ సర్వేశబ్దాః క్లీబసమాస్త్రీస్సమాశ్చ నాన్యే స్యుః**

**హ. స్త్రీసమాః ప్రాయశః క్లీబసమా శ్శబ్దా స్స్యురాచ్ఛికాః**

**సూ. ౨. ఆచ్ఛిక శబ్దంబు లెల్లం బ్రాయికముగ స్త్రీ సమంబులుం గ్లీబ సమంబులయి యుండు.**

స్త్రీసమాఖ్యాతి దేశంబుచేఁ బ్రథమైకవచన లోపాదికంబును గ్లీబ సమాఖ్యాతిదేశంబుచే మువర్ణకంబునగునని యెఱుంగునది. అన్న, మిన్న. అద్ద, గద్ద, జాణ, గాణ, ఓడ, గోడ, ఇత్యాదులు స్త్రీసమంబులు, బియ్యము, నెయ్యము, అల్లము, మొల్లము, సున్నము, సన్నము, ఇత్యాదులు క్లీబసమంబులు. తఱచుగనుటచే బుంలింగ తుల్యంబులుం

గొంపొక కలవని తాత్పర్యము. కొమరుఁడు, చందురుఁడు, అముఁడు, కంసుఁడు ఇత్యాదులు.

వ్యా. అచ్చ తెనుఁగు పదములన్నియు సాధారణముగా స్త్రీసమములో, నపుంసకసమములో యైయుండును. స్త్రీసమము నని చెప్పుటచే (స్త్రీత్వాతిదేశముచేత) స్త్రీలింగ శబ్దములకువలెఁ బ్రథమైకవచన లోపము కల్గునని యు, నపుంసక తుల్యంబులనుటచే మువర్ణకము చేయునని యుఁ దెలియునది. అన్న మున్నగునవి స్త్రీసమములకుదాహరణములు ప్రథమైకవచన ప్రత్యయమైన 'డుముపుఁ' లోపించినవి. దియ్యము మున్నగునవినపుంసక తుల్యములు. కాన మువర్ణకము వచ్చినది. సూత్రములోఁ 'దఱచుగ' నవిచెప్పుటచేఁ బుంలింగములతో సమమైనవియుఁ గొంపొక=(కొన్ని) శబ్దములున్న వని తెలియుచున్నది. కొమరుఁడు మున్నగునవి 'డు' చేరుటచేఁ బుంలింగ తుల్యములు.

## ౯. ఆద్య ప్రకృతి తుల్యా స్సుర్బల్లిదాద్యాః

బా. ౩. బల్లిదాదులు సంస్కృతి తుల్యంబులు.

మహత్త్వంబున వీని కుత్వదుగాదులు నమహత్వంబున మువర్ణకాదులు స్త్రీత్వంబునం దాలు శబ్దముతోడ సమాసంబునుం గలుగునవి యెఱుంగునది. బల్లిదుఁడు, బల్లిదము, బల్లిదురాలు, బల్లిద, అక్కజ, కావల, పెద్దిద, పెడిద, పసిమింత, మొక్కల ఇత్యాదులు బల్లిదాదులు.

వ్యా. బల్లిద మొదలైన శబ్దములు సంస్కృత శబ్దములతో సమమైనవిగా నుండును. అనఁగా మహద్వాచక శబ్దములకు తత్సమ 21,22 లచే

నుత్వదుజ్జులువచ్చి బల్లిసు(డుపంటి రూపములను అమహద్వాచకమైనపుడు తత్సమ 39చే మువర్ణకము మున్న గనవివచ్చి బల్లిదమువంటిరూపములను స్త్రీవాచకములైనపుడు సంధి. 31చే రుగాగమువచ్చి బల్లిదురాలువంటి రూపములను బొందును. బల్లివాదిగణమును మూలమున( జేర్చినాఁడు

హ. మగాదయః

మహాంతః కించత్రైరాద్యా దుజంతోనోత్వగామినః

బా. ౪. మహత్తులగు మగాదులకుం గయిరాదులకును దుజ్జగు; నుత్వంబుగాదు.

మగఁడు, మనుమఁడు, కయిరఁడు, కత్తెరఁడు, మగ, మనుమ, రాయ, పావ, వ్రే. ఈ. ఈ కాప్రత్యయాంతంబులు - ఇత్యాదులు మగాదులు. కయిర, కత్తెర, జన్ను, నీల-ఇత్యాదులు కయిరాదులు.

వ్యా. మహద్వాచకములైన మగాదులకును, కయిరాది శబ్దములకును దుజ్వర్ణకము మాత్రమే వచ్చునుకాని యుత్వమురాదు. మగఁడు, మనుమఁడు, రాయఁడు, పావఁడు, వ్రేఁడు, రేఁడు, ఈ ప్రత్యయాంతములు-తద్ధిత. 16చే వచ్చు నీ ప్రత్యయము చివరకలవి ఆటమనీఁడు కా ప్రత్యయాంతము-తద్ధిత. 11 సూ.చే వచ్చు కాప్రత్యయమంతమందుఁగలవి.అట కాఁడు ఇత్యాదులు మగాదులు కయిరఁడు, కత్తెరఁడు, జన్నఁడు, నీలఁడు ఇత్యాదులు కయిరాదులు ఈ రెంటికివి ద్వితీయాద్యేకవచనముపరమైనపుడు నిగాగమము బల్లిదాదులకువలె వికల్పముగాక, తత్సమ 24చే నిత్యమని గుర్తించుకోఁదగినది. మగనిన్, రాయనిన్ అని నిత్యముగా నిగాగమము

వచ్చునేకాని వికల్పముకాదు. రాయశబ్దము పూజ్యాయాం బహువచనమును వాడి రాయలు-రాయలతో-అనుట వాడుకలో నున్నది. కాని "రాయుఁడు" అనుట పొరపాటు.

## ౫. పగతాదే ర్బహుషులో రః

బా. ౫. పగతాదుల బహువచన లకారంబు రేఫంబగు.

పగతురు, అల్లురు, నెయ్యురు, బలియురు, మార్తురు.

వ్యా. పగత మున్నగు శబ్దములలోని బహువచన లకారమునకు రేఫము కలుగును. పగత+ఉ. ఉత్వము. 21చే నుత్వముగాగా- పగతులు. దీనిచే లకారము రేఫముగాఁగా "పగతురు" అగును. ఇట్లే అల్లురు, నెయ్యురు, బలియురు, మార్తురు"నను రూపము తెలియఁగునది. మల్లశబ్దము సంస్కృతమైనను దాని బహువచన లకారమునకు రేఫము వికల్పముగాఁ గానఁబడుచున్నది మల్లులు-మల్లురు. 'బలమును విద్యలావుమెయి దర్పముఁ జెప్పి పెనంగ జెట్టి మ, ల్లుర విజయుండ్ మజిన్ గడియకోనన చూడ్కికి వేడ్క చేయుచున్. భా. విరా. 2ఆ. 'పీరాధి మల్లురకున్మట్టియగుంచపీయ బంధువుల్' రామా. 1ఆ.

## ౬. ఢుమంతేషు కేషుచిత్
## తద్వత్త్వా ద్యూర్ణబిందు పూర్వకో దశ్చ దృశ్యతే

బా. ౬. కొన్ని ఢుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణబిందు పూర్వక దకారంబునగు.

గండండ్రు, మిండండ్రు ఇత్యాదులు.

వ్యా. కొన్ని డుమంత శబ్దములయొక్క బహువచన లకారమునకు రేఫమును, దానికిముందు పూర్ణబిందు పూర్వకదకారమును (ంద్) వచ్చును. గండఁడు-గండండ్రు. గండ+లు=గండ+రు = గండ+ంద్+ర్+ఉ= గండండ్రు. ఇట్లే మిండండ్రును. నరసింహవ్యాకరణ కారకుని మతమున 'గండలు, మిండలు' అను రూపములును గలవు.

౫. క్రాప్రత్యయాద్బహుషులో రౌతు లఘ్వ లఘూ తయోః।
లఘోరాదౌ బిందుపూర్వ దకారః కవిసమ్మతః

బా. ౭. క్రాప్రత్యయంబుమీఁది బహువచన లకారంబునకు లఘ్వ లఘు రేఫంబులును, లఘురేఫంబునకు ముందుబిందుపూర్వక దకారంబు నగు.

విలుకాండ్రు-విలుకాఱు. వేఁటకాండ్రు-వేఁటకాఱు. వేడుకకాండ్రు-వేడుకకాఱు.

వ్యా. క్రాప్రత్యయముమీఁది బహువచన లకారమునకలఘురేఫమును లఘురేఫము వచ్చునప్పుడు పూర్వబిందు పూర్వక దకారమును వచ్చును. విలుకా+లు=విలుకాఱు. విలుకా+ంద్+ర్+ఉ=విలుకాండ్రు. "వేడుక కాండ్రకై తిరుగు వేశ్యలనాడిన జాదవన్నువి, ట్లాదఁగఁబాడియౌనె?" ఉ. రా. 4ఆ. "పాఱెఁడు నీరెదఱశివ్వఁగఁ దాఱవెడిదమైన యెండదనుకఁగని ఘనం। బాఱెదునువంత వేడుక, కాఱులు జాలరులునూచి క్రందుకొనంగన్" భార, శాంతి ౩ఆ.

హ. తే ప్రభృతి బహువచనతః ప్రాగ్దుక్

బా. ౮. తే ప్రభృతుల బహువచనమునకు ముందు దుక్కగు.

తేఁడులు—తేండ్లు.

వ్యా. తే మొదలైన శబ్దముల బహువచనమునకుముందు దుక్కార్ణ కము వచ్చును. తే+లు. దుక్ రాఁగా—తే+దుక్+లు-తత్సమ. 19చే బిందు పూర్వత్వము కల్గఁగా—తే+ఁదు+లు. దీర్ఘముమీఁదిదికాన నర్ధాను స్వారము మాత్రమే కలుగును. తేఁడులు. అచ్చిక. 12చే దులోని యుకా రమునకు లోపమురాఁగా తే+ఁడ్లు—15చే నఱనున్న విందునున్నయై- "తేండ్లు" అగును

హ. కూతోస్తు సోరువర్ణ స్స్యాత్

బా. ౯. కూఁతుశబ్దము ప్రథమైక వచనంబునకు రువర్ణంబగు.

కూతుఁరు, కూతులు, కూతురులు — కూతుళ్లు - కూతుని నిత్యాది రూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది.

వ్యా. కూఁతు శబ్దము యొక్క ప్రథమైకవచనమునకు 'రు'వచ్చును కూఁతు+రు = కూఁతురు. బహువచనమున—కూతు+లు = కూతులు. కూఁతురులు, కూఁతుళ్ళు, కూఁతురిని మున్నగు రూపములు దుష్టములు. "కూఁతు" అన్నదే ప్రాతిపదికగాన దాని బహువచనము "కూతులు" అనియే యగునుగాని కూఁతురులు అని రువర్ణఘటితము కానేరదు

హ. చెయువో స్స్యా దలఘు తో బహులన్య విభాషయా

బా. ౧౦ చెయువు బహువచన లకారంబున కలఘు రేఫంబు విభాషనగు.

చెయువుఱు, చెయువులు చెయువుఱను, చెయువులను.

వ్యా. చెయువు శబ్దముయొక్క బహువచన లకారమునకు "ఱ" వికల్పముగానగును. చెయువు+లు=చెయువుఱు, చెయువులు. ఈ శబ్దము లోని యకారముమీఁది యుకారమునకు లోపము ప్రయోగములలో నున్నది. "ఇంపుదహొత్తఁగ నొక్కఁడొ నొకటి నొక్కటిగాంచి యెల్ల చెయ్వుఱన్" భార. ఉద్యో. 2.

చిం. నిత్యం దారాదేశ్చస్యాల్లో ర్లలయో రురౌచ తత్ర స్తః

హ. అల్వాదే ర్బహులోరో బింద్వా దిర్దశ్చ పూర్వ లోర్భవతి.

బా. ౧౧. అల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును మున్నటి లువర్ణంబునకు బిందుపూర్వక దకారంబునగు.

అంద్రు, అంద్రను, ఆలు, చెలియలు, చెల్లెలు, కోడలు, మఱఁదలు ఇవి యాల్వాదులు.

వ్యా అలు మొదలగు శబ్దముల బహువచన లకారమునకు రేఫమును, దాని ముందఱ బదముకోనున్న లువర్ణమునకు పూర్ణబిందు పూర్వకదకార

మును వచ్చును. అలు+లు-రేఫమురాఁగా-అఱ+ఱు, ఇప్పుడు అలులోని ఉవర్ణమునకు "ండ్" రాఁగా-"అండ్+ర్+ఉ=అండ్రు' అగును.

చిం. రోలః దలటా ముదితాం తస్య చవాలుక్
హ. దలయోష్ఠ రయోర్లోపో బహుష్వో ర్బహుళం మతః

బా. ౧౨. బహువచనము పరంబగునపుడు దలటరల యుత్వంబు నకు లోపంబు బహుళంబుగానగు.

గుండ్లు-గుండులు, గిండ్లు-గిండులు, కాళ్లు-కాలులు, మొసళ్ళు-మొసలులు, గొంట్లు-గొంటులు, తుంట్లు-తుంటులు, గోర్లు-గోరులు, సీవిర్లు-సీవిరులు. బహుళ గ్రహణముచే విల్లులు, పిల్లులు, పులు లిత్యాదులందు లోపంబు రేదు. తన్నసుంబులంగోటి పిప్పలి శబ్దంబుల కీకార్యంబు చూపబ్డెడు. కోట్లు-కోటులు, పిప్పళ్లు-పిప్పలులు.

వ్యా. బహువచనము పరమైనపుడు 'ద, ల, ట, ర' అను నక్షరములలోని ఉకారమునకు లోపము బహుళముగానగును. గుండు+లు-డ లోని యుకారలోపమురాఁగా గుండ్లు. వికల్పముకాన 'గుండులు' అని లోపము రాని రూపము. కాలు+లు-ఈ సూత్రముచే-కాలులోని యుకారమునకు లోపమురాఁగా కాల్+లు-14చే ప్రకృతి లకారమున కలఘులకారము రాఁగా 'కాళ్+లు=కాళ్లు' అగును. 13చే- 'కాళులు' అనియు నుండ వచ్చును. ఉకారము లోపించని పక్షమున-కాలులు. గొంటు+లు=గొంట్లు-గొంటులు. గోరు+లు=గోర్లు-గోరులు. ఇవి వరుసగా 'ద, ల, ట, ర' ల కుదాహరణములు. సీవిరులు=వింజామరలు. 'వింజామరములన,వింజామరల నంగ, వీచోపులనఁగ సీవిరులనంగఁ జామరాహ్వయముః.' వేంకటేశ్వరాంధ్రము మానవవర్గు. "సీవిరులన లీచోపులు నావింజామరములను నామములెన్నెడ్' వేశ్యనామార్థకోశము.

బహూకమగుచో-విల్లులు, పిల్లులు మున్నగు వానియందు ఉకార లోపములేదు. తత్సమ శబ్దములలోఁ గోటి, పిప్పలి శబ్దములకునిట్టి యుకార లోపము గనఁబడుచున్నది. కోట్లు—కోటులు. అప్పకవి "యుద్ధపంచకమునఁ దిక్కయజ్వసారె, గాళ్ళటంచు రచించుటఁగాంచి కవులు" అని తిక్కన యుద్ధపంచకమున "కాళ్ళు" అనివాడుటచూచి కవులట్లు వాడిరని చెప్పినాఁడు. అతని మతమున "కాళ్ళు" అను రూపము దుష్టముగాఁ దోచును. కాని "వివిరోయుతిఁ గ కాళ్ళం బెనఁగెఁగ వాయువుఁ బొంగి భీష్ముఁడు ద్రోణున్" భార. ఆది. 5ఆ. "కాళ్ళమొప్పిద మూడుకట్ల నుజ్వలము చేయంగ" భా. విరా 1ఆ.

**హ. అయుక్తావా ముదంతానాం డలరాం బహుళం భవేత్.**

**అః ఘు ర్లో త్రచ బహువచనే పరతః స్థితే.**

బా. ౧౩. బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన డ ల ర ల కలఘులకారంబు బహుళంబుగానగు.

త్రాళ్లు - త్రాడులు, గుమ్మళ్లు — గుమ్మడులు, మొగిళ్లు-మొగిలులు, పిడికిళ్లు-పిడికిలులు, ఊళ్లు—ఊరులు, పందిళ్లు—పందిరులు.

వ్యా. బహువచనము పరమైనచో డు నంయుక్తము కానివియు, ఉకారాంతములునైన 'డ-ల-ర'లకు "ళ" బహుళముగావచ్చును త్రాడు +

ఉ=త్రాడులు, త్రాళులు. గుమ్మడి+లు=తత్సమ 45చే ఇకారమున ఉకారమువచ్చి-గుమ్మడు లు-అలఘులకారమురాఁగా-గుమ్మళులు. ఇట్లే పిడి కిలి, పంచిలి_అన్నవియు జరుగును. త్రాడు-మొగిలు-ఊరు-ఇవి ప్రకృతి సిద్ధముగా నుకారాంత శబ్దములు. కావున వాని కీ సూత్రముచే నలఘు లకారము మాత్రమే కలుగును.

హ. దలో రలఘులో నిత్యం బహుళ్లిష్టా ద్విరుక్తయోః।

బా. ౧౪. బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన దకార, లకారంబుల కలఘులకారంబు నిత్యంబగను.

త్రాళ్లు, గుమ్మళ్లు, మొగిళ్ళు, మొనళ్ళు, విళ్ళు, సిళ్లు.

వ్యా. బహువచన లకారముతోఁ గూడినవై, ద్విత్వముకాని దకార, లకారములకు నలఘులకారము (ళ) నిత్యముగానగును త్రాడు+లు= 12చే దకారముమీది యుకారము లోపించఁగా-త్రాడ్లు. ఈ సూత్రముచే దకారమునకు 'ళ'కారమురాఁగా-త్రాళ్లు అగును. 12చేఁ జెప్పఁబడిన యుకారలోపము బహుళమగుటచే లోపమురాని పక్షమున - త్రాడులు, ళకారము వచ్చినచో-త్రాళులు అని రెండు రూపము లుండును. గుమ్మడి- గుమ్మళ్ళు, మొగిలు_మొగిళ్ళు, మొనలి—మొనళ్ళు, విడి-విళ్లు, సిడి-సిళ్లు.

హ. సంయోగే ఖండ బిందుః పూర్ణం సర్వత్ర కేవల పదే భవేత్.

బా. ౧౫. సమాన పదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లెడ ఖండబిందువునకుం బూర్ణంబగు.

అనఁటులు—అనంట్లు, పనఁటులు-పనంట్లు, గోఁటులు-గోంట్లు, తేఁటులు-తేంట్లు, ఏఁడులు-ఏండ్లు, కాఁడులు-కాండ్లు ఏండ్లు, కాండ్లిత్యాదు లందు డా కులాదేశంబు కొందఱు వక్కాణించిరి తెనుఁగున బిందుపూర్వక స్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు.

వ్యా॥ ఏకపదమున బహువచన లకారముతోఁ బ్రకృతి సిద్ధముగా నున్న హల్లు సంయుక్తమైనచో దానికి పూర్వమందున్న యఱసున్న బిందు సున్న యగును. అనఁటులు-ఇది యేకపదము. టులోని యుకారము 12 సూ చే లోపించఁగా-అనఁట్లు-అయినవి అప్పుడు న తర్వాత నున్న యఱసున్న బిందుసున్నయై అనంట్లు అయినది. ఇట్లే తక్కినవన్నియు. ఏండ్లు, కాండ్లు అను శబ్దములలోని డకారమునకు 13చే ళకారమువచ్చి ఏళ్లు-15చే ఏంళ్ళు అని రూపమగునని కొందఱనుకొనిరి. కాని సంజ్ఞా 16లోఁ జెప్పినట్లు తెనుఁగు పదములలోఁ బరుష సరళములకు ముందే బిందువుండును కాన ళకారము పరుష సరళములలో నేయొక్కటియుఁగాదు కనుక నది ప్రామాణికముగాదు. వ్రేఁడు-లోని డుకారము ప్రథమైకవచన ప్రత్యయమేకాని సహజము కానందున-ఏఁడు-ఏఁడులు-ఏండ్లు వలె వ్రేఁడు-వ్రేఁడులు-వ్రేండ్లు అగునని చెప్పరాదు. దానికి బహువచనమున వ్రే+లు= వ్రేలు (గొల్లలు)అగును. స్త్రీవాచకమైనచో వ్రేత-వ్రేతలు(గోపికలు)అగును.

చిం. నళిలో ర్బిందు యుతో డుర్వా లులయోః
హ. నలలో ర్లే బహుష్వాప విభక్తిక గతవ్యచ।
డువర్ణః పూర్వబిందుస్స్యాదాదౌ బహుళం భవేత్

టీ. ౧౭. ఔపవిభక్తికంబుల డువర్ణ, నలఱవర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగా నగు.

కొడవలి - కొడవందులు - ఉల్లోపంబు-కొడవండ్లు. పక్షంబున నం
దలఘులకారంబు-కొడవళులు-కొడవళ్లు-కొడవళులు. రోకలి ప్రభృతుల
కిట్లు రూపంబు లెఱుంగునది. ఇల్లు-ఇందులు-ఇండ్లు-ఇల్లులు. ఇట్లు కల్లు,
పల్లు, ముల్లు, విల్లు శబ్దంబులకు రూపంబులు తెలియునది. మద్య విమ్మార్థ
కంబులయిన కల్లు, వల్లు శబ్దంబులును, తెల్లు ప్రభృతి శబ్దంబులు నవౌప
విభక్తికంబు లగుటంజేసి వాని కీ కార్యంబులేదు.

వ్యా. ఔపవిభక్తికములనఁగా విభక్తి పరమగునపుడు - ఇంటి టివర్ణ
ములు వచ్చి మార్పుచెందునవి. అట్టి శబ్దముల లివర్ణమునకు, నలఘులకా
రముతోఁ గూడిన-లువర్ణమునకు (ల్లు) బహువచనము పరమైనపుడు పూర్ణ
బిందు పూర్వక డువర్ణము (ందు) బహుళముగా వచ్చును కొడవలి. ఇది
యౌపవిభక్తికమైన లివర్ణము. (కొడవలి+వి=కొడవంటివి.) కొడవలి+
లు-దీనిచే 'లి'ని కొట్టివేసి ందు రాఁగా-కొడవందులు- 12చే నుకారము
లోపించినచో-కొడవండ్లు. ఈ డువర్ణము వచ్చుట బహుళముగాఁ గాన,
రానిపక్షమున-కొడవలి+లు-తత్సమ. 45చే నిత్వమున ఉత్వమువచ్చి కొడ
వలు+లు- 13చే నలఘుకారము రాఁగా - కొడవళులు. 14చే-కొడవళ్లు
అనియు రెండు రూపములువచ్చును. అలఘుల కారముకూడ బహుళము
కనుక నది రానిపక్షమున-కొడవలులు అనియునుండును అనఁగా మొత్తము
కొడవలి+లు=కొడవలులు-కొడవళులు-కొడవళ్లు-కొడవందులు — కొడ
వండ్లు అయిదురకములును, 17చేఁ జెప్పఁబోవు-కొడవండ్లులు అన్నదియు
గలిపి యారు రూపములు గలుగును "రోకలి" ఇట్టిదే. నలువర్ణము=ల్లు
దీనికి-బహువచనము పరమైనపుడు-ందు వచ్చి ఇందులు 12చే డులోని
యుకారము లోపించఁగా-ఇండ్లు. 'ఇళ్లు' అని యలఘు లకారయుక్తమైన

రూపమురాదు. 13లో నసంయుక్త ద ల ర ల కే ళాదేశము చెప్పఁబడి నదని గుర్తించునది. కల్లు-ముల్లు,పల్లు-విల్లు మున్నగువాని విశ్లేరూపములు కల్గను. కల్లు=ఱాయి, మద్యము. పల్లు=పల్లపుప్రదేశము, దంతము. అని రెండర్థములున్నవి. అందు మద్యమను నర్థమున "కల్లు" శబ్దమును, నిన్ను (పల్లము) మనునర్థమున పల్లు శబ్దము సౌపవిభక్తికములుగావు. పైన నాయ ర్థమున వానికిని, తెల్లు మున్నగుశబ్దములకును టొపవిభక్తికములగునంతవ ఈసూత్రమునఁ జెప్పిన యాదేశమురాదు. కల్లు పదమును నేత్రమను నర్థ మునఁ బ్రయోగించిరి 'ఏపేల్పుతలఁపఁగ వినచంద్రులను బండికండ్లుగాఁ గండ్లుగా ఘనతఁజేసి.' ఖల్లా. 1ఆ.

చిం. అపి సంయుక్త సమాప్తౌ భూయో న్తే లః ప్రదృశ్యతే నామ్నాం.

హ. క్వచిన్నామ శ్లిష్ట బహుసమం బహుయుతం ముహుః

బా ౧౩. ఒకానొకచో నామంబు సంశ్లిష్ట బహువచనాంత తుల్యం బయి బహువచనంబు నెనయు.

కొడవండ్లులు-కొడవండ్లులను-కొడవళ్లులు-కొడవళ్లులను. ఇట్లి ప్రయోగదృష్టంబులు గ్రహించునది.

వ్యా. ఒక్కొకచోట బహువచనముతోఁగూడిన నామ వాచకముపై బహువచనము కనబడుచున్నది. కొడవలి+లు=కొడవళ్ళు. ఇది బహువచ నాంతరూపమే. దీని పైని మరల బహువచనముకలిసి – "కొడవళ్ళులు" అగును. ఇట్లు బహువచనాంతముపై బహువచనమున్న రూపములుప్రయోగ

ములో నున్నచో వానినిఁగూడ గ్రహింపవచ్చును. "సుందరినాకోడండ్రుర యందఱ్ఱ్శ్రితవు పీవ.' భార. సభా. 2అ. 'అచ్చెరువుగాదె యెవ్వరి యాండ్రురింకఁ బరిభవంబును బొందక బ్రదుకువారు." భార. విరా. 3అ. 'వివిమతి నాదువల్లభకు వీండ్రుల గ్రమ్మఱవింత చేసిరే" భార. విరా. 3అ' ఒక్కసతికిఁ బతులు పెక్కండ్రు రగుటదిది సతులకోర్కి గాన సతివకృష్ణ' భార. ఆది. 4అ. 'వెలయాండ్రు రనుగొండియల బరివారికా శ్రేణుల కొండొంద చెలులుపట్టి.' హరి. ఉ. అ6. 'చూపరులమాడ్కి కొకవింత పొదగొనర్చె' కళా 7అ. ఇట్లే బహువచనములపైనున్న బహువచనముల గ్రహించునది

చిం. వ్వన్తాన్నామ్నః కు క్కో ర్బహువచనే.
హ, కలను ప్రకృతేర్నః కుక్పు వే న్నిత్యం బహుష్వయం

బా. ౧౮ కలన్వాదుల నువర్ణంబు కుక్కగు; బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు.

కలను-కలఁకు- కలఁకులు. కలను, కెలను, కొఱను, కొలను, గవను, నెఱను' మ్రాను, పరను, వలను, ఇవి కలన్వాదులు.

వ్యా కలను మున్నగు శబ్దములలోని 'ను' వర్ణమునకు కుక్ ఆదేశముగా వచ్చును. ఇది యేకవచనమున వికల్పము. బహువచనమున నిత్యముగానగును. కలను-కుక్ రాఁగా, కుక్ టిత్తుకమక జిత్తుబిందుపూర్వంబగు నను సూత్రముచే బిందువు పూర్వమునరాఁగా-కలఁకు-అగును. రానిపక్షమున-కలను. బహువచనమున-కలఁకులు. సంజ్ఞా. 14చే హ్రస్వముమీఁదిది కాన

బ దబిందుపు పూర్ణబిందుపైన-కలంకులు అనియునగును.తక్కినవానికి నిష్టే యేకవచనమున రెండు రూపములును, బహువచనమున నొక్కరూపమును గ్రహించునది. "క్రాంతురు నమ్రమత్యమ్ముగానలో మునలిమూనుల్ వితర్కిం పఁగాన్' వసు. 1ఆ. అన్నచోట మునలిమూనులనఁగా జీర్ణవృషములనియు తురుష్కులనియు రెండర్థములు. బహువచనమున మాకుల్ అని యుంద వలసియున్నను శ్లేషకై యిట్లు వికల్పింపఁబడినదని వ్యాఖ్యానించిరి. ఇట్లు శ్లేషకై యెన్నోచోటులఁ బదములను విరుద్ధముగావాడిరి. 'విరసుంరై కొఱతం బమంగుకవివృత్యీభృత్సమీవకీతిన్.' మను. 1ఆ. ఇచ్చట కొఱత యని యకారమధ్యముగా నొక యర్థమునను, కొరుత యని యుకారమధ్య ముగా నొక యర్థమునను విభిన్నమైన పదమును వాడినాఁడు. మహాకవులు శ్లేషకై వాడినందున నది గ్రహింపఁదగినదే.

సూ. గుక్రేను గోను వో

బా. ౧౯. అట్లు రేను గోనుశబ్దంబుల నువర్ణంబు గుజ్జగు.

రేను-రేఁగు-రేఁగులు. గోఁగు-గోను-గోఁగులు.

వ్యా. పై సూత్రములో కుక్ వచ్చినట్లే రేను గోను శబ్దముల నువర్ణమున నేకవచనమున వికల్పముగాను, బహువచనముననిత్యముగాను 'గుక్' వచ్చును. ఇదియు బిత్తుగావున బిందుపూర్వమై రేను-రేఁగు-రేఁగులు అగును 'కేషాంచిన్నాంత శబ్దానాం కుప్యాశ్చ గ్గశ్చార్ధ బిందుకః'. అను నథర్వణకారిక దీనికిఁ బ్రోద్బలకము

చిం. కుశ్చ చిన్నులోపశ్చ

సూ. లోపశ్చేన్నాదే ర్మోః ర్వహూవితే.

బా. ౨౦. బహువచనంబు పరంబగునపుడు చేను పేను మీను శబ్దముల నువర్ణంబు లోపించు

చేను-చేలు, పేను-పేలు, మీను-మీలు.

వా. బహువచన లకారము పరమైనపుడు చేను పేను మీను శబ్దముల చివరి యక్షరమైన 'ను' లోపించును. చేను+లు=చేలు. పేలు, మీలు. 'మీనులు' అని యొక్కచో నున్నది. "జలజములన్ మృణాలములఁ జక్రయుగంబుల గండుమీనులన్" కవి కర్ణరసాయనము. ఇది "గండుమీల నున్" అనిన నిర్దుష్టమగును.

సూ. రేయ్యా ద్యంత్యాక్షర స్యాపి లోపో బహుషు పేవ్యసౌ,

బా. ౨౧. బహువచనము పరంబగునపుడు రేయి ప్రభృతుల యక్షరము లోపించు.

రేయి-రేలు, బాయి-బాలు. వేయి-వేలు, వ్రాయి-వ్రాలు ఇత్యాదులు. ఈ లోపంబు సమాసంబులందుం జూపట్టెడు రేరాజు, మగబాపతశము, వేవెలుంగు.

వ్యా. బహువచనము పరమైనపుడు రేయి మొదలైన శబ్దములచివర యక్షరము లోపించును. రేయి+లు=రేలు. ఇట్లే బాలు, వేలు, వ్రాలు ప్రభృతులు. "పీలంపు పేవి సూత్రపు। బాలకమంగవయుఁ బుష్యరాగపు టమ్మన్" చంద్ర. కొందఱు బాయి శబ్దమునకు బహువచనము "రాళ్ళు" వ్రాయుచున్నారు. అది ప్రామాదికము. సూత్రమునఁ జెప్పిన యంతిమాక్షరలోపము సమాసములలోఁగూడ కనబడుచున్నది. రేయి+రాజు=

రేరాటా (ష.త.స.) మగకాయి+పతకము=మగకావతకము (ష త.స.) వేయి+వెలుఁగు=వేవెలుఁగు (బహువ్రీహి).

**హ. బహుష్వావు ప్రకృత్యం త్యాక్షరలోపో విభాషయా.**

బా. ౨౨. బహువచనము పరంబగునపు టావు ప్రకృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషవగు.

అవు అలు-అవులు. కాము-కాలు-కాములు, చుట్టము-చుట్టలు-చుట్ట ములు. మీనము-మీనలు-మీనములు.

వ్యా. బహువచనము పరమగునపుడు 'అవు'మున్నగుశబ్దముల చివరి యక్షరము వికల్పముగా లోపించును. అవు+లు=అలు-అవులు. ఇట్లే కాలు, మీనల్లు, చుట్టలు మున్నగునవి. పై సూత్రమునఁ జెప్పినట్లే అవు ప్రకృతులకును దుది యక్షరము లోపించుట వృత్తియందుఁగూడ నగును. అఁబెయ్య, అఁబోతు, అదూడ ప్రాతాదులలోఁ జేర్చినచో విట్టి, రూప ములు రావచ్చును. "అగ్రుహుల్ కాలుగ నాల్గుకాలు నిఁకఁ గాలు ధర్మంబను వంతకాకకున్" మను.3ఆ "చెలులుంజుట్టలు నిష్టభృత్యులు మహాభిం బ్రాణ ముల్ వాప కుబ్జులలై" భార. ఉద్యో. 2ఆ. "విదుద బాహుయుగంబును వెరదముమము గొమరుమీనలు దీప్తనేత్రములు మెఱయ" కే. 2ఆ.

చిం ఏదన్తతా చ నామ్నో మన్యతరస్యా మియాన్తానాం

హ. ఏత్వం నామాంత వృత్తస్య బహుళం స్యా దివచ్యయ.

ఇయే కేచిదిలోపంతు వదంతి నహి మే మతం

ఏతత్తు ముత్తియపదే దృశ్యతే కవిసమ్మతే॥

వా. ౨౩. ఇయకు మాఱుగా నామాంతంబున నెత్వంబు బహుళముగా నగు.

కన్నియ-కన్నె, జన్నియ-జన్నె, వన్నియ-వన్నె, కొంచియము-కొంచెము, కొండియము—కొండెము బహుళగ్రహణముచే సందియము, కాఱియ మొదలగు శబ్దంబులం దెత్వము లేదు. ఇయ శబ్దంబునం దికార లోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు ముత్తియ శబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి. ముత్తియము—ముత్తెము-ముత్యము.

వ్యా. నామమున 'ఇయ'కు బదులు ఎకారము బహుళముగాఁ గలుగును. కన్నియ—ఇయపోయి ఎకారము వచ్చినచో - కన్నె. జన్నె= ఆఁబోతులతోఁబాటు విడువఁబడిన యావు. బహుళమనుటవలన సందియము, కాఱియ మున్నగు పదములలో లోపము లేదు. "సందెము-కాఱె" అను రూపములు రావు. కొందరు ఇయలోని ఇకారము మాత్రము లోపించునని చెప్పిరి. కాని యది ప్రయోగములందు మృగ్యము=లేదు. కాన ప్రామాణికము కాదు. ఒక్క ముత్తియ శబ్దమునకు మాత్ర మట్లు ఇయలోని యికారమునకు లోపము కానఁబడుచున్నది. ముత్తియము ఎత్వము రాఁగా ముత్తెము ఇయలోని యికారము లోపించఁగా ముత్+య+ము= ముత్యము. కొందరి మతమున మల్లియ మున్నగు శబ్దముల కెత్వము

కలుగును. 'మల్లెయు, లంజెయు, గద్దెయు నొల్లెయున నుప గిదిపంక్తు లొప్పగఁ గృతులన్ మల్లియ, లంజియ,గద్దియ యొల్లియయనినల్కు-నేవి యొప్పంగ్గృతులన్' ఆంధ్రభాషా భూషణము. "మూలమూలల మల్లెలెంతటి మోహ మోహరిణాక్షివాచితి" వసు. "ఓ మల్లియలార! మీ పొదలంపాటున లేఁదుగదమ్మ చెప్పరే?" భాగ. దశమ. "నారికేళానవపుఁడీపుటూరుపొలయ వలిపెమొంటెల్లెతో నురస్థలంగూరు" ఆముక్త. కన్నియ-కన్నె అనునవి యికారలోపంబని భ్రమపడరాదు. కన్యా-కన్యయని తత్సమ రూపంబు.

"పీడియము, వక్కలాకులు, విడెము, తమ్మ లంబు వీడెంబు వీడ్యమనం బరాది" ఆంధ్రనామ సంగ్రహము. మానవ. "వరియాచకము-వర్యాచకము-వరేచకము" అని రూపత్రయ మున్నదని యహోబలపతి చెప్పెను "నన్నుఁబర్యాచక షేల జేసెదు సుహోర్ధముచేఁ గరుణింపవే చెలీ!" ఇట్టివి చూడ సూరి చెప్పినశ్లోక్క ముత్తియ శబ్దమునకేకాక మరికొన్నిఁటికివి "ఇ"కారలోపము కల్గునని స్పష్టము చేయుచున్నది "నామములయందె గాక క్రియలయందును ఎత్వంబు చూపబడెడి"నని యహోబలపతి. ఉ. కదియంబడె-కదెంబడె.

## సర్వనామ ప్రకరణము

వ్యా. "సర్వాదీని సర్వనామాని" అని సర్వశబ్దము మున్నగువానికి 'సర్వనామము' అని సంకేతము. విశేష్యములకు మారుగా వాడఁబడునవి

సూ. వికృతౌ సర్వనామాన్య న్నిన్ని కొన్నెన్ని పెక్కుచ
పల్వాయే (అ,ఈ,ఏ)నినామనతాతద్వ-త్సంఖ్యార్థకాణపి
అన్యాది షట్ప్రమహతి సంఖ్యా ద్వ్యైద్యా బహుత్వగా,
అమహత్యేర వచనాన్యాదయ స్సర్వత స్సమాః॥

౫. ౨౫.-అన్ని ప్రభృతులు సర్వనామంబులు.

అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు, ఆ, ఈ, ఏ, నీ, నా, మన, తా. సంఖ్యావాచకంబులు-అన్ని ప్రభృతులు. వీనికిం బ్రథమాంత రూపంబు లుదాహరించెద. వీనిలో దుమంతంబుల కెల్ల న్వాగమంబు పూర్వోక్తంబు స్మరించునది బహువచన లకారంబునకు రావేశంబును బూర్వాగమంబును బ్రథమా బహువచనంబునకు బోలె నెఱుంగునది విశేషాకారంబులు గలిగెనేవిఁ గొంపొకచో ద్వితీయ వఱకును గొంపొకచోఁ దృతీయయుం బొక్క రూపంబు వరకును రూపభేదంబులు వక్కాణించెద. శేషంబూహించునవి. అన్ని మొదలగు శబ్దంబు లారును ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు- అమహదర్థంబు లేకవచనాంతంబులగు. ఇంను నీ మొదలగు నాలుగు శబ్దంబులు సర్వార్థంబులు మర్కరూపంబు లయి యుండు.

మ-అనునది మహదర్థమనుటకు, అ-అనునది యమహదర్థమనుటకు, ప్ర-మొదలయినవి ప్రథమా విభక్తులకును సంకేతములుగా నిందు గ్రహించునది.

మ. అ.

సర్వతావదర్థకము.

| | | |
|---|---|---|
| ప్ర. | అందఱు<br>అందఱు | ....అన్ని |

ఇయదర్థకము.

ప్ర. ఇందఱు ఇన్ని.

కియద్యావదర్థకము.

ప్ర. ఎందఱు ... ఎన్ని.

కతిపయార్థకము.

ప్ర. కొందరు ....కొన్ని.

బహ్వర్థకము.

| | | |
|---|---|---|
| ప్ర. | పెక్కండ్రు<br>పెక్కురు | పెక్కు- దీనికి బహువచనము౦ గలదు పెక్కులు. |

ఈ శబ్దంబు లౌపవిభక్తికంబు లగుటంజేసి - అన్నిటి - అన్నింటి- ఇన్నిటి-ఇన్నింటి-ఎన్నిటి-ఎన్నింటి-, కొన్నిటి - కొన్నింటి - పెక్కిటి - పెక్కింటి — యను రూపంబులు ద్వితీయా ద్యేకవచనంబులు పరంబు లగునపుడమహత్త్వంబునం దగు నని తెలియునది.

బహ్వర్థకము.

| | | |
|---|---|---|
| ప్ర. | పలువురు<br>పలుగుండ్రు | అమహత్త్వంబున దీనికి వ్యస్తప్రయోగం లేదు. |

మ.

తదర్థకము

| | | |
|---|---|---|
| ప్ర. | వాఁడు.... | వారు<br>వారలు<br>వాండ్రు |
| ద్వి. | వానిని .... | వారిని<br>వారలను<br>వాండ్రను |

అ. | అది — అవి
| అద్ది — అవ్వి
ప్ర. | ఆయది — ఆయవి
| అయ్యది — అయ్యవి

| దాని | —
ద్వి. | అదాని |
| అద్దాని |

౨. ఇదమర్థకము.

| వీరు
ప్ర. వీఁడు — | వీరలు
| వీండ్రు

| వీరిని
ద్వి. వీనిని — | వీరలను
| వీండ్రను.

అ. | ఇది — ఇవి
| ఇద్ది — ఇవ్వి
ప్ర. | ఈయది — ఈయవి
| ఇయ్యది — ఇయ్యవి

| దీని |
ద్వి. | ఈదాని | — వీని
| ఇద్దాని |

౩ యత్కిమర్థకము

ప్ర.
| ఏఁడు — ఏరు.
| ఏవాఁడు | ఏవారు, ఏవారలు, ఏవాండ్రు
| ఎవ్వాఁడు | ఎవ్వారు, ఎవ్వారలు, ఎవ్వాండ్రు
| ఎవ్వఁడు | ఎవ్వరు, ఎవ్వండ్రు
| ఎవఁడు | ఎవరు, ఎవండ్రు
| ఏని ఏరిని

ద్వి.
| ఏవారిని
| ఏవానిని | ఏవారిని, ఏవారలను, ఏవాండ్రను
| ఎవ్వనిని | ఎవ్వారిని, ఎవ్వారలను, ఎవ్వాండ్రను
| ఎవ్వనిని | ఎవ్వనిని, ఎవ్వండ్రను
| ఎవనిని | ఎవరిని, ఎవండ్రను

అ.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్ర. | ఎది .... ఎవి | | ద్వి. | దేనిని .... వేనిని | |
| | ఏది .... ఏవి | | | ఏదానిని .... ఏవానిని | |
| | ఎద్ది .... ఎవ్వి | | | ఎద్దానిని .... ఎవ్వానిని | |
| | ఏయది .... ఏయవి | | | | |
| | ఎయ్యది .... ఎయ్యవి | | | | |

మహతి వాచ్యంబగునే నేకత్వంబున యత్కిమర్థక శబ్దంబు-ఎవ్వరిత-ఎవ్వర్త-ఎవ్వత—ఎవరిత-ఎవర్త—ఎవత-ఎవ్వరితి-ఎవ్వర్తి-ఎవ్వతి, ఎవరితి, ఎవర్తి, ఎవతి, ఎవ్వరితె, ఎవ్వర్తె, ఎవ్వతె, ఎవరితె, ఎవర్తె, ఎవతె, ఎవ్వర్తుక, ఎవ్వతుక, ఎవర్తుక, ఎవతుక అని యిరువది రెండు రూపంబులు వడయు.

తద్వాచులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునంబూఁజ వివక్షించునపుడు అతఁడు-అతఁడు: ఇతఁడు-ఈతఁడు, ఎతఁడు—ఏతఁడు అను రూపంబులు వడయు. మహతీవాచకంబులు ఆమె-అపె-ఆకె, ఈమె, ఈపె, ఈకె, ఏమె, ఏపె, ఏకె అను రూపంబులు వడయు.

| యుష్మదర్థకము | | | | అస్మదర్థకము | | |
|---|---|---|---|---|---|---|
| ప్ర. | నీవు, ఈవు | .... మీరు, మీరలు, ఈరు, ఈరలు | | ప్ర. | నేను, ఏను | .... మేము, వేము, ఏము |
| ద్వి. | నిన్ను ను | మిమ్ము ను | | ద్వి. | నన్ను ను | ....మమ్ము ను |
| తృ. | నీచేతను | ....మీచేతను | | తృ. | నాచేతను | ....మాచేతను |

ఉభయార్థకము

విశ్యబహువచనాంతము.

ప్ర. మనము

తృ. మనచేతను-మనలచేతను

ఆత్మార్థకము

ప్ర. తాను.... | తాము / తారు / తమరు.

ద్వి. తన్నున్....తమ్మును

తృ. తనచేతను ...తమచేతను.

ఇంక సంఖ్యావాచకంబులు వక్కాణించెద.

మ.

ఏకార్థకశబ్దము. ప్ర.

ఒకఁడు .... | ఒకరు / ఒకండ్రు

ఒకాఁడు .... | ఒకారు / ఒకాండ్రు

ఒక్కఁడు ... | ఒక్కరు / ఒక్కండు

ఒక్కాఁడు.... | ఒక్కారు / ఒక్కాండ్రు

ఒకరుఁడు ... | ఒకరులు / ఒకళులు / ఒకళ్లు

ఒకారుఁడు.... | ఒకారులు / ఒకాళులు / ఒకాళ్లు

ఒక్కరుఁడు.... | ఒక్కరులు / ఒక్కళులు / ఒకళ్లు

ఒక్కారుఁడు.... | ఒక్కారులు / ఒక్కాళులు / ఒక్కాళ్లు

ఒకరువుఁడు ఒకరువులు

ఒకారువుఁడు ఒకారువులు

ఒక్కరువుఁడు ఒక్కరువులు

ఒక్కారువుఁడు ఒక్కారువులు

ఒరుఁడు ఒరులు

ఒరువుఁడు ఒరువులు

ఒండు .... ఒండులు, ఒండ్లు

ఒడ్డు .... ఒడ్డులు, ఒడ్లు

ద్వితీయాది విభక్తి రూపంబు లూహించుకొనునది.

అ. ప్రథమైక వచనాంతములు

ఒకటి-ఒకొటి-ఒక్కటి-ఒక్కొటి ఒక్కటి-ఒకఁడు-ఒకొఁడు-ఒక్కఁడు ఒక్కొఁడు - ఒండు. ఈశబ్దంబునకు సంఖ్యా వాచకంబునకు బహువచనంబు లేదు.

దీనికి మహతీ వాచ్యం బగునపు దేకత్వంబున వక్ష్యమాణ రూపంబు లెఱుంగునది.

మహత్యర్థకము

ఒకరిత - ఒకర్త - ఒకర్తు - ఒకర్తుక - ఒకత - ఒకతుక - ఒకొరిత ఒకొర్త - ఒకొర్తు - ఒకొర్తుక — ఒకొత - ఒకొతుక - ఒక్కరిత - ఒక్కర్త - ఒక్కర్తు - ఒక్కర్తుక ఒక్కత - ఒక్కతుక - ఒక్కొరిత - ఒక్కొర్త - ఒక్కొర్తు - ఒక్కొర్తుక—ఒక్కొత - ఒక్కొతుక - ఒకరితి-ఒకర్తి - ఒకతి — ఒకొరితి — ఒకొర్తి — ఒకొతి — ఒకరితి — ఒక్కర్తి - ఒక్కతి - ఒక్కొరితి - ఒక్కొర్తి - ఒక్కొతి - ఒకరితె - ఒకర్తె - ఒకతె - ఒకొరితె - ఒకొర్తె - ఒకొతె - ఒక్కరితె — ఒకర్తె - ఒక్కతె ఒక్కొరితె - ఒక్కొర్తె ఒక్కొతె - ఓర్త - ఓర్తి - ఓర్తు - ఓర్తుక.

ఇంక ద్విప్రభృతి సంఖ్యా వాచకంబులు ప్రథమాంత రూపంబులు వక్కాణించెద.

| మ. | అ. |
|---|---|
| ప్ర. | |
| ఇద్దఱు / ఇరుగురు | ....రెండు |
| మూగురు / ముగ్గురు / ముగురు | ..మూఁడు |
| నలుగురు | .... నాలుగు |
| అయిదుగురు | .... అయిదు |
| ఏఁగురు | .... ఏను |
| ఆఱుగురు | .... ఆఱు |
| ఏడుగురు | .... ఏడు |
| ఎనమండ్రు | ....ఎనిమిది |
| తొమ్మండ్రు | .... తొమ్మిది |

బందొకరు - ఓకట్ల - అనురూపంబులును - ద్వీశబ్దార్థంబునకు ఇనుమడి ఈరాఋ - అనురూపంబులు నర్థవిశేషంబులం జూపబడెడు.

వ్యా. అన్ని ప్రకృతులు = అన్ని మొదలైనవి. న్యాగమంబు= నిగాగమము. స్మరింపనడి=గుర్తుంచుకొఁదగినది తత్సమ 22. సూ చేఁ జెప్పిన నిగాగమము వచ్చును. రాదేశము =రేఫాదేశము. బహువచన లకారమున రేఫమాదేశమగుట.వా+లు=వారు పూర్వాగమము బింము- పూర్వక దకారము మున్నగునవి. వా+లు=వాండ్రు. 'అన్ని, ఇన్ని, ఎన్ని కొన్ని,శబ్దము లౌపవిభక్తికములు కనుక ద్వితీయాది విభక్తులుపరమైనప్పుడు, టింట్యాగములు వచ్చును. అన్నిటి-అన్నింటిమున్నగునవి "నీ—నా—మన-తా" శబ్దములు మహదర్థమున, అమహదర్థమున నొకే రూపము కల్గియుండును. "నీ-నా"యుష్మదస్మచ్ఛబ్దముల ప్రాతిపదికలు. నన్నయ యీ శబ్దముల రూపసాధన పూర్తిగాఁజేసెను. సంకేతములు. గుర్తులు అన్ని శబ్దమునకు మహదర్థమున-అంద-ఆదేశమై రేఫాదేశమనఁగా లకారమాదేశమై 'అందఱు' అనిమైనది. రూపాంతరము-అందఱు సూరి శబ్దలక్షణసంగ్రహమున-"అన్ని లోనగు వానికి బహువచన లోపంబగు 115·మహత్తుల కలఘు లవర్ణకంబును, వివర్ణంబునకు దవర్ణంబునగు. 156 శబ్దపరి. అన్నికి "అంద"కాఁగాఁ అంద+లు=అందరు, ద్వితీయాదులలో— "అంద అన్ - అందఱుచేన్" అగును. "అందఱిన్" అని యికారాంతముగా వాడుట పొరపాటు. "పెద్దవారలధికభీతిన్" విడిగిచవిరి క్షీష్మఁదేఁచి వీర లధికులంౘ దఱ్ఱఁజూచి" భార. "క్షమునకు పం చొరు గీర్వరఁ దొరఁగి రుద్ధతులు రాజసుతుల్." భార. ఆది. ౬అ

పెక్కు శబ్దములకు బహువచనమున రేఫాదేశము, పక్షమున బిందుపూర్వక దకారమునగు. పెక్కు+ల = పెక్కురు, పెక్కండ్రు. దీని కమహదర్థకైకవచనము - పెక్కు. దీనికి బహువచనముకూడ నున్నది - పెక్కులు. పలుశబ్దమునకు మహదర్థమున బహువచనమున లకారమునకు రాదేశము, పూర్వమున "గు"వర్ణమును వచ్చును. పలు+లు=పలు+గు+రు=పలుగురు. పలుగుండ్రు. అమహదర్థమున సమాసమందే కాని వ్యస్తముగా ప్రయోగములేదు. పలుమారు, పలుతెరగులు. అ-తదర్థకము. ఈ-ఇదమర్థకము. ఏ-యత్ కిమర్థకము. మహద్వాచకములగునపుడు వీనికి పుగాగమము వచ్చును. వుట్ టిత్తుకాన నాదియందు వచ్చి వా-వీ-వే అగును. డుమంతముకాన వాఁడు, వీఁడు, వేఁడు. వికల్పముకాన ఆఁడు-ఈఁడు-ఏఁడు. ఏక-వాఁడు బహు వారు వాండ్రు. ద్వితీయాదులలో నిగాగమము- వానిని-వారిని. వానిచే-వారిచే. ఇత్యాది అమహదర్థమున అది-అవి ఇత్యాది ఏఁడు, వేఁడు, ఏవాఁడు, ఎవ్వాఁరె, ఎవ్వఁడు, ఎవఁడు- ఇందు వేఁ డన్నది సూరి మతముకాదఁ దోచును కాని తిమ్మకవి ప్రభృతులు చెప్పిరి. "వీరిలో ముఖ్యులెవ్వారలు వేఁడు రాముఁడు" రామా. 7ఆ. (పా. వీరిలో ముఖ్యులెవ్వారు లేరు రాముఁడు).

యుష్మదస్మచ్ఛబ్దముల రూపనిష్పత్తి నన్నయచేఁ బూర్తిగా సాధింపఁబడినది. దాని నిటఁ జెప్పెద. "దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దౌ తృణజసో ర్నామూ పుహూచ స్తః" నా-నీ శబ్దములకు, నా+ను- "ప్రథమా సామేద వృద్ధిః" అని ప్రథమైకవచనమురాఁగా "నేను" అగును. నీవు బహువచనమున "ఏతయోర్బహుత్వేమః" అని వకారమునకు మకారమురాఁగా- "మేము, మీరు" అగును. "న్వాద్యూర్ధ్వహ్రస్వత్వాదే రమీళపిచ" నన్ను, నిన్ను, మమ్ము, మిమ్ము. "అన్యతరలుక్ప్రయుక్తస్య" అని సంయుక్తాక్షరములో నొకటి లోపించఁగా "నను, నిను, మము, మిము" అగును. "కిర్న

జమః" అని "ఇతాంజనఃకిత్స్" యుష్మచ్ఛబ్దమునకుఁ బ్రాప్తించు "కి" దీనిచే నిషేధింపఁబడినది ఇఁక 'కు' చేరి "నాకు, మీకు" అగును. తక్కిన విభక్తులు నిట్లే యూహించునది.

"హ్రస్వేటాదౌనమవాస్ ద్వయవద్వపన ద్వయే న్యయోరాత్మ" తాను శబ్దము తృతీయాది విభక్తులందు హ్రస్వత్వమునంది రెండు వచనము లందు "న, మ" కలిగియుండును. తక్కిన ప్రథమా ద్వితీయావిభక్తులందు నీ-నా శబ్దములవలె రూపములుండును. తాను-తారు. తమరు,తన్ను,తమ్ము; తను తనచేత, తమచేత ఇత్యాది. "భూయి ఉభయార్థవాచీయఃశబ్దవతి" నిత్యబహువచనః తస్య జసో ముశసోలః " నిత్యబహువచనమై నీ-నా ఉభయార్థకమైన తెనుఁగు శబ్దము "మన" అనునది. దీనికిఁ బ్రథమలో ము-మనము. ద్వితీయలో లు-చేరఁగా "మనలన్"అగును. ప్రాగ్వత్సర్వంధిపాది కేవ్యత్ర తృతీయాదులందు "నీ—నా" శబ్దములకువలెనే రూపము లెఱుంగునది.

"ఒక" శబ్దమున కమహదర్థముక "ఎక్కటి" అనియుఁ గలదు. "కవలు బింకపుఁగింక గలుగు వేడిమియెల్ల నొక్కటియై యెదలెత్తెనవఁగ" లక్ష్మి. 2అ. రెండు మొదలైన సౌపవిభక్తికములగుటచే ద్వితీయాది విభక్తులందు వానికి "టి-ంటి"అనునవి వచ్చును రెండు+ను-రెండు+టి+ను-తత్సమ 26చే ఇకారముమీఁది కునువుల కిత్వమురాఁగా రెండు+టిని. అచ్చిక, 36చే దు కారోవర్ణమున కిత్వము-రెండిటిని, పక్షంబున రెండింటిని ఇత్యాదులు. ఇనుమడి యనుచోట రెండు శబ్దమునకిను ఆదేశమును, మడుగు శబ్దమునకు వృత్తిలో "మడి" ఆదేశముకాఁగా "ఇనుమడి" ద్విగుణము=రెండురెట్లు అని యర్థము. ఇట్లే ముమ్మడి, నలుమడీత్యాదులు.

సూ. సంఖ్యావాచక శబ్దస్య పూరణార్థేఽవగాగమః.

బా. ౨౫. సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమంబగు.

రెండవవాఁడు, రెండవది. మూఁడవవాఁడు, మూఁడవది.

వ్యా. సంఖ్యకున్-సంఖ్యావాచక పదమునకు; పూరణార్థంబునందున్=పూర్తిచేయువాఁడను నర్థమున "అవ" అంతాగమముగా వచ్చును. రెండు+అవ=ఉకారసంధికాఁగా రెండవ(వాఁడు) అగును. ఇట్లే మూఁడవవాఁడు, నాల్గవవాఁడు మున్నగునవి.

సూ. మహత్యా మహతో వా స్యాత్సర్వనామక్రియాబహు.

బా. ౨౬. సర్వనామ క్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుంబోలె మహతికగు.

వారిద్దరు రుక్మిణీ సత్యభామలు. వీరు మువ్వురు శ్రీభూనీళలు

వ్యా. సర్వనామములయొక్కయు, క్రియాపదములయొక్కయు బహువచనము మహతీవాచకమునకుఁ గూడ మహద్వాచకమునకైనట్లే యగును. "వారు ఇద్దరు, వీరు మువ్వురు" ఈపదములు మహద్వాచకములు మహతీవాచకములకు నైకము వాఁడబడినవి. ఏకవచనమున మాత్రము భేదమున్నది. ఆమె రుక్మిణి, వాఁడు కృష్ణుఁడు.

చిం. క్వచిద్గకారో వః

సూ. అసంయుక్తా పదాద్యస్య గస్య వస్స్యాద్విభాషయా.

బా. ౨౭. అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు.

పలుగురు-పలువురు, ఇరుగురు-ఇరువురు, పేగురు-పేవురు, తొగ-తొవ, పగలు-పవలు.

వ్యా. పద+అద్యము=పదము మొదటిది. అపదాద్యము=పదము మొదటలేనిది; అసంయుక్తము=మఱొక హల్లుతో గూడనిది. అట్టి గకారమునకు వకారమాదేశమగును. పలుగురు యిచ్చట గకారము పదాదిని లేదు. సంయుక్తముకాదు. కనుక వకారమువచ్చి "పలుగురు" అయినది. "గొడుగు" దీనిలోఁ జివరి గకారము వకారమగును కాని మొదటిదికాదు గొడువు సిగ్గు-సివ్వుకాదు. తీఁగ తీవ. పగడము పవడము యిత్యాదులు.

చిం. ఔపవిభక్తిక సంజ్ఞా వర్ణాష్టిఙ్ట్యాదయో భవంతిహ,
డుల్యాదేర్నామ్నాం స్యు స్తేహివిభక్తౌ సమాపేచ॥

హ. విభక్తౌతు నిమిత్తేమే స్యురాదేశా గమాత్మకాః
ఇటీతితి వ్యవహ్రుతా వర్ణా ఔపవిభక్తికాః॥

బా. ౨౮. "ఇటితివర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు

విభక్తి నిమిత్తంబులయి యాదేశాగమాత్మకంబులయిన ఇ, టి, తి అనువర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు

వ్యా. విభక్తిని నిమిత్తముగాఁజేసికొని యాగమాదేశములుగా వచ్చునవి చెప్పఁబోవు-ఇ, టి, తి అనువర్ణములకు "ఔపవిభక్తికము" అనిపేరు.

సూ. ఏతేష్వమీ ద్వితీయాద్యేకవచనే ప్రాయో నామను కేషుచిత్

అవదన్నత్ర కచిత్ తమి నౌపవిభక్తికా॥

ఇతి నాస్మన్మతారూఢం లక్ష్య.లక్ష్మ విరోధతః॥

వా. ౨౯. ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడు, నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగనగు.

కాలు-కాలివి-కాలిచే. నాఁగలి-నాఁగటివి-నాఁగటిచే. నేయి-నేతివి-నేతిచే. ద్వితీయైకవచనము పరంబగునపు డౌపవిభక్తికంబులు రావని కొందరు వక్కాణించిరి. అయ్యది లక్ష్యలక్షణ విరుద్ధంబగుటంజేసి యనాదరణీయంబు.

వ్యా. ద్వితీయాది+ఏకవచనంబులు=ద్వితీయ మొదలైన విభక్తుల యేకవచనములు పరములగునపుడు కొన్ని నామవాచకములకు తఱచుగా వచ్చును. కాలు+ను(ద్వి) కాలి+ను=ఇవర్ణము వచ్చినది. తత్సమ 26చే యికారముమీఁదనున్న క్రియావిభక్తుల కిత్వము వచ్చుననుటచే నికారము రాఁగా కాలిని. ఇట్లే సమాసమునఁగూడ కాలు+పండు=కాలిపండు. నాగలి+ను=నాగటిని. నేయి=ను+నేతిని అనునవి "టి, తి"ల కుదాహరణము. ప్రాయికమనుటచే నివివి యనిత్యమని తోచును.

సూ. ఊర్వాదే రిత్వం

వా. ౩౦. ఊరు మొదలగువాని కిత్వంబగు.

ఊరు-ఊరివి, కాలు-కాలివి, మ్రాను-మ్రానివి, నోరు-నోరివి, చోటు, చోటివి.

వ్యా. ఊరు మొదలైన నామములకు యిత్వముకలుగును. ఊరు+ను ఊరిని. మ్రాను+ను=మ్రానిని. "నోరికివచ్చిన యట్టులాడిరే యిద్భంగిన్" భార. కర్ణ. 3అ. "నీరిలోనఁదోఁచు తారక ప్రతిబింబ మొక్కొ-యనఁగ వెలుఁగుచున్నదాని" భార. ఆది. 5అ.

సూ. అథ టి రంత్యా దేశోంతి మాగమః
పర్యాయేణచ కేషాంచి దుభయం బహుళం భవేత్

బా. ౩౧ టివర్ణంబు గొన్నింటి యంత్యాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కంత్యాగమంబును, గొన్నిటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగనగు.

ఆదేశము-త్రాడు, త్రాటిని. కాడు, కాటిని. నోరు, నోటిని. ఏరు, ఏటిని. ఆగమము— అన్ని, అన్నిటిని. ఎనిమిది, ఎనిమిదిటిని. వేయి, వేయిటిని. ఉభయము- ఏమి, ఏటిని ఏమిటిని. పగలు, పగటిని, పగలిటిని. మొదలు, మొదటిని, మొదలిటిని. నూరు, నూటిని, నూఱిటిని.

వ్యా. ఔపవిభక్తికమైన టివర్ణము కొన్నిటికి నాగమముగాను కొన్నింటికి నాదేశముగాను, కొన్నిటికి నాగమాదేశములు రెండుగాను వచ్చును. ఆదేశమున కుదాహరణము త్రాడు, త్రాటిని. డునుకొట్టివేసి టి వచ్చుటచేనిది యాదేశము. ఆగమమునకు అన్ని, అన్నిటిని. ఇక్కడ 'టి' ఆగమమైనది. ఉభయమునకు ఏమి, ఏటిని, ఏమిటిని. మొదటి దాదేశము, రెండవ దాగమమును. నీర శబ్దభవమగు నీరు శబ్దమున కౌపవిభక్తికము వచ్చును. నీరు+ను=నీటిని.

సూ. హ్రస్వాదుపరి టేః పూర్ణబిందుః ప్రాగ్బహుళం భవేత్.

బా. ౩౨. హ్రస్వముమీఁది టి వర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగానగు.

అన్నింటిని ఎనిమిదింటిని, పగంటిని, పగలింటిని, రెండింటిని, మూడింటిని.

వ్యా॥ హ్రస్వముమీఁద వచ్చిన టి వర్ణమునకు ముందు బిందువున్న బహుళముగా వచ్చును. అన్ని+ను=అన్నిటిని-౩౦వ టి యికారముమీఁదిది కావున అన్నింటిని అయినది. ఇట్లే తక్కినవి యూహింపఁదగినవి. నన్నయ 'టి, ంటి' వర్ణములను ప్రత్యేకముగా నౌపవిభక్తికములనిచెప్పెను.

**సూ. పదాద్య హ్రస్వాదుపరి టేః ప్రాక్బిందుత్వం చ ఇష్యతే.**

బా. ౩౩. పదాద్యంబగు హ్రస్వంబుమీఁది టి వర్ణంబునకు ముందు పూర్ణబిందువగు.

కన్ను-కంటిని, మిన్ను-మింటిని, ఇల్లు-ఇంటిని, పల్లు-పంటిని.

వ్యా॥ ఆదేశాత్మకముగావచ్చు టి వర్ణము పదము మొదటియక్షరము పైననే యగుచోఁ బూర్ణబిందువు పూర్వాగమంబగును. అనఁగా "ంటి" వచ్చునని భావము కన్ను+ను=న్నుకు "టి"రాఁగా "కటిని" టికి ముందు పూర్ణబిందువురాఁగా "కంటిని" అయినది. ఇట్లే మింటిని, యింటిని,పంటిని అను రూపములు లూహ్యములు.

**సూ. అంతాగమస్త్రి రశ్వాదే రేఫ ఏకోపి లోపభాక్**

బా. ౩౪. అశ్రు మొదలగు శబ్దముల కంతాగమంబు తివర్ణంబును, రేఫంబున కొక్కటి లోపంబునగు.

అఱ్ఱు—అఱితిని, అఱ్ఱు, కఱ్ఱు, కొఱ్ఱు, గొఱ్ఱు, మిఱ్ఱు, వఱ్ఱు యివి యఱ్ఱు మొదలయినవి.

వ్యా. అఱ్ఱు మొదలైన శబ్దములకు 'తి' అను నక్షరము చివర నాగమముగా వచ్చుటయు, శకట రేఫములలో నొకదానికి లోపము కల్గుటయు జరుగును. అఱ్ఱు+ను=అఱ్ఱు+తి+ను కాఁగా, యికారంబుమీఁదికునుపు క్రియావిభక్తులకిత్వము వచ్చునను సూత్రముచే ను-నిగాఁ మాఱఁగా "అఱు+తి+ని" అయ్యెను. 36వ అఱులోని యుత్వమున కిత్వముకల్గి "అఱితిని" యైనది, యిట్లే తక్కినవి.

సూ. విభక్తౌ పరతో గోయి ప్రభృతే రంతిమోఽపి తిః

బా. ౩౫. విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుది యక్షరంబు తివర్ణంబగు.

గోయి-గోతులు, గోతిని, గోతులను. గోయి, చేయి, దాయి, నూయి, నేయి, వాయి, రోయి యిత్యాదులు.

వ్యా. ప్రథమాది విభక్తి పరమైనపుడు గోయి మున్నగు శబ్దముల చివరి యక్షరమునకు "తి" వర్ణాదేశమగును. గోయి+లు=తివర్ణాదేశము రాఁగా "గోతి+లు" తర్వాత 45చే తిలోని యిత్వముత్వము రాఁగా "గోతులు" అగును. ప్రథమైకవచనమున గోయి ప్రభృతులు స్త్రీ సమములగుటచేఁ బ్రథమైక వచనము లోపించుటచే నీ యాదేశము రాదు. తక్కిన యూప విభక్తికములు ద్వితీయాది విభక్తులు పరమగునపుడు రాఁగా నివి ప్రథమలోనే వచ్చుట విశేషము. నన్నయ ద్వితీయాది యనక "విభక్తౌ" అని సామాన్యముగాఁ జెప్పెను.

సూ. టితో ర్వా రిత్వముతః.

బా. ౩౬. టి తివర్ణంబులు పరంబులగునపుడుత్వంబున కిత్వంబగు

గోరను గితెను ఊరనున్నాడు గొడ్డటనటిరెను ఇంటలేదు వఱితగలిసె కఱితదూసె పక్షంబునందు - గోరిచేత, నూరియందిత్యాదులు

వ్యా॥ ఔపవిభక్తికంబుల తృతీయా విభక్తికి సప్తమీ విభక్తికిని అకారము బహుళముగా వచ్చును గోరు + చేతను = చేతకు అకారమాదేశంబా గాగోరను-ఊరు+అందును=అందునకకారాదేశముకా గా- ఊరు+అను = ఊరను" గొడ్డలి+చేతను=గొడ్డటను — చేతకు అకారము రాగా గొడ్డలి+అను 29చే లికి టిరా గా గొడ్డటి+అను సంధి 1 చేనపవాది స్వరమునకు సంధికా గా-గొడ్డటను వఱు + చేతను = అకారాదేశము-వఱు+అను-34 చే తివర్ణాగమము రేఫద్వయమునొకవానికి లోపము రాఁగా — "వఱితను"అైనది "ఈ యకారాదేశము చేతను" అను దానిలో "చేత" కే కాక "ను" వర్ణమునకు మాత్రమేల యాదేశముకాదు" అని శంకింపరాదు ఈ 'ను' వర్ణము తత్సమ 8చే తృతీయాది విభక్తుల కాగమముగావచ్చినది కాన అదిగాక మిగిలిన విభక్తి ప్రత్యయమునకే అకారాదేశము జరుగును ఈయాదేశము బహుళముకాన పక్షమున - గోరిచేతను, గోరియందును, వఱితిచేతను, మొదలైన రూపములు కలుగును. నన్నయ కొన్ని యౌపవిభక్తిక నామముల కకారాదేశముచెప్పి కొన్నిటికు న్లోపము విధించినాడు కేషాంచి దుదంతానాం నేతివిభక్తావునోలుక్స్యాత్" 'ఊరు+నన్=ఊ+ర్+ఉ+న్+అన్" యిందు "ఉన్" లోపించ గా "ఊరన్" అగును. ఇట్లే క్రిందన్. మీఁదన్ మున్నగునవి

ఇది యాచ్ఛిక పరిచ్ఛేదము





బాలవ్యాకరణము

# కారక పరిచ్ఛేదము

సూ. 1 ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమయగు

ప్రాతిపదికార్థమునందు— రాముడు, రావణుడు

నియతోపస్థితికము ప్రాతిపదికార్థము

సంబోధనంబునందు- ఓ రాముఁడ, ఓ రావణుఁడ

ఉక్తార్థమందు- రాముడు రావణుని సంహరించెను

ఈ వాక్యమునందు ఆఖ్యాతము కర్తనుజెప్పునది కావునఁ దద్వాచకమగు రామ శబ్దమునకుఁ బ్రథమయయ్యె

రామునిచే రావణుడు సంహరింప బడియె

ఈ వాక్యము నందాఖ్యాతము కర్మమును జెప్పినది గావున దద్వాచకంబగు రావణ శబ్దంబునకుఁ బ్రథమయయ్యెనని యెఱుంగునది

గు క్రియాన్వయిత్వము కారకత్వము శబ్దముల క్రియతో అన్వయించునపుడే యే అర్థములలో ఏ విభక్తులు వచ్చునో తెల్పునదే కారక పరిచ్ఛేదము ఇంగ్లీషులో Appropr ate Prepos t ons అని ఉన్నవి కదా తెలుగు, సంస్కృతములలోను అట్లే ఒక్కొక్క అర్థమునకు పలానా విభక్తియే రావలెనను నియమమున్నది ఆ నియమమే యిందు చెప్పబడును

గు. "చేత" అను ప్రత్యయము హేతువునకు, కరణమునకు, గ్రహ్యాదులతో సంబంధము కలిగినపుడును పంచమీవిభక్తి ప్రత్యయమునకు వికల్పముగావచ్చును. హేతు వనగా క్రియా ఫలమును సాధించుటకు యోగ్యమైన పదార్థము. కరణమనగా-క్రియాసిద్ధిలో ఎక్కువగా ఉపకరించునది. గ్రహిమున్నగు వానిఁ గ్రహించుట, కొనుట, ఎఱుఁగుట, వినుట, సంబంధము కల్గినవచ్చును. ఇక్కడ బహుళమను పదమునకు వికల్పమనియే గ్రహింపదగినది, హేతువునకు-"ధనము చేతసౌఖ్యము కలుగును." ఈ వాక్యమున సౌఖ్యము కలుగుట క్రియాఫలము. తత్సాధనయోగ్య వస్తువు_ధనము. కాన తద్వాచక పదమునకు "చేత" ప్రత్యయము వచ్చినది. ఇదికాని పక్షమున, ధనమువలన, అని పంచమి వచ్చును. అట్లే "విద్య చేతయశము కలుగు"నను వాక్యమున కీర్తి కల్గుటకు సాధన యోగ్యవస్తువు విద్య-కాన "చేత" ప్రత్యయమువచ్చినది. పక్షమున—విద్య వలన- అని పంచమివచ్చును.

కరణమునకు, "ఖడ్గంబుచేతఖండించె" నను వాక్యమునఖండించుట యను క్రియాసిద్ధికి మిక్కిలి ఉపకారకము ఖడ్గము. కాన తద్వాచక పదోత్తరమున "చేత" ప్రత్యయము చేరినది. పక్షమున, కారక, 8వ సూత్రముచే, తోడవర్థకమువచ్చి "ఖడ్గముతో ఖండించె" అగును.

గ్రహ్యాదియోగమునకు- "జనానందుఁడు రాజుల చేతఁగప్పంబుఁ గొనియె"నను వాక్యమున "రాజులు" అను పదమునకు కారక. 9వ సూత్రముచే వలన వచ్చుచుండగా వికల్పమున ఈ సూత్రముచే చేత, ప్రత్యయము వచ్చినది.

అట్లే "మైత్రుండు చైత్రునిచేత ఋణంబుగొనియె" ఈ యర్థంబునీ చేత నెఱింగితి: ఈ వృత్తాంతంబువాని చేత వింటి నను వాక్యములందు— కొను, ఎఱుఁగు, విను, వానితో సంబంధమున్నందున చైత్రుడు, నీవు, వాడు, అను పదములకు 9వ సూత్రముచే వచ్చు "వలన" అను పంచమీ విభక్తి ప్రత్యయమునకు వికల్పముగా "చేత" ప్రత్యయము చేరినది.

**సూ. ౫. కరణసహార్థ తుల్యార్థాయోగంబులం దృతీయకుం దోఁడ వర్ణకంబగు.**

కరణంబునకు- కోలతోఁడఁగూలనేసె. సహార్థంబునకు- రాజు సేనతోఁడవచ్చె, సేనాసహాయుండై వచ్చెనని యర్థము. తుల్యార్థయోగంబునకు- చైత్రునితోఁడ మైత్రుండు తుల్యుండు. తృతీయకిసుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థ యోగంబున షష్ఠియగును.

గు. కరణార్థమునందు, సహార్థము=కూడ అను అర్థమున, తుల్యార్థము- సమమను అర్థమున తృతీయా విభక్తి ప్రత్యయములలో-'తోడ' వచ్చును. కరణార్థమున-కోలతోఁడఁగూలనేసె-అనువాక్యమునకు లనేయుట అనుక్రియాసిద్ధికి ప్రకృష్టోపకారకము కోల=బాణము. కాన దానికి తోడవచ్చినది.

సహార్థమున- రాజు సేనలతోఁడవచ్చె-అను వాక్యమున సహ=కూడ అనునర్థమున సేనలతోఁ అనితోడ ప్రత్యయమువచ్చినది.

తుల్యార్థయోగమున సమమను అర్థమున చైత్రునితోడమైత్రుండు తుల్యుండు' అనువాక్యమునచైత్రపదమునకు తోడచేరినది. పక్షమున- చైత్రునకు మైత్రుండు తుల్యుండుఅని షష్ఠివచ్చును.

**సూ. ౬. వచ్యర్థాముఖ్యకర్మంబునకు 'దోఁడ,కు' వర్ణకంబులు ప్రాయికంబుగానగు**

మైత్రుండుచైత్రునితోఁడనిల్లనియె, మైత్రుండు చైత్రునకిల్లనియె.

ప్రాయికంబనుటచేనొ కానొకచో ద్వితీయయునగు.

గు. వచ్యర్థమునకు—చెప్పు, పలుకు, అను-మొన్నగువానికి, అముఖ్యకర్మమునకు తఱచుగ, 'తోడ,కు'-అను ప్రత్యయములు వచ్చును. చైత్రుండు మైత్రునితోడనిల్లనియె-అను వాక్యమున చైత్రుడు—కర్త, మైత్రుడు-అముఖ్య-కర్మ ఇల్లు—ముఖ్యకర్మ అను-ధాతువు. ఇందు అముఖ్య

కొన్నిచోట్ల త్యాగోద్దేశ్యములేకున్నను, కేవల ఉద్దేశ్యము మాత్రమునకే చతుర్థివచ్చును పురుషార్థముకొఱకు యత్నింపవలెను. దీనిలో త్యాగము లేదు. కాని పురుషార్థమునుద్దేశించి ప్రయత్నమున్నది కనుక ఉద్దేశ్యమాత్రమైన పురుషార్థపదమునకు చతుర్థీ-కొఱకు వచ్చినది. ఇట్లు తఱచుగా చతుర్థికి బదులు షష్ఠియే ప్రయోగింపబడుచున్నది-రామునకు జనకుడుకన్య నిచ్చెను-అని. పురుషార్థమునకు యత్నింపవలెను అని.

**సూ-॥. అపాయభయజుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దానవగు. దానికి వలన వర్ణకంబగు.**

అపాయము=విశ్లేషము, భయము=వెఱపు, జుగుప్స=ఏవ, పరాజయము=ఓడయ్యుట, ప్రమాదము=పరాకు: గ్రహణము=కొనుట, ఎరుంగుట, వినుట ఇత్యాది, భవనము=పుట్టుట, త్రాణము=కాచుట, విరామము= విరమించుట అంతర్ధి= దాగుట, వారణము=వారించుట:

అపాయంబునకు - మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె.
భయంబునకు - చోరునివలన భయపడియె.
జుగుప్సకు - పాపంబువలన నేవగించె
పరాజయమునకు - అధ్యయనమువలన నవసె.
ప్రమాదంబునకు - పాఠమువలనం బరాకు పడియె.
గ్రహణంబునకు - మైత్రునివలన ధనంబు గొనియె.
భవనంబునకు - మనువలన బ్రజలుపుట్టిరి.
త్రాణంబునకు - చోరునివలనం గాచె.
విరామంబునకు - భోగంబువలన విరమించె.
అంతర్ధికి - కృష్ణుడు తల్లివలన దాగె.
వారణంబునకు - శోకంబువలన వారించె.

ఈ పంచమికి షష్ఠియుంగొండొక యెడలనగు. చోరునకు వెఱచె, పాపంబునకేవగించె: అధ్యయనంబునకుడస్సె: పాడికింబరాకువడియె. మనువునకు విశ్వాకుండుపుట్టె: ఇత్యాదులూహించునది.

గు. అపాయము=విడిపోవుట, జుగుప్స=ఏవగింపు, రోత, పరాజయము=బదలికచెందుట ప్రమాదము=పొరపాటుపడుట: గ్రహణము=గ్రహించుట, స్వీకరించుట, తెలిసికొనుట, వినుట, మున్నగునవి భవనము=పుట్టుట, త్రాణము=రక్షించుట, విరామము=విరమించుకొనుట, అంతర్ధి=దాగికొనుట, వారణము=వారించుట-నివారించుట.

పైనచెప్పినవి దేనివలన కల్గునో తద్వాచకపదమునకు 'వలన' వచ్చును. పై ఉదాహరణములు వరుసగా చూడదగినవి.

ఈ పంచమికిమారుగా షష్ఠియువచ్చును. ఆ వచ్చిన రూపముల నుదాహరించినాడు. చోరునకు వెఱచె-ఇత్యాదులు.

**సూ-10. ఉండిపదంబొకానొకచో వలనవర్ణంబున కను ప్రయుక్తంబగు.**

హిమగిరి వలనసుండి గంగవొడమె.

నాకంబువలనసుండి నారదుండు వచ్చె.

గు. అనుప్రయుక్తము=అనుసరించి ప్రయోగింపబడినది. కొన్ని చోట్లవలనకు ఉండి అనుపదము కలిపిప్రయోగింపబడును—వలనసుండి.

1వ ఉదాహరణమున- భవనమును అర్థమున వలనరాగా దానికి ఉండిపదము చేరినది. 2వ ఉదాహరణములో అపాయార్థమునవలన రాగా దానికి ఉండిపదము చేరినది.

**సూ-11. ఉండిశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయా సప్తములు ప్రాయికంబుగనగు.**

వనమునుండివచ్చె-వనమందుండి వచ్చి, ఊరినుండివచ్చి ఊరనుండి వచ్చె, వనమునుంచి, భవమునుంచి అవియుంచి శబ్దాను ప్రయోగంబుకో,

గొందఱు వ్యవహరించెదరుగాని యవిసాధుకవి ప్రయోగారూఢంబుగావవి యెఱుంగునది.

గు. వెనుకటి సూత్రమునవలనకు ఉండిశబ్దమునను ప్రయుక్తముగా చెప్పెను. ఈసూత్రమున ఆ'వలన' కుమారుగా ద్వితీయ, సప్తమీ విభక్తుల తఱచుగావచ్చునని చెప్పుచున్నారు.

వనమువలననుండి వచ్చె-ద్వితీయ వచ్చినచో_వనమునుండి వచ్చె. సప్తమివచ్చిన-వనమందుండివచ్చె. అనియగును. అట్లే ఊరినుండి ద్వితీయ ఊరనుండి-సప్తమ ఈ'ఉండి' పదమునకు కొందరు 'ఉంచి'అను పదమును వాడుచున్నారు. అది అసాధువు. వనమునుంచి అనరాదు. వనమునుండి_ అనియే అనవలెను.

సూ-1౭. కంటెపర్థకంబన్యార్థాది యోగఙంబగు పంచమికగు.

రామునికంటె నన్యుండు ధానుష్కుండులేఁడు. లోభంబుకంటె నితరంబు దోషంబులేదు. ఇచట షష్ఠియునగు.

రామునకన్యుండుధానుష్కుండులేఁడు. అన్యము, ఇతరము. పూర్వము, పరము, ఉత్తరము-ఇత్యాదులన్యాదులు.

గు. అన్య, ఇతర, పూర్వ, పర, ఉత్తర-మున్నగుశబ్దములతో సంబంధమున్నపుడు పంచమీ విభక్తి ప్రత్యయములో 'కంటె'అను ప్రత్యయమువచ్చును. రామునికంటె అన్యుండు=ఇతరుడు,ధానుష్కుడు=విలుకాడు లేడు. అట్లే లోభముకంటె ఇతరంబు. దోషంబులేదు. షష్ఠికూడ ఈ అర్థములోవచ్చును. రామునకు అన్యుడుధానుష్కుడులేడు. ఇది షష్ఠికుదాహరణము.

సూ-1౮. కంటెపర్థకంబు నిర్ధారణ పంచమికగు.

ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబె కలిగియుండు

నచటం బంచమియగు. ఆ పంచమికిఁ గంటె వర్ణకం బగునని యర్థము. కాన పదములకంటె నాగరకులు వివేకులు. మానహానికంటె మరణము మేలు.

గు, నిర్ధారణము = వేరుచేయుట, జాతి, గుణ, క్రియా, ద్రవ్యము లలో దేనినుండి వేరుచేయుట జరిగినను పంచమీవిభక్తి ప్రత్యయములలో, 'కంటె' ప్రత్యయమువచ్చును. జానపదులకంటె నాగరులు వివేకులు. పల్లెటూరివారికన్న పట్టణవాసులు వివేకవంతులు — ఇచట నాగరులను జాతిని జానపదులనుండి వేరుచేయుచున్నందున, తద్వాచకపదమైన జానపదశబ్ద పదోత్తరమునకంటె ప్రత్యయమువచ్చినది. మానముకంటె మరణముమేలు. అనుచోట మరణము మానమను గుణమునుండి వేరుచేయబడినది. కాన మానముకంటె-అని అయినది.

సూ.14. షష్ఠీవర్ణకంబు హేతువులగు గుణక్రియల కగు.

జ్ఞానముఁబట్టి ముక్తుఁడగు. నీవు వచ్చుటఁబట్టి ధన్యుఁడనయితి ఇచట వలన వర్ణకంబునగు. జ్ఞానమువలన ముక్తుండగు.

గు. హేతువులైన గుణక్రియా వాచకపదములనుపట్టి అనుపంచమీ విభక్తిప్రత్యయముచేరును జ్ఞానముంబట్టి ముక్తుఁడగు-ముక్తుఁడగుటకు జ్ఞానము గుణముహేతువు—కావ తద్వాచక పదోత్తరమున పట్టిచేరినది. నీవువచ్చుటం బట్టి ధన్యుఁడనయితి-అనువానిలో ధన్యుఁడగుటకు వచ్చుటయనుక్రియ హేతువు. కానవానికిపట్టి వచ్చినది. పట్టికిమారుగా హేత్వర్థమున వలనయు వచ్చును.

జ్ఞానమువలన ముక్తుఁడగు-అన్నది ఉదాహరణము.

సూ-15 శేషషష్ఠికి యొక్కయునగు.

ఇచట శేషంబనఁగా సంబంధంబు. రామునియొక్క గుణములు, నా యొక్క మిత్రుఁడు, వానియొక్క తమ్ముఁడు, కువర్ణకంబు గొన్నియెడల సంబంధంబునందగు, నా కుఁదమ్ముఁడు, మీకునెచ్చెలి.

గు. శేషషష్ఠికి సంబంధార్థమునవచ్చు షష్ఠివిభక్తికి 'యొక్క'అను ప్రత్యయము వచ్చును. 'యొక్కయు' అనుటచే 'కు'వర్ణకమును వచ్చునని సూరియే వివరించినాడు.

రాముని సంబంధమైన గుణములు కావ రామునియొక్క గుణములు-అయినది. ఈ సంబంధార్థమున యొక్కకుమారుగా 'కు'రాగా నాకు తమ్ముడు-నా యొక్క తమ్ముడు-అని అర్థము.

## సూ-16. నిర్ధారణ షష్ఠికి లోపల వర్ణకంబగు.

జాతి, గుణ, క్రియాసంజ్ఞలచేత సముదాయంబునుండి యేక దేశం బునకుం బృథక్కరణంబు నిర్ధారణంబనంబడు. ఎద్దానివలన నిర్ధారణం బగునప్పటి షష్ఠికిలోపల వర్ణంబగునని యర్థము. మనుష్యులలోపల క్షత్రియుండుశూరుండు. గోవులలోపలఁ గపిల బహుక్షీర. అధ్వగులలోపలం బారువాఁడు శీఘ్రగామి. ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు, ఇటనత్తమి యుంగలదు. మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు. ఇత్యాదు లెరుంగునది.

గు. జాతి, గుణ, క్రియా, సంజ్ఞలచే సముదాయమునుండి కొంత దానిని పృథక్కరణము=వేరు చేసినపుడు దానికి షష్ఠివిభక్తి ప్రత్యయములలో'లోపల' అనునది వచ్చును.

1. మనుష్యులలో పలక్షత్రియుఁడు శూరుడు-దీనిలో మనుష్య జాతిలో ఏకదేశమైన క్షత్రియుని జాతినిబట్టి విడదీసినాడు. కనుక 'లోపల' అన్నది వచ్చినది 2. గోవులలోపల కపిలబహుక్షీర-ఇటగోజాతి నుండి కపిలను కపిలవర్ణము_అనుగుణమునుబట్టి వేరుచేసినాడు. 3. అధ్వగుల లోపలఁబారువాఁడు శీఘ్రగామి- బాటసారులను పరుగెత్తువాడు శీఘ్రముగా వెళ్ళువాడు- బాటసారులలో సమూహమునుండి పారువాడు-అని క్రియనుబట్టి వేరుచేసినాడు. 4. ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు-ఇటువిద్యార్థి సమూహమునుండి మైత్రుడు-సంజ్ఞ పేరుచే వేరుచేసినాడు. కనుకలోపల

ప్రత్యయము చేరినది. ఈయర్థమునలో వలకు సూరుగా సప్తమికూడ వచ్చును. మనుష్యులయందు క్షత్రియుడు శూరుడు అని మనుష్య పదోత్తరమున-అందు అని సప్తమివచ్చినది. ఇట్లేతక్కిన వాటికిని రెండు రూపములగును.

**సూ. 7. అధికరణంబునకు సప్తమియగు,**

అధికరణంబు నా నాధారంబు. ఔపశ్లేషికంబు వైషయికం బభివ్యాప కంబని యాధారంబు త్రివిధంబు. ఘటమందు జలమున్నది. మోక్షమందిచ్ఛ గలదు. అన్నింటియందీశ్వరుండు గలండు.

గు. అధికరణమనగా ఆధారము=ఆశ్రయము. ఘటమందు జలమున్నదనగా-ఘటమాధారము, జలమాధేయము. ఈఆధారము మూడు విధములు, 1. ఔపశ్లేషికము=సంయోగము కలిగిఉన్నది. వైషయికము=విషయముగా ఉన్నది, 3. అభివ్యాపకము=సర్వత్రవ్యాపించి ఉన్నది. ఘటమున జలము సంయోగము కలిగియుండును. మోక్షము నందిచ్ఛ కలదు. ఇందు ఇచ్ఛ=కోరిక-ఇందు విషయముగాండును. ఏ విషయమైన కోరిక అనగా మోక్షవిషయకమైన ఇచ్ఛ-అని వైషయికమైన ఆధారము. 3. అన్నింటియందీశ్వరుడు-వ్యాపించి ఉన్నాడు. కాన అది వ్యాపకాధారము జగత్తు.

**సూ. 9. విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగ విభక్తి వచనంబులగు.**

నంద తనయుండు కృష్ణుండు నాకు దిక్కు, దేవకీపుత్రు హరి నుతింతునెపుడు శుభవిధాయుల రామకృష్ణుల భజింతు భువనవంద్యను రుక్మిణిం బొగడుదును.

గు. గుణక్రియాది విశేషములను చెప్పునది విశేషణము, దేనివిశేషము చెప్పబడునో అదివిశేష్యము. ఈ రెంటికిని లింగవచన విభక్తులు సమముగనే ఉండును. 1. నందతనయుండు కృష్ణుండు నాకుదిక్కు అను దానిలో కృష్ణుడు విశేష్యము - ప్రథమావిభక్తి, పుంలింగము, ఏకవచన

మున ఉన్నది. విశేషణమైన-నంద తనయుండు-అన్నదికూడ పుంలింగము, ప్రథమావిభక్తి, ఏకవచనము అయియున్నది. అట్లే 2. దేవకీపుత్రు హరిన్=అనుచోట హరి-ద్వితీయావిభక్తి పుంలింగము, ఏకవచనము, దేవకీపుత్రున్ - అను విశేషమునంతే. 3. శుభవిధాయుల రామకృష్ణులన్-అనుచోట విశేష్యమైన-రామకృష్ణులన్-అన్నది పుంలింగము, ద్వితీయా బహువచనము. విశేషణము- శుభవిధాయులన్ అన్నదియు నంతే. 4 భువనవంద్యను రుక్మిణిన్ అనుచోట రుక్మిణిన్ అన్నది స్త్రీలింగము, ద్వితీయా, ఏకవచనము, భువనవంద్యను- అన్న విశేషణము నంతే.

**సూ 0. స్త్రీ సమంబులగు విశేషణంబులయు, మువర్ణకాంత విశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగానగు**

మాటలు పెక్కేల- మాటలు పెక్కులేల. కులిశధారల్కాంకితం బయ్యె- కులిశధారల్కాంకితంబులయ్యె. ఇష్టమగు పదార్థములు- ఇష్టములగు పదార్థములు.

గు. స్త్రీ సమము=స్త్రీలింగము కాకపోయినను స్త్రీలింగ శబ్దములకువలె ప్రథమా విభక్తి ప్రత్యయమైన 'ము' కారాంతములగు శబ్దములు; మువర్ణకాంత విశేషణము = 'ము' అను ప్రత్యయము చివరనున్న విశేషణము.

ఇది పై సూత్రమునకు అపవాద సూత్రము, అందు విశేషణ విశేష్యములకొకే లింగవచన విభక్తులుండవలెనని చెప్పగా దీనిలో అట్లుండని రూపములు కనబరచినాడు. 1. మాటలు పెక్కు=మాటలు విశేష్యము, పెక్కు విశేషణము వచన భేదమున్నది. మాట-స్త్రీసమము, కులిశధార- స్త్రీలింగము, ఇష్టము-మువర్ణకాంత విశేషణము బహువచనము విశేష్యమున కుండగా వీటికి ఏకవచన రూపము లున్నవి.

సూ. 1. ఒకానొకచో నొక విభక్తికి షష్ఠియొక విభక్తియునగు

మైత్రుండు గృహమును వెడలెను. గృహము నుండి యని యర్థము. వాఁడు వాహనమును డిగెను వాహనము నుండియని యర్థము. వారు సుఖమున్నారు. సుఖముతోనని యర్థము ఇక్కాయ లెరుంగునది

గు. పై సూత్రములలో చెప్పబడిన విభక్తికి మారుగా మరొక విభక్తియు వచ్చును. గృహము నుండి అని పంచమికి మారుగా గృహమును అని ద్వితీయ వచ్చినది. వాహనము నుండికి మారుగా వాహనమును అని వచ్చినది. సుఖముతో అని తృతీయకు బదులుగా సుఖము అని ప్రథమ వచ్చినది.

సూ. 2 జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు.

రాముఁడు వాలి నొక్క కోలంగూలనేసె. కోలతోనని యర్థము.
లంకం గలకలంబు పుట్టె. లంకయందని యర్థము.

బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందెయగు. అర్జునుఁడు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె. బాణములంచేనని యర్థము మీనంబు జలంబులనుండు. జలంబులందని యర్థము.

గు. జడము=ప్రాణములేనిది జడవాచక శబ్దమునకు తృతీయ, సప్తమి విభక్తులకు మారుగా ద్వితీయ వచ్చును 1. కోలన్- ద్వితీయ. కోలతో అని తృతీయకు మారుగా ద్వితీయ వచ్చినది. 2. లంకన్- ద్వితీయ. లంకయందు- అను సప్తమికి మారుగా ద్వితీయ వచ్చినది.

బహుళముగా వచ్చుననుట వలన ఇక్కార్యంబు- తృతీయా సప్తములకు ద్వితీయ వచ్చుట. ఉకారాంత శబ్దములకు బహువచనమున మాత్రమే కల్గును. 1. బాణంబులను- బాణములచే, తృతీయకు ద్వితీయ వచ్చినది 2 జలంబులన్- జలంబులందు, సప్తమికి మారుగా ద్వితీయ. ఇవి

బాణము, జలము అని ఉకారాంతములు. పైవి కోల, లంక అని అకారాంత శబ్దములు. కాన వానికి ఏకవచనమువకూడ ద్వితీయ వచ్చినది. ఇవన్నియు జడవాచకములే.

సూ. 23. ఉదంత జడంబు తృతీయకు నవర్ణకంబగు.

రాముఁడొక్క బాణంబున వాలిం గూలనేసె. బాణముచేవని యర్థము.

గు. హ్రస్వ ఉకారాంత, జడవాచక శబ్దమునకు తృతీయా విభక్తి ప్రత్యయం రావలసినచోట 'న' ప్రత్యయం వచ్చును. 'బాణంబున'- బాణము అన్నది ఉకారాంతమైన జడవాచకం. దీనికి కరణార్థమున 4వ సూత్రంచే తృతీయ విభక్తి రాగా 'న' కారము వచ్చినది.

సూ. 24. జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు.

వాఁడు పూవుఁ దెచ్చె- వాఁడు పూవులను దెచ్చె. అతె సొమ్ములు దాల్చె-అతె సొమ్ములను దాల్చె. వాఁడిల్లు వెడలె – వాఁడింటిని వెడలె. బాహుళకముచేఁ దృతీయా సప్తములకు విధించిన ద్వితీయకుం బ్రథమ రాదు

గు. జడవాచకమునకు వచ్చిన ద్వితీయకు ప్రథమ వికల్పముగా వగును పూవు జడవాచకం వాని ద్వితీయ– పూవులను- దానికి ప్రథమ పూవు అని అయినది అతె=అమె, సొమ్ములు = నగలు. నగలను అని ద్వితీయ వచ్చుచోట సొమ్ములు అని ప్రథమ వచ్చినది. ఇంటిని-ఇల్లు అయినది. బహుళమనుటచే తృతీయా సప్తములకు 22వ సూత్రంచే విధింపబడిన ద్వితీయ స్థానమున ప్రథమరాదు. కోలఁగూలనేసి-వని, లంక కలకలంబు పుట్టెనని- కోల, లంక పదోత్తరమున ద్వితీయకు మారుగా ప్రథమ రాదని అర్థం.

**సూ. ౨౫. కాలాధ్వములకుం బ్రాయికంబుగా బ్రథమ యగు.**

వాఁడు నిన్నవచ్చె, వీఁడు నేఁడుపోయె, మాపు నిలువుము, రేపు పొమ్ము, వారు క్రోశము నడచిరి. వీరామడ వోయిరి.

గు. కాలవాచకములకు, మార్గవాచకములకును ప్రథమా విభక్తి తఱచుగా వచ్చునని అర్థం. నిన్న, నేడు, రేపు, మాపు- కాలవాచకములు, క్రోశము, ఆమడ- అధ్వవాచకములు. వీటికి ప్రథమ వచ్చినది. ప్రాయికముగా అనుటచే వాఁడు ఉదయమున వచ్చెను- ఇత్యాదులందు సప్తమివచ్చిన రూపములున్ను ఉండును.

**సూ—౨౬. సర్వనామ సంఖ్యాఖ్యాన తద్విశేష్యంబుల యందెయ్యది ముందు ప్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగానగు**

అన్ని గుఱ్ఱములకు- అన్నింటికి గుఱ్ఱములకు, గుఱ్ఱములన్నింటికి, గుఱ్ఱములకన్నింటికి సాహిణులు మువ్వురు.

రెండు గుఱ్ఱములకు-రెండింటికి గుఱ్ఱములకు, గుఱ్ఱములు రెండింటికి, గుఱ్ఱములకు రెండింటికి సాహిణులు నలుగురు.

లక్ష గుఱ్ఱములకు- లక్షకు గుఱ్ఱములకు, గుఱ్ఱములు లక్షకు, గుఱ్ఱములకు లక్షకు రవుతులు లక్ష ఇత్యాదు లెరుంగునది

గు. అన్ని మున్నగు సర్వనామములు, సంఖ్యను చెప్పు - ఒకటి రెండు మున్నగునవియు సర్వనామములు, సంఖ్యావాచకములు అన్నియు విశేషణములే. వాని విశేష్యములలో ముందు ప్రయోగింపబడిన దాని ద్వితీయాది విభక్తులకు మారుగా ప్రథమా విభక్తి వచ్చును. 19వ సూత్రంచే విశేషణ విశేష్యములకొకే విభక్తి రావలసియుండగా దీనిచే ప్రథమా విభక్తి విధించుచున్నారు. అన్నిటికి గుఱ్ఱములకు- ఒకే విభక్తి వచ్చిన రూపము, అన్ని గుఱ్ఱములకు- ప్రథమ వచ్చిన రూపము, గుఱ్ఱము

అన్నిటికి- విశేష్యము ముందు ప్రయోగింపబడినందున దానికి ప్రథమ వచ్చినది. విశేషణవాచకమైన అన్నికి అన్నింటికి అని షష్ఠి వచ్చినది. ప్రథమా విభక్తి రానిపక్షమున అన్నిటికీ గురవులకు అని షష్ఠియే వచ్చినది.

**సూ. 27 ఒకానొకచో విశేషణంబులో షష్ఠికిం బ్రథమ విభాషనగు.**

సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద.

సుగుణాభిరామునకు రామునకు జోహారు మొనర్చెద.

గు. విశేష్యము షష్ఠీ విభక్తిలో ఉన్నపుడు, విశేషణములు షష్ఠీ విభక్తిలో ఉండవలసి యుండగా దానికి మారుగా ప్రథమా విభక్తి వికల్పముగా విధించబడినది. రామునకు, విశేష్యము షష్ఠిలో ఉండగా, సుగుణాభి రాముఁడు, అని విశేషణమునకు ప్రథమ వచ్చినది.

**సూ. 28. భవత్యర్థ వ్యవహితంబులగు విశేషణంబు లకుం బ్రథమయగు.**

అగు మొదలగున విభత్యర్థములు. విద్యాశాలియగు పురుషుని సకల జనులు సన్మానింతురు. భూతదయాళురగు మహాత్ములకు శ్రేయంబు గలుగును. అతిమానుష మత్యద్భుత మతిమనష్కరమయిన కేశవార్జునకృతిన్.

గు. భవతి—అను సంస్కృతధాతువున కర్థములు తెనుగున - అగు, అవు, ఔ, అయిన, ఐన - మున్నగునవి. ఈ పదములచే విశేష్యమునకు వ్యవధానముకల విశేషణములకు ప్రథమ వచ్చును. 1. విద్యాశాలియగు పురుషుని - ఇచ్చట పురుషుని - అన్న విశేష్యము ద్వితీయా విభక్తిలో నున్నది. విశేషణమైన విద్యాశాలి-అన్నది ప్రథమలో ఉన్నది. 2. భూత దయాళురగు మహాత్ములకు-సీనిలో విశేష్యము షష్ఠిలో ఉన్నది. విశేషణ మైన భూతదయాళురు-అన్నదానికి అగు అన్నది వ్యవధానముగా ఉన్నది. కాన విశేషణమునకు ప్రథమవచ్చినది. 3. అతిమానుషము అత్యద్భుతము,

అతిమనస్కారము, అయిన, కేశవార్జున కృతిన్, దీనిలో ఉన్న మూడు విశేషణములకును, అయిన అను వ్యవధానమున్నందున ప్రథమ వచ్చినది.

**సూ. 29. భవత్యర్థకంబు సన్నిహిత విశేషణంబునకును, దాని ముందు విశేషణంబులకయి పదంబును బహుళంబుగానను ప్రయుక్తంబులగు.**

అతులుఁడయి యప్రమేయుఁడే హరిని గొలుతు.

గు. విశేష్యమునకు వాల విశేషణము లున్నపుడు, సన్నిహిత విశేషణంబునకు=దగ్గరగానున్న విశేషణమునకు, అగు, అనునదిన్ని, దూరముగా ఉన్న విశేషణములకు అయి, అను పదమును అను ప్రయుక్తము వికల్పము గానగు. హరికి అతులుడు, అప్రమేయుడు, రెండును విశేషణములు. అందు సన్నిహిత విశేషణమైన అప్రమేయుడన్నదానికి—ఔ అనునదియు, దూరవిశేషణమైన అతులుడన్నదానికి, అయి, అన్నదియు అను ప్రయుక్తమైనది.

**సూ. 30. అయపదాను ప్రయోగంబు లేనిచోఁ దాది విశేషణంబునకేని విశేషణంబులన్నింటికేని మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపంబడు.**

అద్వయుఁడ ప్రమేయుఁడగు హరిని గొలుతు.

అద్వయుఁడున మేయగుణుఁడునే హరిని గొలుతు.

అద్వయుఁడ ప్రమేయుండ గ హరిని గొలుతు.

గు. అయి, పదమను ప్రయుక్తము కానపుడు చివరి విశేషణమునకుగాని, విశేషణములన్నింటికిగాని సముచ్చయార్థం వికల్పముగావచ్చును.

1. ఉదాహరణమున చివరి విశేషణమునకు సముచ్చయార్థమైన 'ను' చేరినది. 2వ దానిలో రెండు విశేషణములకు 'ను' చేరినది. 3వ దానిలో దూరవిశేషణమున 'కయి' లేదు, సన్నిహితవిశేషణమునకు సముచ్చయార్థము చేరలేదు.

**సూ. 31. ధాతుజ విశేషణ వ్యవధానంబున విశేషణంబు లన్నింటి కయి పదంబను ప్రయుక్తంబగు.**

అమ్యండై, అప్రమేయుఁడై, యఖిల సేవ్యుఁడై, యొసంగెడు దేవుని నభినుతింతు, ఇచట మఱియుం బ్రయోగ వైచిత్ర్యంబు గల దది ప్రయోగంబుల నెఱుంగునది.

గు. ధాతుజ విశేషణములు లేక క్రియాజన్య విశేషణములు 7 రకములున్నవి. ఎడి, ఎడు, ఇన, చున్, కల, అని, ఎడిమెదురారాని రూపము. సన్నిహిత విశేషణంబున్నకు విశేష్యమున్నకు మధ్య ధాతుజ విశేషణమున్నచో అన్ని విశేషణములకును "అయి" అన్న పదమును ప్రయుక్తమగును. పై ఉదాహరణమ్మున "ఎసంగెడు" అను ధాతుజ విశేషణము వ్యవధానముగా నున్నందున విశేషణములకన్నిటికి "అయి-ఐ" అన్నపదము అను ప్రయుక్తమైనది. ఇట్టివే ప్రాచీన కవుల ప్రయోగములతో ఎన్నో రకముల రూపముల కనబడునని సూరి వివరించినాడు.

**సూ. 32. భావార్థకాది యోగంబునం గర్తకుం బ్రథమ యగు.**

రాముఁడు వచ్చుట: రాముఁడురాఁగా లక్ష్మణుఁడుగాంచె: రాముఁడు విల్లందినంద్రిలోకంబులా కులంబులగు. రాముఁడు పట్టిన పత్రిన వారింపఁ దరంబె.

గు. భావార్థకాదులతో యోగమున్నపుడు కర్తయైన పదమునకు ప్రథమవచ్చును. రాముఁడు వచ్చుట—ఇది భావార్థకము దీనితో సంబంధమున్నందున రాముఁడు—అని ప్రథమవచ్చినది. రాముఁడురాఁగా-రాఁగా—అనుదానికి కర్త కాన రాముఁడు—అని ప్రథమవచ్చినది. రాముఁడు విల్లందినన్-దీనిలోను అందినన్-అనుక్రియకు కర్తరాముఁడు, రాముడు పట్టిన-దీనిలో పట్టిన అనుదానికి కర్త రాముడు-కాని ప్రథమావిభక్తి వచ్చినది.

**సూ. ప్రథమాంతంబులగు యుష్మదస్మ ద్విశేషణం బుల కేకత్వంబున 'వు,ను'లు,ను బహుత్వంబున 'రు,ము'లు నంతాగమంబులు ప్రాయికంబుగనగు.**

**సూ-34. ఈ యాగమంబులు పరంబులగునపుడుత్వం బున కత్వంబగు.**

నీవుధన్యుఁడవు, నేనుధన్యుఁడను, మీరుధన్యులరు, మేము ధన్యులము. ఇకారంబు మీఁదికును క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగునను సూత్రముచేత వునులకిత్వంబగు. నీవుసుకృతివి, నేను సుకృతిని. "అత్రిహరుఁడవేనినుఁగొల్తునంబుజాక్ష" "గర్వగరిష్ఠుండగు నన్ను" "మీరలు పెద్దలు" ఇత్యాదులు ప్రాయిక గ్రహణముచే రక్షితంబులయ్యె

గు. ప్రథమావిభక్తిలోనున్న యుస్మత్=నీ, అస్మత్=నే అనుశబ్దముల విశేషణములకు ఏకవచనమున వు-నులును, బహువచనమున రు,ములును అంతమున=చివరన అగమములుగా వచ్చును.

నీవుధన్యుడవు-ఇది నీమనకు విశేషణము, ఏకవచనము, కాన ధన్యుఁడు+వుచేరగా-34 సూత్రముచే ఉత్వమునకత్వమురాగా ధన్యుఁడవు-అగును. అట్లే నేను ధన్యుఁడు+ను=ఉత్వమున కత్వము=ధన్యుఁడను. సుకృతి+ను—ఇకారంబు మీఁదికనుక్రియా విభక్తులయుత్వంబున కిత్వంబగు-నను సూత్రముచే ఇకారము మీది'ను'కు ఇత్వమురాగా సుకృతివి, సుకృతిని అయినవి. బహువచనమున-ధన్యులు+రు= ఉత్వమున కత్వము రాగా—ధన్యులరు. ధన్యులు+ము=ధన్యులము. ప్రాయికముగా అనుట వలన—గర్వగరిష్ఠుండగు-అనియు కావచ్చును. పై అగమములు వచ్చిన—గర్వగరిష్ఠుండనగు-అనికావలెను. అట్లేమీరలు పెద్దలరు-అని కావలసి యుండగా పెద్దలు అనిఅయినది.

**సూ-35. అది శబ్దంబునకు 'మను'లు పరంబులగు నపుడును, సంబోధనంబున-దును 'దాన'యను నాదేశంబగు.**

నీవు చిన్నదానవు, నేను చిన్నదానను, ఓ చిన్నదాన!

గు. చిన్న+అది+వు= అనియుండగా ఈసూత్రముచే 'దాన'అను

నది-'అది'శబ్దమున కాదేశముగారాగా - చిన్నదాన+వు=చిన్నదానవు అయినది. అట్లేనేను చిన్న+అది+ను చిన్న+దాన+ను= చిన్నదానను అగును. సంబోధనమున-ఓ చిన్న+అది=ఓ చిన్నదాన అని అయినది

సూ-36 అన్యయుష్మ దస్మత్కార్యంబు లందుత్త రోత్తరీయంబు బలీయంబు

వారును మీరు సుధన్యులరు. మీరును మేమును ధన్యులము

గు. అన్య, యుష్మత్, అస్మత్-నీవు నేను, మీరు, మేము, ఇవి గాక ఇతరములు వీటిలో ఏది ఉత్తరమగునో అది బలవత్తరము అనగా ఆశబ్దమునకు వచ్చు కార్యముచేయవలెను. వారును మీరుధన్యులరు-దీనిలో మీరు-అన్నది ఉత్తరమున ఉన్నది కాన దానికార్యమైన 'రు'వచ్చి ధన్యులరు అయినది. లేనిచో 'ధన్యులు' కావలసివచ్చును. అట్లే మీరునుమేమును ధన్యులము-అన్నచోట మేము-అన్నది ఉత్తరమున నున్నది కాన'ము'చేరి ధన్యులము అయినది.

సూ-37. ఏకవాక్యంబు నందొకానొక్కండుతక్క సర్వపదంబులు క్రమ నిరపేక్షంబుగం బ్రయోగింపంబడును

పూర్వమిది పరమిదియని నియమమపేక్షించక వాక్యమందెల్ల పదంబులు వలచినట్లు ప్రయోగింపదగును.

ఏవి ప్రభృతి శబ్దంబులుగొన్ని నియమసాపేక్షంబులయి యుండు, గాలిచల్లగావీచెను, వీచెనుచల్లగాగాలి, చల్లగాగాలివీచెను వీచెనుగాలిచల్లగా, గాలివీచెనుచల్లగా, చల్లగావీచెనుగాలి

గు ఏకవాక్యము=కర్త, కర్మక్రియలు ఉన్నఒకే వాక్యము. దానిలో ఏవి మున్నగుకొన్ని శబ్దములు తప్ప తక్కిన పదములన్ని,ముందు వెనుక అను నియమము లేకుండ ఎట్లా ప్రయోగించినను దోషములేదు. దాని కుదాహరణముగా వాక్యములోని మూడుపదములను వీలైనన్ని రీతులవాడి చూపినారు ఏవి, వలెమున్నగు పదముల విషయమున రాముడేవి, రాముడు వలె-అనియే ప్రయోగింపవలెగాని-ఏవిరాముడు, వలెరాముడు-అని 'ఏవి, వలె' పదములను ముందుంచి వాక్యము చెప్పరాదు.

ఇది కారక పరిచ్ఛేదము

-- ౦ --

# సమాస పరిచ్ఛేదము

**సూ-1. సమర్థంబులగు పదంబు లేక పదంబగుట సమాసంబు**

పృథగ్భూతంబులగు నర్థంబులకే కార్థభావంబు సామర్థ్యంబు

పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబులకే కార్థంబులంబు వృత్తిసామర్థ్యంబు

వి. రెండుగాని అంతకన్న ఎక్కువగాని సమర్థములైన పదములు కలిసి ఏకపదమగుట సమాసమనబడును. సమర్థములనగా—వేరువేరుగా ఉన్న పదములకు ఒకేఅర్థము కలిగింపగలశక్తి. అన్నిపదములను కలిసి సమాసముగా ఏర్పడజాలవు వాడురాముడు—ఇత్యాది చెఱువుగట్టు—సమాసము కాగలవు

**సూ-2. సాంస్కృతికాచ్ఛిక మిశ్ర భేదంబుచే సమాసంబు త్రివిధంబు**

సాంస్కృతికంబని యాచ్ఛికంబని మిశ్రంబని సమాసంబు త్రివిధంబు. అందు సాంస్కృతికంబు సిద్ధంబని సాధ్యంబని ద్వివిధంబు. కేవల సంస్కృతశబ్దంబుల సమాసంబు సిద్ధంబునాఁబడు రాజాజ్ఞ తటాకోదకము. లక్ష్మీవల్లభుఁడు, సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబు నాఁబడు రాజానాజ్ఞ, తటాకంబునుదకము, లక్ష్మీవల్లభుఁడు, తక్కిన తెనుంగుల సమాసంబాచ్ఛికంబనంబడు తెలిమూనతి, చెఱువుసీటు, సిరిచెలువుఁడు ఉభయంబులు గూడినది మిశ్రంబనంబడు—రాజాముదల, చెఱువునుదకము, సిరివల్లభుడు

గు సాంస్కృతికము, అచ్ఛికము, మిశ్రము-అని సమాసము మూడువిధములు. సాంస్కృతికము మరల రెండురకములు-1. సిద్ధము, 2 సాధ్యము. 1. సాంస్కృతికములో సిద్ధము—కేవల సంస్కృత పదములతో సంస్కృతమున ఏర్పడి సమాసాంతమున డుముపులు చేరినది. రాజాజ్ఞ ఇది రాజ+ఆజ్ఞ. అవి రెండు సంస్కృతపదములతో నైనవి సవర్ణ దీర్ఘ సంధితో కలిసినవి. అట్లే తటాక+ఉదకము, లక్ష్మీ వల్లభుడు అన్నవి. 2 సాధ్యమనగా తత్సమశబ్దములతో నేర్పడినది. రాజు+ఆజ్ఞ. రెండును తత్సమశబ్దములు షష్ఠి సమాసంబున-అనుసూత్రము చేనుగా గమము వచ్చి రాజునాజ్ఞ అయినది అట్లే తటాకంబు+ఉదకము=తటాకంబు నుదకము, లక్ష్మీవల్లభుడు లక్ష్మీశబ్దము హ్రస్వమై లక్ష్మియైనది. ఇది తత్సమము. 2. అచ్చతెనుగు పదముల కూడికతోనైనవి, అచ్ఛికము - తేవి యానతి. అచ్చతెనుగు పదము, తద్భవ పదము కలిసినవి చెలువుసిరి, సిరిచేఁపుదు - ఇవికూడ అచ్చతెనుగు పదముల కలయికలే. సంస్కృతము-తెలుగు శబ్దములకలయిక మిశ్రసమాసము· రాజుముదల-ఇందురాజు రాజుతత్సమపదము, ముదలఅచ్చతెనుగు పదము. చెలువునుదకము, స్త్రీ వల్లభుడు-వీనిలోనూరవల్లభుడు, ఉదకము-తత్సమ పదములు. చెలువు-అచ్చతెనుగు పదముకాగా, సిరి తద్భవ పదము. యిది భాషనుబట్టి వచ్చిన విభాగము

### సూ. 3 తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబయగు

తత్పురుష, బహువ్రీహి, ద్వంద్వంబులని సమాసంబు లెల్లం ద్రివిధంబులయి యుండు అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయ పదార్థ ప్రధానంబులయి యుండు. అందు తత్పురుషంబు వ్యధికరణంబని సమానాధికరణంబని ద్వివిధంబు ద్వితీయాదులకు మీఁది వ్రద[illegible] సమాసంబు వ్యధికరణంబు నాఁబడు. [illegible]

దొంగభయము, రామునిబాణము, మాటనేర్పరి. విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు. ఇదియే కర్మధారయంబు నాఁబడు — సరసపు వచనము, తెల్ల గుఱ్ఱము, మంచి రాజు ఇది సంఖ్యా పూర్వంబు ద్విగువు నాఁబడు. ముజ్జగములు, ముల్లోకములు, బహువ్రీహి — ముక్కంటి, చలివెలుఁగు ద్వంద్వము - తల్లిదండ్రులు, అన్నదమ్ములు.

ప్రాయికంబుగా ననుటచే సంస్కృత లక్షణంబు దొడరని సమాసంబులంగలవని సూచింపబడియె. దానంజేసి - చిగురుకేలు - దొంటిమోవి ఇత్యాదులయిన ఉపమాన పూర్వపద కర్మధారయంబులు గ్రాహ్యంబులు ముఖపద్మము, చరణకమలములు - ఇట్టి యుపమానోత్తర పదంబులు గలవుగాని విపరీతంబులు సిద్ధంబులు లేవని యెఱుంగునది. సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు రాజపురుషుఁడు, నీలోత్పలము, పీతాంబరుఁడు, రామలక్ష్మణులు. కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు. దానంజేసి, యనేకమాటలు అల్పచందిత్యాదులు దుష్టములని తెలియునది.

తత్పురుషాది సమాసముల లక్షణములు సాధారణముగా సంస్కృతములో చెప్పినట్లే ఉండును. సమాసములు మూడు రకములు. 1 తత్పురుషము, 2. బహువ్రీహి, 3. ద్వంద్వము. ఉత్తర పదార్థ ప్రధానము తత్పురుష, అన్య పదార్థ ప్రధానము బహువ్రీహి, ఉభయ పదార్థ ప్రధానము ద్వంద్వము ఏది ప్రధానమన్నది క్రియతో అన్వయించుటనుబట్టి తెలియును.

రాజపురుషులు కావలి కాయుచున్నారు, దీనిలో కావలి కాయువారు పురుషులుకాని రాజు కాదుకదా. సమాసమున మొదటి పదము పూర్వపదము, రెండవది ఉత్తరపదము. పురుష - అన్నది ఉత్తరపదము. దాని అర్థము ప్రధానము - బహువ్రీహిలో-ముక్కంటి-మూడు కన్నులు కలవాడు అనగా మూడు, కన్నులు రెండుపదముల అర్థములు కాక అన్యపదము యొక్క అర్థము శివుడు అర్థమైనది. ద్వంద్వమున - రామ

కృష్ణులు చదివిరి. చదివినవారు రామకృష్ణులిద్దరును. కనుక ఉభయ పదార్థ ప్రధానము

ఇందు తత్పురుష రెండు విధములు — 1. వ్యధికరణము 2. సమానాధికరణము. ద్వితీయాదివిభక్తులతో నయినది వ్యధికరణము. సమానాధికరణ తత్పురుషయే కర్మధారయము. అది సంఖ్యా పూర్వమైన ద్విగువు అనబడును ఉదాహరణములన్నిటికీ ఇచ్చినాడు. నెలతాల్పు=నెలను ధరించినవాడు — ద్వితీయా తత్పురుష. నెలతక్కువవాడు = నెలచేత తక్కువవాడు తృ. త. దేవరమేలు = దేవరకొఱకు మేలు - చ. త. దొంగభయము = దొంగవలన భయము - పం. త. రామునిబాణము = రాముని యొక్క బాణము - ష త. మాటనేర్పరి — మాట యందు నేర్పరి — స. త.

విశేషణ విశేష్యములకైన సమాసము సమానాధికరణము - కర్మ ధారయము. సరసపువచనము = సరసమైన వచనము - విశేషణ పూర్వ పదము. తెల్లగుఱ్ఱము = తెల్లని గుఱ్ఱము. మంచిరాజు = మంచివాడైన రాజు - ఇవి సు విశేషణ పూర్వపదముతే సంఖ్యా వాచకము పూర్వపద మైన ద్విగాను అనబడును - ముజ్జగములు - మూడైనజగములు ముల్లోక ములు = మూడైన లోకములు. బహువ్రీహి - ముక్కంటి = మూడు+ కన్నులు కలవాడు. చలివెలుఁగు = చల్లని వెలుగు కలవాడు - చంద్రుడు ద్వంద్వము - తల్లి+తండ్రి = తల్లిదండ్రులు. అన్న+తమ్ముడు = అన్న దమ్ములు. ఇత్యాదులు.

ప్రాచీనకవులు సంస్కృతలక్షణము గట్టిన సమాసములాతెనుగుకో ఉన్నవని చిగురుకేలు జుంటిమోవి అని ఉదహరించినారు. ఇవి చిగురు వంటికేలు, జున్నువంటి మోవి — అని ఉపమాన పూర్వపద కర్మధారయ ములు. ఇవి సంస్కృతము లేవని సూరి చెప్పినాడు. కాని సమాన కుసుమా వళిలు — 'కామునిశారదా, రతిసుందరీ, లతాతన్వీ, ద్రాక్షామధురా, ఘన

శ్యామః అని ఉదాహరణ లిచ్చి యున్నారు. సిద్ధాంత కౌముదిలో సమాస ప్రకరణమున - ఉపమానాని సామాన్యవచనైః. 2-1-55. ఘన ఇవ శ్యామః ఘనశ్యామః - అని ఉదాహరించి యున్నారు మరి సూరి యేల సంస్కృతమున లేదని చెప్పెనో తెలియదు. విపరీతంబులు, ఉపమాన పూర్వపదములు సిద్ధంబులు=కేవల సంస్కృత పదములతో కూడినవి

కేవల సంస్కృత శబ్దము కేవల తెలుగు శబ్దం సమసించదు.

అనేకమాఁటలు, అల్పదండు - వీనిలో అనేక, అల్ప కేవలం సంస్కృతశబ్దములు మాఁటలు, దండు - అన్నవి తెనుగు పదములు. యిట్లు మిశ్రమ చేయరాదు. "అనేకపుమాఁటలు, అల్పపుదండు" అన వచ్చును సాధువగును.

**సూ 4. ఆ ఈ ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు.**

గు. ఆ ఈ ఏ అను మూడుశబ్దములకు త్రికమని పేరు యివి తచ్ఛబ్ద, ఇదం శబ్ద, కింశబ్ద పర్యాయములగు వా, వీ, ఏ శబ్దముల రూపములు

**సూ. 5, కర్మధారయంబు త్రిక, స్త్రీసమ, ముగంత, ధాతుజ విశేషణ పూర్వపదంబయి యుండు.**

ఆ చందము, ఈ చందము, ఏ బృందము. వాఁడిమాట, పోఁడి పాట, వెడిదపు టడిదము మడిచెడు దడములు; ఈ నియమముచే బల్లి దాఁడు, మల్లుఁడు, కావలుఁడు, రావణుఁడు - ఇత్యాదుల సమాసంబు లేదు.

గు. కర్మధారయ సమాసములో పూర్వపదము త్రికముగాని—ఆ, ఈ, ఏలు, స్త్రీసమముగాని-స్త్రీ లింగశబ్దమువలె ప్రథమైకవచనము లోపించినది ధాతుజ విశేషణములు-ఎడి, ఎదు మున్నగునవికాని అయి యుండును ఉదాహరణములలో మొదటిమూడు త్రికపూర్వపదములు,

వాడి, పోడి-అన్నవి స్త్రీ సమములు. ముగంతము-ముగాగమాంతము కాని వర్గకాంతముకాని - బెడిదము + అడిదము = మువర్ణకాంతము మడిసెడు- విదుఅను ధాతుజ విశేషణాంతము. ఇట్లుచెప్పినందున బల్లిదుఁడు+మల్లుడు బల్లిదమల్లుడు, కావల రావణుఁడు-అనునట్టి రూపములుండవు. ఆ సమాస ములు సాధువులుకావు.

సూ-౮. స్త్రీసమఘటితంబయొకానొకందు బహువ్రీహి చూపట్టెడు.

ముక్కంటి, వేగంటి, చలివెలుఁగు, వేవెలుఁగు, మోటబరి ఇత్యా దులు వ్యవహార సిద్ధంబులు గ్రాహ్యంబులు.

గు. తెనుఁగున బహువ్రీహి సమాసములు తక్కువ అని ఒకానొ కందు అని సూచించినాడు. అవికూడ స్త్రీ సమఘటితములే. వానిలో రెండు పదములును స్త్రీసమములే. మూడు+కన్ను, వే+కన్ను, చలి+వెలుగు, వే+వెలుగు, (మోటమొక్క బరువుకలది) బు - సమాసాంతకార్యము వచ్చి-ముక్కంటి మున్నగురూపములైనవి. స్త్రీసమములైన శబ్దములన్ని టిని బహువ్రీహిగా కూర్పరాదని విశేషించుటకే కవివ్యవహార సిద్ధములే గ్రాహ్యములని సూరిచెప్పినాడు.

సూ-7. అచ్ఛికశబ్దంబులతోడ స్త్రీ సమంబు ప్రాయికం బుగా ద్వంద్వంబగు.

అన్నదమ్ములు - తల్లిదండ్రులు-ఊరుపల్లెలు - ఆలుమగలు. మగఁ డును బిడ్డయును, పల్లమును గట్టెమును-ఇత్యాదులు సమసింపవని ఈ నియ మంబున నెఱుంగునది

గు. మొదటిపదము స్త్రీసమము, ఉత్తరపదము అచ్చతెనుఁగు పద ముగా ఉండునది ద్వంద్వసమాసము. అన్న+తమ్ముడు = మొదటిది స్త్రీసమము, రెండవది తెనుఁగుపదము అయినది. ఇట్లే తల్లి+తండ్రి, ఊరు + పల్లె, ఆలు+మగడు- ఇవన్నియునంతే. ఈనియమము ప్రకారము

మగడు+బిడ్డలు—దీనిలో మొదటిపదము సు ం దము, రెండవది స్త్రీ సమము అయినది పల్లము+కళ్లెము=రెండును తెనుగుపదములే-ఇట్టివి సమానముగా కలియనేరవు.

**సూ-8 సర్వశబ్దంబులు సంబంధంబునందుం దచ్ఛబ్దం బుతోడ సమసించు.**

నావా(డు — నాయది - ఇంటివాడు - ఇంటిది - రామునివా(డు - రామునిది.

గు. అన్నిశబ్దములను సంబంధించినది అనునర్థమున తచ్ఛబ్దము= ఆ అనుశబ్దము, వాడు, వారు, అది, అవి, మున్నగునవి; వానితో సమాస మగును. నావాడు=నాకు సంబంధించినవాడు. నాయది=నాకు సంబంధించి నది. ఇంటివాడు, ఇంటిది, రామునివాడు-రామునికి సంబంధించినవాడు, రామునిది.

**సూ-9 ధాతుజవిశేషణములకు విభక్తి వివక్షించు నపుడు తచ్ఛబ్దంబను ప్రయుక్తంబగు.**

వచ్చినవా(డు, వచ్చినది, రానివా(డు-రానియది.

గు క్రియాజన్య విశేషణములకు విభక్తి చేర్పదలచినచో తచ్ఛబ్దము వాడు, అది, మున్నగునవి, చేరును. వచ్చిన,రాని-యివి ధాతుజ విశేషణ ములు. వీనికివాడు, అదిచేరినది. వచ్చినవాడు, వచ్చినది, రానివాడు రానిది- అనిఅయినది. దీనిపై విభక్తులు చేర్పవచ్చునని అర్థము. వచ్చినవాడు, వచ్చినవాని, వచ్చినవానిచే, వచ్చినవానికొఱకు, రానివానివలన—

**సూ 10 ఎల్లయెడల ధాతుజ విశేషణంబుల కట్టియను పదంబు విభాషనను ప్రయుక్తంబగు.**

వచ్చినట్టి రాము(డు , వచ్చిన రాము(డు, వచ్చునట్టి వా(డు, వచ్చు వా(డు.

గు. సమాసములైనను కాకపోయినను, తచ్ఛద్దమను ప్రయుక్త మైనను, కాకపోయినను అట్టి అను పదం వికల్పముగా చేరును. వచ్చి నట్టి రాముడు. అట్టి చేరినరూపము వికల్పముకాన, వచ్చిన రాముడు, అట్టి చేరనిరూపం.

**సూ. 1. యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తర పదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాషనగు.**

నీదు కరుణ, నీ కరుణ, నాదునేరిమి, నా నేరిమి; తనదు రూపు, తన రూపు.

గు. యుష్మత్=నీ, అస్మద్—నా, ఆత్మ=తాను-వీనికి ఉత్తర పదము పరమైనపుడు దుక్+ఆగమము=దు-అన్నది ఆగమముగా వచ్చును. ఇది వికల్పము. నీదు కరుణ=నీయొక్క కరుణ. వికల్పము కాన నీ కరుణ. అట్లే తక్కినవి

**సూ. 2 గుణవచనంబులగు నల్లాదులకుం కర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగానగు.**

నల్లని గుఱ్ఱము-నల్లగుఱ్ఱము: నల్ల, తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, చామ, తియ్య, కప్పు, పల్ల, చిన్న, తిన్న, అల్ల-ఇత్యాదులు నల్లాదులు.

గు. గుణములను తెలుపెడి నల్ల మున్నగు పదములకు కర్మధారయ సమాస 'ని' అను వర్ణము ఆగమము వికల్పముగానగును. నల్లనిగుఱ్ఱము-ఇది విశేషణపూర్వపద కర్మధారయము. వికల్పముకాన నల్లగుఱ్ఱము-ని రాని రూపము. రంగు, రుచి, చిన్న, తిన్న=అందమైన అని యర్థము. తిన్ననైన=సరిగానున్న రేఖ అనికూడ అర్థము.

**సూ.1 ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘమునకు హ్రస్వంబగు.**

**సూ. 4. త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.**

అక్కన్య-అకన్య: ఇక్కాలము-ఈకాలము, ఎల్లోకము-ఏలోకము, అయ్యశ్వము - అయశ్వము బాహుళకముచే సూక్ష్మ భేదంబులకు ద్విత్వంబుగలుగదు. ఆ రూపము, ఈ శబ్దము, ఏషండము, ఆ సుకృతి, ఆ హయము.

గు. మధ్యన అచ్చు లేకుండ రెండు హల్లులు క్రమముగా ఉన్నచో వానికి సంయుక్తమని పేరు. క్+త్+అ=క్త - ఇది సంయుక్తాక్షరము. ఆ, ఈ, ఏలమీద అసంయుక్తమైన హల్లున్నచో ద్విత్వము వచ్చును. ఆ+కన్య=ఆ+క్+క్+అ=క్కన్య=ఆ క్కన్య. 13వ సూత్రముచే ద్విరుక్తమైన హల్లు=క్క: పరమగునపుడు, అచ్చికమైన దీర్ఘము= అచ్చతెనుగు పదములోని దీర్ఘము=ఆ, ఈ, ఏ మున్నగునవి. వానికి హ్రస్వము వికల్పముగా వచ్చును. ఆ క్కన్య-లో ఆ కు హ్రస్వమురాఁగా అక్కన్య అగును ఇట్లే తక్కినవి. ఊష్మలు=శషసహ: రేఫము=ర. ఈ అక్షరము పరమైనపుడు ద్విత్వమురాదు. ద్విత్వము రానిచో హ్రస్వమునురాదు. కనుక ఆ రూపము, ఈ శబ్దము, ఏషండము, సుకృతి, ఆహయము - అను రూపములే ఉండును.

**సూ. 5 కృత హ్రస్వంబగుచోటు శబ్దంబునోత్వంబున కత్వ హ్రస్వంబులు విభాషనగు.**

అచ్చోటు – అచ్చటు - అచ్చొటు: ఇచ్చోటు – ఇచ్చటు-ఇచ్చొటు: ఎచ్చోటు-ఎచ్చటు-ఎచ్చొటు: వీని ద్విత్వంబునకు వక్ష్యమాణ విధిచేఁ బాధకంబుగ లోపంబగు.

ఆచటు-ఆచోటు: ఈచటు-ఈచోటు: ఏచట-ఏచోటు. ముచ్చోటులు-ముచ్చటలు-ముచ్చొటులు: అను రూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి.

గు హ్రస్వము చేయబడిన ఓత్వము కలిగిన చోటు అను శబ్దమునకు అత్వహ్రస్వంబు=అకారము, హ్రస్వత్వమును వికల్పముగావచ్చును. అ+చోటు=అచ్చోటు, ఇపుడుచోటు శబ్దములోనిఓకారమునకు అకార హ్రస్వములురాగా-అచ్చటు, అచ్చొటు-అగును. ఇట్లే ఎచ్చోటు-ఎచ్చటు-ఎచ్చొటు యిత్యాదులు. వక్ష్యమాణ విధి—ప్రకీర్ణక పరిచ్ఛేదము 8వ సూత్రముచే చోటు శబ్దము ద్విత్వమునకు వికల్పముగా లోపము రాఁగా-అచటు, అచొటు అయినవి. మూడు+చోటులు=సమాస 17చే డులోపము. మూ+చోటులు 13చే దీర్ఘమునకు హ్రస్వము-ము+చోటులు, 15చే ముచ్చోటులు, ముచ్చొటులు, ముచ్చటులు, ఈ రూపములు ప్రయోగములలో ఉన్నవని చెప్పినాడు

**సూ-16. ఉత్తర పదంబగుచోట శబ్దము టాక్షరమునకు లోపంబు విభాషనగు.**

చోటు శబ్దంబౌపవిభక్తికంబు గావున దాని యంతిమాక్షరంబె సప్తమ్యాదేశంబయిన యకారంబుతోడఁ బాక్షికంబుగ లోపించునని యర్థము. అచ్చోనున్నాఁడు, అచ్చోటనున్నాఁడు. ఒకచోనుండె, ఒకచోట నుండె.

గు. చోటు శబ్దము ఔపవిభక్తికము కాన చోటు+ఇ+అందు కాగా, అచ్చిక 38చే సప్తమీ విభక్తికి 'అ' వచ్చి చోటు+ఇ+అ-కాగా ఇ+అ=అయి చోటు+అ=చోట అగును ఈ 'ట' అను అక్షరము వికల్పముగా సమాసములో లోపించగా అ+చోట=అచ్చోన్. వికల్పము కాన అచ్చోటన్. ఒకచోటన్, ఒకచోన్ అయినవి.

**సూ. 17. సమానాధికరణంబగు నుత్తర పదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డు వర్ణంబునకు లోపంబును, మీఁది హల్లునకు ద్విత్వంబునగు.**

మూఁడు జగములు _ ముజ్జగములు: మూఁడు లోకములు - ముల్లోకములు.

గు. ద్విగు సమాసమున మూడు+జగములు - అని యుండగా ముపర్ణలోపము మీది హల్లునకు ద్విత్వము రాగా—ముజ్జగములు, ఇట్లే ముల్లోకములు అను రూపములు సిద్ధించును.

సూ-18. ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు. మిశ్రంబునకుఁగాదు.

ముచ్చిచ్చు—ముక్కారు-ముప్పాతిక-ముత్తోవ—ముప్పేరు—ముద్విధములు.

గు. మూడు+చిచ్చులు = త్రేతాగ్ని-యిందు రెండు పదములును అచ్చ తెనుఁగు పదములేకాన ఏకవచనము వచ్చినది=ముచ్చిచ్చు. అట్లే మిగిలినవియు మూడు+విధములు-యిట విధములు అన్నది సంస్కృత సమమగుట మిశ్రసమాసము కాన దీనికి ఏకవచనము రాదే

సూ-19 కొండొకచో సమాసంబునందు నామ్యాది కనుమ్యాదుల ముపర్ణంబులు పణ్వర్ణంబులగు.

నాఁపచేను, పాఁపరేఁడు, కనుపపులు, జనపనార, నాము, పాము, ప్రేము, వేము, అమ్ము, ఎమ్ము- యివి నామ్యాదులు. కనుము, యినుము, ఉదుము, ఎనుము, జనుము, మినుము యిత్యాదులు కనుమ్యాదులు.

గు. నాము + ఆదులు = నామ్యాదులు = నాము మొదలైనవి. కనుము+ఆదులు=కనుమ్యాదులు. సమాసములో నామ్యాది కనుమ్యాదులకు పఙ్, ప వర్ణములు వచ్చును. పఙ్ నామ్యాది శబ్దముల ముపర్ణమున కాదేశముగారాఁగా జిత్తు బిందుపూర్వంబగునను సూత్రముచే పూర్వమున అర్ధబిందువురాగా నాము+చేను=నాఁపచేను అయినది. అట్లే పాము+రేఁడు=పాఁపరేఁడు. కనుము+పులు=కనుపపులు: జనుము+నార=జనపనార. ప్రేఁపచెత్తము, వేఁపకాయ, అంపపొది, యినుపబద్ది, మినపపప్పు-యిత్యాదులు.

**సూ. ౨౮ నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.**

నిక్కలం, కవ్వడి, పువ్విలుకాఁడు-ఇత్యాదులు.

గు. నిక్కల మన్నగు శబ్దములు వ్యాకరణసాధ్యములు కాకున్నం దున, మహాకవి ప్రయోగములలో ఉన్నందున, ప్రయోగములో ఉన్నరీతిగా గ్రహింపదగినవి. నిక్కము+కలం=నిక్కలం: కవ+వడి=కవ్వడి, పూవు+విలుకాడు=పువ్విలుకాఁడు. వీనిలో లోపద్విత్వాదులకనువగు సూత్రములు లేవు, అయినను సాధువులే.

**సూ. ౨౯. ఆకారంబున కామ్రేడితంబునకుం దర్థకంబున కయి, యాయియను శబ్దంబులు విభాషనగు.**

వక్ష్యమాణ విధిచేతనయియను దానికైకా రాదేశంబునగు: ఆయయి కాలము-ఆయాయి కాలము అయ్యయి కాలము-అయ్యాయి కాలము-ఆయై కాలము-అయ్యై కాలము-ఆయా కాలము-ఆయక్కాలము-అయ్యా కాలము-అయ్యక్కాలము.

గు. ద్విరుక్తము యొక్క పరరూపమున కామ్రేడితమని పేరు. రెండుసార్లు ఉచ్చరించబడినదానిలో రెండవదగు ఆకారమునకు అయి, అయి అనునవి వికల్పముగా వచ్చును. ఆ+ఆ+కాలము=ఆ+అయి=యడాగమము-ఆయయి-హ్రస్వద్విత్వములు రాగా-అయ్యయి: ఆ+ఆయి-యడాగమము రాగా-ఆయాయి: హ్రస్వద్విత్వము రాగా అయ్యాయి: అయికి ఐకారము రాగా-ఆయైకాలము — హ్రస్వద్విత్వములతో అయ్యై: అయి ఆయయి రాక యడాగమము వచ్చిన- ఆయా, యాకు హ్రస్వము కాకు ద్విత్వమురాగా-ఆయక్కాలము: అకుహ్రస్వము యాకుద్విత్వము రాగా - అయ్యాకాలము-దాని మీదయ్యాకు హ్రస్వము ద్విత్వము రాగా - అయ్యక్కాలము-అవి పది రూపములు వచ్చినవి.

**సూ. 22. బహువ్రీహిని సమాసాంతకార్యంబులు గానంబడియెడి.**

ముక్కంటి, కడలిరాచూలి, నలువ, గట్టు విలుతుఁడు.

గు. సమాసము చివరి పదమునకు కలుగు ఆదేశ, ఆగమలోపాదులు సమాసాంతకార్యములు. మూఁడు+కన్నులు, కలవాడు (శివుడు) అను నర్థములో ముక్కంటి అగుచున్నది. కన్నులు, లో న్ను కు 'ంటి' అన్నది సమాసాంతకార్యం. మూడు+కంటి, సమాస. 17చే కాకు ద్విత్వము రాగా, 13చే 'మూ'కుహ్రస్వమురాగా ముక్కంటి అయినది.

కడలిరాజు+చూలు (సముద్రుని కూతురు-లక్ష్మి) దీనిలో "ు"కు ఇకారము సమాసాంతకార్యము రాగా కడలిరాచూలి అయినది. నాలుగు+వాయిలు కలవాడు, (బ్రహ్మ)- దీనిలో వాయిలో యలోపము, వాకు హ్రస్వమురాగా, నలువ. గట్టు+విల్లుగా కలవాడు, శివుడు, లకారము ద్విత్వలోపము, తకారాగమము సమాసాంతకార్యము, గట్టు విల్తుఁడు అయినది.

**సూ-23. బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో మేనునకు బోఁడి యగు.**

అలరుబోఁడి, నవబోఁడి, పూబోఁడి, విరిబోఁడి.

గు. బహువ్రీహి సమాసమున స్త్రీ అర్థమగుచో 'మేను' శబ్దమునకు 'బోఁడి' అను శబ్దము సమాసాంతముగా ఆదేశమగును. అలరు+మేను (కలది-స్త్రీ) పువ్వువంటి శరీరము కలది, అలరుబోఁడి. ఇట్లేనవబోఁడి, ఇత్యాదులు.

**సూ-24. ద్వంద్వంబు నందు ఋకారంబునకు రవర్ణంబు విభాషనగు.**

మాత్రపితలు, మాతాపితలు- ఇత్యాదులు.

గు. సంస్కృత ద్వంద్వసమాసములో మొదటి పదము చివర ఋకారమున్నచో దానికి 'ర' వర్ణమాదేశమగును. మాతృ పితృ, 'తృ' లోని ఋకారమునకు 'ర' రాగా, మాత్రపితలు, అయినది. ఇది వికల్పము కావున, మాతాపితలు అగును.

**సూ. 25. సమాసవిభక్తికిలోపంబగు; బహుత్వమునకుఁ గాదు.**

రాముని బాణములు, సరసపువచనములు, వేవెలుఁగు, గుణముల ప్రోక.

గు. సమాసములో మొదటిపదము చివరనున్న విభక్తి ప్రత్యయములోపించును. లట్టు, అనగా బహువచనలకారము. దీనికి మాత్రము లోపమురాదు. రామునియొక్క బాణములు, యొక్క అనునది మొదటి పదము చివరనున్న విభక్తి ప్రత్యయము. దీనికి లోపమురాగా, రాముని బాణములు, అయినది. సరసములు+వచనములు, లోపించగా, మువర్ణమునకు పుంపులురాగా సరసంపు వచనములు. వేలు+వెల్గు, లుకిలోపము రాగా, వేవెలుగు. గుణముల యొక్కప్రోక, దీనిలో యొక్కలోపించును. కాని లకారము మాత్రములోపించదు. కనుక, గుణముల ప్రోక అయినది

**సూ.26. కర్మాదులకుఁ బ్రాధాన్య వివక్షయందు ధాతుజ విశేషణంబులు కర్తతోడం బోలెవాని తోడసమసించు.**

రాముఁడు రక్షించిన భృత్యుడు, రాముఁడు వాలినేసిన బాణము.
రాముఁడు గోవునిచ్చిన విప్రుఁడు. రాముఁడు వెడలిన వనంబు.
రాముఁడు వసించిన పర్ణగృహము, రాముఁడు వసించిన చోటు.

గు. ధాతుజ విశేషణములు సామాన్యముగా కర్తతో సమాసమగును

అట్లుగాక కర్మాదులకును ప్రాధాన్యము వివక్ష చేసినపుడు వానితోడను సమాసము పొందును.

1. భృత్యుని రక్షించిన రాముడు, ఇట్లు కర్త ప్రధానమైన చెప్పవగును. కాని కర్మకు ప్రాధాన్య వివక్షలో- రాముడు రక్షించిన భృత్యుడు, అని అయినది.

2. బాణముచే ఏసిన వాలి- అన్నది కరణమునకు ప్రాధాన్యము చెప్పగోరి- 2. రాముడు వాలినేసిన బాణము అని అయినది.

3. విప్రుని కొఱకు గోవునిచ్చిన రాముడు- అను దానిలో విప్రునకు ప్రాధాన్యము నిచ్చిన రాముడు గోవునిచ్చిన విప్రుడు అని అయినది.

4. వనము నుండి వెడలిన రాముడు అను దానికి బదులు. వనమునకు ప్రాధాన్యము నియ్యగా- రాముడు వెడలిన వనము అని అయినది.

5. పర్ణగృహమునందు వసించిన రాముడు, అన్నదానికిని పర్ణగృహమునకు ప్రాధాన్య వివక్షలో, రాముడు వసించిన పర్ణగృహము, అయినది. అట్లే రాముడు వసించినచోటు.

ఇది సమాస పరిచ్ఛేదము



# తద్ధిత పరిచ్ఛేదము

## సూ-1 తన వర్ణకంబు త్వార్థంబునందగు

త్వార్థంబనఁగా భావంబు ప్రకృతి జన్యబోధంబునం బ్రకారంబు భావంబు.

రాముని తనము, రాముతనము, మనుమని తనము, సీత తనము, గొప్ప తనము, కొంఱ తనము, వల్లఁదనము, పుల్లఁదనము.

సం. ప్రాతి పదికములకు భావాద్యర్థములందు కలుగు ప్రత్యయములకు తద్ధితములని పేరు. తద్ధితాంతములు ప్రాతి పదికములగును. అనగా తద్ధితాంతములపై విభక్తి ప్రత్యయములు చేరును.

సంస్కృతమున "తస్యభావస్త్వతలౌ" అను సూత్రముచే భావార్థమున"త్వ" ప్రత్యయము చేరును. భావమనగా ప్రకృతి జన్యబోధయందు ప్రకారము "మనుష్య" జ్ఞానమున, మనుష్యత్వము ప్రకారము, మనుష్య విశేష్యము. కనుక తజ్జన్య జ్ఞానమున ప్రకారము మనుష్యత్వము కనుక త్వార్థము భావమని స్ఫుటమైనది.

ఆ అర్థమున తెనుగున "తన" ప్రత్యయము చేరును. రాముని యొక్క+తనము = రాముని తనము. విగాగమలోపమురాగా, రాము తనము. ఇట్లే తక్కినవియు.

## సూ. 2. ఇట విశేషంబుత్సర్గంబునకు విభాషను బాధకంబగు

స్పష్టము.

గు. ఉత్సర్గమనగా సామాన్యవిధి. సామాన్యవిధికి విశేష విధి నిత్యముగా బాధకము. కాని ఈ పరిచ్ఛేదమున వికల్పముగా బాధకమని చెప్పినాడు. అందుచే టీకాదులు వచ్చు స్థలములందు వికల్పముగా తన వర్ణకమును వచ్చును.

**సూ-3. చిన్నాదులకు టీకవర్ణంబగు.**

చిన్నటీకము. కన్నెటీకము.

చిన్న, కన్నె, చుట్టము, దొంగ, పేద, మిండ, లంజె - ఇత్యాదులు చిన్నాదులు.

**సూ-4 ఉత్వంబున తత్వంబు టీకము పరంబగునపుడగు.**

తొత్తటీకము, పెద్దటీకము, పెజ్జటీకము.

గు. తొత్తు+టీకము=తొత్తులోని ఉకారమున తకారము రాగా తొత్తటీకము, పెద్దటీకము, పెజ్జ+టీకము ఇత్యాదులు.

**సూ-5. పేర్వాదులకిమివర్ణకంబగు.**

పేరిమి, కడిమి.

పేరు, కడు, మున్ను, మేలు, చెవి, పోఁడి, వాఁడి, వేఁడి ఇత్యాదులు పేర్వాదులు.

**సూ-6. నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు.**

నల్లన, తెల్లన

నల్ల, తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, చామ, తియ్య, కమ్మ్మ, పుల్ల, చప్ప, విన్న, తిన్న, అల్ల, ఒయ్య, తిమ్మ, చక్క, ప్రేఁక ఇత్యాదులు నల్లాదులు.

**సూ-7. ఇక వర్ణకం బగ్గలాదులకగు.**

అగ్గలిక, ఒమ్మిక—అగ్గలము, ఒమ్మ.

**సూ-8. మగఁటి మ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.**

మగఁటిమి, మగతనము, పేదఱిమి, ఒజ్జనము, కోడరము, కోడం ట్రము, కోడంట్రికము, కోడఱికము, కోమలికము, చెలికాఁడము, తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు.

ఱికాదులు రాని పక్షమంబునఁ దన ప్రత్యయంబన్నింటికగు.

చిన్నతనము, ముప్పఁదనము, వల్లదనము, అగ్గలంపుఁదనము, ఒజ్జతనము

గు. మగటిమి మున్నగునవి ప్రయోగములో ఉన్నట్లుగా గ్రహించవలెను. 2వ సూత్రములో చెప్పిన రీతిగా విశేషవిధి వికల్పముగా బాధకము కాన చిన్నరికము, చిన్నతనము— ఇత్యాదిగా అన్నిటికి రెండు రూపములు వచ్చును.

**సూ-9. అరమరాదులకు స్వార్థంబునం దిక వర్ణకంబగు.**

అరమరిక, అమిక.

అరమర, అము, అల్లిబిల్లి, గంపి, నడపడి, నాడు, బివ్వోరి, పొత్తి, మావ, మెలి, వాలు-ఇత్యాదు లరమరాదులు.

గు. స్వార్థంబనగా ప్రకృత్యర్థమే. అరమర=అరమరిక- ఈరెండును సమానార్థకములే. ఇట్లే నడపడి-నడపడిక ఇత్యాదులు.

**సూ-10. ఉక వర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునందగు.**

చిఱుతుక, నాతుక.

చిఱుత, నాతి, నెలఁత, మెలఁత, పడఁతి, మడఁతి, పొలఁతి, వెలఁది, నివ్వు, ఎమ్మె- ఇత్యాదులు చిఱుతాదులు.

గు. చిఱుతాదులకు స్వార్థమునందే 'ఉక' ప్రత్యయము చేరును. నెలత+ఉక=నెలయుక, పడఁతుక, వెలఁదుక, నివ్వుక- ఇత్యాదులు.

**సూ-11. కాక త్తియ వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదులకగు.**

కా ప్రత్యయాంతంబునకు మగాదిగణగణపఠనంబునంజేసి డుజ్ఞగు. ఆటకాఁడు, ఆటకత్తియ.

ఆట, అడపము, ఎమ్మె, ఓయారము, కటారి, కొల్లి, చెలిమి, చేరువ, చొరవ, జట్టి, జాజర, జూదము, లిండి, తేర, దొద్ద,నీఱు,నేస్తము, బేరము, పగ, విల, వెచ్చము సొగసు ఇత్యాదు లాటాదులు.

గు. అచ్ఛిక పరిచ్ఛేదము 4వ సూత్రమున మగాదులకు డుజ్ఞ వచ్చునని యున్నది. మగాది గణములో కా ప్రత్యయాంతములు. ఈ ప్రత్యయాంతములను (15 సూ )చే చెప్పబడినవి కాన ప్రత్యయము చేరిన మీదట డు వచ్చును. ఆట+కా+డు=ఆటకాడు, ఆట+కత్తియ= ఆటకత్తియ. కలవాడు అను నర్థము పురుష వాచకముగా 'కా'ప్రత్యయము, స్త్రీబోధకముగా కత్తియ ప్రత్యయము చేరును.

**సూ-12. కాక త్తియల కకారంబునకు గకారంబు కొండొకచో గానంబడియెడి.**

అందగాఁడు, అందగత్తియ, కొండెగాఁడు, కొండెగత్తియ, బేరగాఁడు, బేరగత్తియ-ఇత్యాదులు.

గు. కాకత్తియ ప్రత్యయములలోని కకారమునకు గకారము రాగా అందగాఁడు – అందగత్తియ మున్నగు రూపములు వచ్చును. కొండొకచో అనుటచే కొన్ని పదములకు మాత్రమే అట్టి రూపము లున్నవి.

**సూ-13. కాక త్తియలు కొండొక వానికి స్వార్థంబునం జూపట్టెడు.**

చెలికాఁడు, చెలికత్తియ, హెగ్గడికాఁడు, హెగ్గడికత్తియ.

గు. కొన్ని శబ్దములకు స్వార్థములోనే కాకత్తియ ప్రత్యయములు వచ్చినవి. చెలి=చెలికాడు. ఇవి మతుబర్థమునగాక స్వార్థముననే వచ్చినవి.

**సూ-14. కావర్ధకంబు తిర్యక్కులకుం గానంబడియెడి.**

ఇద్పుంపిగాఁడు, ఒంటిగాఁడు, కొమ్ముకాఁడు, పరికాఁడు- ఇత్యాదులు మృగవిశేష వాచకంబులు.

గు. తిర్యక్కులు=పసువులు, పక్షులు. వాటిని చెప్పు పదములలోను కాప్రత్యయాంత శబ్దములున్నవి, కయిగాపలలో కాప్రత్యయము ఉన్నందున దీనిపై డుక్ వచ్చినది (అచ్చిక 4).

**సూ-15. అటమటాదులకు మతుబర్థంబునందీవర్ణకంబు పుంస్త్వంబునందగు.**

ఈ ప్రత్యయాంతంబు మగాది గణంబు. అటమటీఁడు, కమ్మతీఁడు, అటమటము, కమ్మతము, కన్నడము, కొంచెము, బాసనము, బూటకము, మందడి, మన్నెము, సుంకము.

ఉక్కువంబునకు వలోపంబు—ఉక్కీఁడు యిత్యాదులు.

గు. అటమట మున్నవానికి కలవి అను అర్థమున పురుషవాచక మైనపుడు 'ఈ' ప్రత్యయము వచ్చును. ఈ ప్రత్యయము మగాది గణము లోనిది. కాన డుక్ చేరును అటమటము + ఈ + డు = అటమటీడు ఇత్యాది.

**సూ-16. ఈ ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబు నందగు.**

మొక్కలీఁడు, కల్లరీఁడు.

సూ- 17. అరి వర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు.

జాలరి, ఒలుసరి.

జాల, ఒలుపు, కల్ల, చసవు, జూదము, టక్కు, తగవు, తిరుపు. తెంపు, తెరువు, నేరుపు, మతకము, వెరవు, వేట, సిగ్గు, సుంకము యిత్యాదులు.

గు. జాల మున్నగు పదములకు కలవాడు-కలది అను నర్థమున "అరి" ప్రత్యయము చేరును. జాల + అరి = జాలరి - ఇట్లే తక్కినవియు

సూ- 18. ఇవర్ణకంబోయారాదులకు మతుబర్థంబు నందగు

ఓయారి, అక్కసి.

ఓయారము, అక్కసము, కరలు, వాగము, జోగము, మతకము, తుటారము, బండారము, బిత్తరము, బిటారము, బేహారము, మచ్చరము, మిటారము, విన్నాణము, వెక్కసము-ఇత్యాదులు.

గు. ఓయారము మున్నగు పదములకు "ఇ" ప్రత్యయము కలవాడను అర్థమున చేరును ఓయారి = ఒయ్యారము కలది.

సూ-19. తవర్ణకంబు కుల వాచకంబునకు స్త్రీవాచ్యం బగునపుడు మతుబర్థంబునందగు.

కొలువత, చాకిత.

కొలువ, చాకి, బోయ, వాలె, వ్రే, సాలె- ఇత్యాదులు కులవాచకంబులు.

గు. కులవాచకమైన పదమునకు స్త్రీ చెప్పబడునపుడు కలది అను నర్థమున "త" అను ప్రత్యయము వచ్చును చాకి+త=చాకిత, బోయత ఇత్యాదులు.

**సూ-20. తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు.**

చెంచెత, మాతెత

**సూ-21. యువతివిటరజన్యలబు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదురు.**

స్పష్టము.
గు. గుబ్బెత = యువతి, మిండత = విటి, ముట్టుత=రజన్వల.

**సూ-22. వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీ వాచ్యంబగునపుడు మత్వర్థంబునం దాడి వర్ణకంబగు.**

వ గ లా డి
వగ, చిన్నె, కులుకు, వన్నె, దొమ్మి, ఎమ్మె,-ఇత్యాదులు వగాదులు
గు. బహువచనములో ఉన్న వగ మున్నగు పదములకు స్త్రీ అర్థమైనచో కలది అను అర్థమున "ఆడి" అను ప్రత్యయము వచ్చును. వగలు + ఆడి = వగలాడి = వగలుకలస్త్రీ. చిన్నెలాడి, కులుకులాడి- అన్నియు ఇట్లే.

**సూ. 23 వగాదులకు బహువచనాంతంబులకుఁ బుస్త్వంబున మతుబర్థంబా కారంబగు**

ఆ ప్రత్యయాంతంబు మగాదిగణంబు. వగలాఁడు, చిన్నెలాఁడు.
గు. బహువచనమున ఉన్నవగమున్నగు శబ్దములకు కలవాడు అను అర్థమున పురుషుడు చెప్పబడినచో "ఆ" కారముచేరును. ఇది మగాదిగణములోనిది కాన డుఙ్ చెరును. వగలు + ఆ + డు = వగలాఁడు. వగలు కలవాడు. ఇట్లే చిన్నెలాఁడు మున్నగునవి.

**సూ. 24. ముక్కులో నగువానికిం దదభావద్యోతకంబయి మతు బర్థంబునం డిఁడి వర్ణక బగు.**

ముక్కిఁడి = ముక్కు లేనివాఁడని యర్థము.

ముక్కు, వాలు, వెరవు, సిగ్గు, ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది.

గు. ముక్కు మున్నగు శబ్దములకు లేనివాడు అను అర్థమున "ఇఁడి" ప్రత్యయము చేరును. ముక్కు+ఇఁడి=ముక్కిఁడి.

**సూ. 25. మానార్థంబున నేకత్వంబునం దెఁడు వర్ణకంబగు.**

తూమెఁడు, ముంతెఁడు, ఎత్తెఁడు, వీసెఁడు, జేనెఁడు, మూరెఁడు, కుందెఁడు, గంపెఁడు.

గు. ఇంత పరిమాణము అను అర్థమున ఏకవచన శబ్దము మీఁద 'ఎఁడు' అను ప్రత్యయము చేరును. తూము + ఎఁడు = తూమెఁడు వీసె + ఎఁడు = వీసెఁడు; ఇట్లే తక్కినవి.

**సూ. 26. ఎఁడు వర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబు లోపించు.**

కమికెఁడు, కొడిపెఁడు, దోసెఁడు, పిడికెఁడు, పుడిసెడు, నందెఁడు.

గు. ఎఁడు ప్రత్యయము పరమైనపుడు శబ్దములో చివరనున్న 'లి' అను అక్షరము లోపించును. కమికిలి + ఎఁడు = కమికెఁడు. కొడిపిలి, దోసిలి, పిడికిలి, పుడిసిలి, నందిలి-వీటికి పై రూపములు వచ్చును.

**సూ. 27. దఘ్నార్థంబున బంటి, కొలందులగు.**

మోఁకాలిబంటి, మోకాలికొలఁది, ఱొమ్ముబంటి, ఱొమ్ముకొలఁది.

గు. ఇంతలోతు- అను అర్థములో "బంటి-కొలఁది" అను ప్రత్యయములు వచ్చును. మోకాలిబంటి, మోకాలికొలఁది = మోకాలితో లోతు (నీరు) అని అర్థము. మొలబంటి, కుత్తుకబంటి-ఇత్యాదులు.

**సూ-28. అర్థ విశేషంబుల వర్ణకాంతరంబులు మహత్ప్రయోగంబుల నెఱుంగునది**

మంటమారి, తిండిపోతు-తాచ్ఛీల్యంబునఁ మారి, పోతు వర్ణకంబులు.

అడప=తాంబూలకరండవాహి: మతుబర్థంబునం దప్రత్యయంబు.

పెండ్లము = ఊఢ: పెండ్లి శబ్దంబునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు : ఇత్యాదులూహ్యంబులు.

కొన్నికొన్ని అర్థములలో కొన్నికొన్ని ప్రత్యయములు చేరిన రూపములు మహాకవి ప్రయోగముల ద్వారా తెలియవలెను. కొన్నిటిని చూపుచున్నారు. తాచ్ఛీల్యంబునన్ = అట్టి శీలము కల — అను నర్థమున మారి, పోతు — అను ప్రత్యయములు రాగా — మంట మారి = మండు స్వభావముకలది, తిండిపోతు—తిను శీలము కలవాడు; అడపము=తాంబూలములుంచు పెట్టెము కలవాడు —అను నర్థమున — అకారము చేరగా - అడపము + అ = మువర్ణలోపము రాగా—అడప, కలది ‹అను నర్థమున "అము" ప్రత్యయము చేరగా—పెండ్లి + అము = పెండ్లము = పెండ్లి చేసికొనబడినది. ఇట్టివి మహాకవి ప్రయోగములలో ఉన్నవి తెలియదగినవి.

ఇది తద్ధిత పరిచ్ఛేదము



# క్రియా పరిచ్ఛేదము

## సూ-1. ధాతువునకు.

ఇది యధికార సూత్రంబు. యింకనెయ్యదియు ప్రక్రమింపంబడు నయ్యది ధాతువున కని యెఱుంగునది.

గు. అధికార సూత్రమనగా-తరువాతి సూత్రములతో కలిసి అర్థమిచ్చునది. తరువాతి సూత్రములకు "ధాతువునకు" అన్నది అనువర్తించును.

## సూ- 2. వర్తమానంబునలట్టగు.

వర్తమాన క్రియా వృత్తియగు ధాతువునకు లడ్వ్యర్ణకంబగు. వర్తమానంబనాప్రారబ్ధాపరిసమాప్తంబు. అప్పటికి ముగియకుండునది.

గు. సంస్కృతమున పది లకారములున్నవి - లట్, లిట్, లుట్, లృట్, లేట్, లోట్, లఙ్,లిఙ్, లుఙ్, లృఙ్-అనునవి. అందులో సూరి-లట్, లిట్, లృట్టులను వర్తమాన, భూత, భావికాలత్రయమును బోధించుటకై తీసికొని, తక్కిన లకారములను మాని, లాట్టు లూట్టు, లఙ్ అను మరి మూడింటిని కల్పించెను.

అందు వర్తమాన కాలమును బోధించునపుడు ధాతువునకు లట్టు అగును. ప్రారంభించబడి, అప్పటికి ముగియక ఉన్నది వర్తమాన మనబడును.

## సూ. 3, భూతంబున లిట్టగు.

భూతక్రియ వృత్తియగు ధాతువునకు లిడ్వ్యర్ణకంబగు.

భూతంబనా విద్యమానధ్వంస ప్రతియోగి : మున్నుండియిప్పటికి లేకుండునది.

గు. భూతకాలమును బోధించు ధాతువునకు లిట్టు వచ్చును. భూతమనగా యిప్పుడు ధ్వంసమైనది. దేని ధ్వంస చెప్పుదుమో అది దానికి

ప్రతియోగి అగును. కృత యుగముండెను. యిప్పుడు కృతయుగధ్వంసన ఉన్నది. కాన కృత యుగము ధ్వంసనకు ప్రతియోగియగునన్న. పూ ముండి, యిప్పుడు లేనిది-అని యర్థము.

**సూ. ౪. భావి నిల్పట్టగు.**

భావిక్రియా వృత్తియగు ధాతువునకు ల్పట్వర్ణకంబగు.

భావినా విద్యమాన ప్రాగభావ ప్రతియోగి. అప్పటికిఁ బుట్టియుండు నది.

గు. ప్రాగభావము వస్తువు పుట్టకమును పుండునది కనుక యిప్పు డున్న ప్రాగభావ ప్రతియోగి-యికమీద పుట్టబోవునది.

వానికి కొడుకు పుట్టగలడు. యిప్పుడు పుట్టుకయొక్క ప్రాగభావ మున్నది. దాని ప్రతియోగి పుట్టుక. కనుక అది భవిష్యత్తు.

**సూ-౫. తద్ధర్మాదులందు లాట్టగు.**

తద్ధర్మాది క్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు.

తచ్ఛీల సంభావనా సంప్రశ్నసాతత్య వర్తమాన భావ్యాశీరాదులాది పదగ్రాహ్యంబులు.

గు. తచ్ఛీలము=ఆ స్వభావము, సంభావన=ఊహించుట:సంప్రశ్న= ప్రశ్న: సాతత్యము = సతతము జరుగుచుండుట: వర్తమానము, భావి: ఆశీరాదులు = ఆశీర్వచనము మున్నగునవి పేటిని బోధించునపుడు ధాతువునకు లాట్టు వచ్చును.

**సూ-౬. ఆశీశ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు.**

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు.

గు. ఆశీః=దీవన: శాప=తిట్టు: సంప్రార్థన = ప్రార్థించుట: విధి = విధించుట-ఈ యర్థములందు లూట్టు చేరును.

**సూ-7. వ్యతిరేకంబున లఁటియగు.**

వ్యతిరేక విశిష్ట క్రియావృత్తియగు ధాతువునకు లఁటివర్ణకంబగు.
గు. వ్యతిరేకమును బోధించునపుడు "లఁటి" అగును.

సూ-8 లకారంబునకు 'డు' ప్రత్యయముఖ్యాగు.

లడాదిలకారంబుల [illegible] కీ డుజాదులాదేశంబులగు.
ఇందు ఇకారంబు ప్రత్యాహారార్థంబు.

గు. ము ఇ-అనునపుడు ఇకారము ప్రత్యాహారమునకై చెప్పబడి నది. ప్రత్యాహారమనగా మొదటి అక్షరము చివరి అక్షరము కలిసిన మధ్య నున్న వాటికి, తనకును సంజ్ఞయగును. డు ఇ అనగా "డు, రు, వు, రు, ను ము" అను ఆరును చెప్పబడును.

**సూ-9 అందు వరుసను రెండేసి ప్రథమ మధ్యమోత్తమంబులనంబడు.**

డు ఇ,రు-ప్రథమము: వు, రు-మధ్యమము: ను, ము- ఉత్తమము.
గు. ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుషల మూడిటికి రెండేసి ప్రత్యయములు.

**సూ-10. వీనిలో రుములు బహువచనంబులు; పెఱలే కవచనంబులు.**

డు ఇ, వు, ను — ఏకవచనములు; రు, రా, ము: బహువచ నములు.

**సూ-11. నామ, యుష్మదస్మ దర్థంబు లందుం బ్రథమ మధ్య మోత్తమంబులగు.**

గు. యుష్మత్ = నీవు, మీరు: అస్మత్ = నేను, మేము: నామ = ఆ రెండుతప్ప మిగిలిన నామములు ఎక్కడెక్కడో ప్రథమ, ఎవరు మధ్యమ, ఎన్నుత్తమ — అని నేను, మేము కర్తలైనపుడు ఉత్తమ పురుష, నీవు, మీరు కర్తలైనపుడు మధ్యమ పురుష, ఈ రెండును కాక తక్కినవి కర్తలైనపుడు ప్రథమ పురుషయు వాడనగును.

**సూ-12. అమహదర్థంబునందు దు ఱలకుదువులగు, నున్నాను బంధంబు మీఁద దివియగు.**

గు. స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులను వాని విశేషణంబులు మహత్తు లనబడును. తిర్యక్కు-లనగా పశుపక్ష్యాదులు. స్త్రీ వాచకములు మహతీ వాచకములు. తిర్యగ్జడములు-అమహత్తులు. తెనుగున పుంలింగ, స్త్రీలింగ, నపుంసక లింగ విభాగము లేదు. దానిస్థానే వాచక భేదమున్నది.

అమహత్తు కర్తయైనపుడు డు-రు లకు దు-వు లగును చెప్పబోవు ఉన్నాను బంధము మీద దు-రు లకు ది-వి అగును.

స్త్రీ వాచకములు కర్తలైనపుడు - అచ్చిక 26. సర్వనామ క్రియా పదంబుల బహువచనంబు మహత్తునకు బోలె మహతికగు— అని బహు వచనమున మహద్వాచకమునకు వలెనే మహతీ వాచకమునకును క్రియా పదములగును. రుక్మిణి పాడఁగలదు - రుక్మిణీ సత్యభామలు పాడగలరు. చిలుక ఉన్నది-చిలుకలు ఉన్నవి.

**సూ-13. ఉదంతంబునకు లట్టుపరంబగునపుడున్నాను బంధంబగు. ఉదంతంబయిన ధాతువునకు లట్టు పరంబగు నపుడు 'ఉన్న' అను శబ్దం బను ప్రయుక్తంబగు'**

గు. ఉకారాంతమైన ధాతువునకు లట్టు పరముకాగా 'ఉన్న' అను పదము అనుప్రయుక్తమగును.

**సూ-14. ఉన్న శబ్దంబు పరంబగునపుడు చువర్ణ కంబగు.**

గు. 'ఉన్న' అనునది పరమైనపుడు 'చు' అను ప్రత్యయము చేరును ఇది అర్థరహితమైన 'చు' వర్ణకము మరొకటి శత్రర్థక చువర్ణ కము. 'చున్' అన్నది అది వర్తమానార్థకము.

**సూ-15. దివితరంబగు డుఞ పరంబగునపు డున్నాను బంధంబునకు దీర్ఘంబగు.**

ప్రథమము : వాఁడు వండుచున్నాఁడు, వారు వండుచున్నారు.

మధ్యమము : నీవు వండుచున్నావు, మీరు వండుచున్నారు.

ఉత్తమము : నేను వండుచున్నాను, మేము వండుచున్నాము.

గు. వండు-ధాతువు 13చే 'ఉన్న' అనుబంధము, 14చే చువర్ణకము. లట్టు ప్రథమైక వచనమున- డుఙ- 15చే ఉన్న దీర్ఘమురాగా వండు+చు+ఉన్నా+డు=వండుచున్నాఁడు. ఇట్లే తక్కిన రూపములును.

సూ-16 లిఙ్లాట్టుల డుఙ్ఞునకెను, నువర్ణంబులగు.

లిఙాదేశంబగు డుఙ్ఞునకు ఎను అనునదియు, లాడాదేశంబగు డుఙ్ఞునకు ను అనునదియు నాదేశంబగు.

గు. భూతకాలమున- లిట్టు- 'డు'కు- ఎను రాగా- వండు+ఎను= వండెను. తద్ధర్మ కాలంబున-లాట్టున- 'డు'కు-ను రాగా_ వండును.

సూ-17. భూతంబున నిగాగమంబగు.

భూతార్థ వృత్తియగు ధాతువున కిగాగమంబగు.

సూ-18. లిట్టువుఙ పరంబగునపుడు తివర్ణకంబగు.

ఇకారంబు మీఁది కనును క్రియా విభక్తుల- యను సూత్రముచే రుఙన కిత్వంబు.

ప్ర-వండెను, వండిరి. మ—వండితివి, వండితిరి.

ఉ—వండితిని, వండితిమి.

గు. వుఙ=వుచనము—ల వండు+రు 17చే ఇగాగమమురాగా వండి+రు=ఇకారంబు మీది కనునె క్రియా విభక్తుల యుత్వంబున కిత్వంబగు-నను సూత్రముచే యికారము మీదిది కావ వండి+ి=వండిరి. వండి+వు=వండి+ఇ, 18చే తివర్ణకమురాగా వండి+తి+వి=వండితివి. యిట్లే తక్కినవి.

సూ-.౧౯. కలజ్యనుబంధంబు ల్పట్టు పరంబగునపుడగు.

ల్పట్టు పరంబగునపుడు ధాతువునకు కలజీ అనునది అను ప్రయుక్తంబగు.

సూ-.౨౦. జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు.

జీత్తు పరంబగునపుడు ధాతువు నుత్వంబున కత్వంబగు.

గు. ధాతువునకు భవిష్యదర్థమున ల్పట్టురాగా, ల్పట్టు పరమగు నపుడు కలజీ చేరును. వందు+కల- 20చే ఉకారమున కకారమురాగా వందఁగలఁడు. జీత్తు అనగా జీ అన్నది ఇత్తుగా కలది. కలజ అట్టిదే.

సూ-2 . కలజీ పదుజులు పరంభులగునపుడు నుగాగమంబగు.

ప్రథమకార్యంబు.

ప్ర. వందఁగలఁడు- వందఁగలరు, వందఁగలదు, వందఁగలరు.

మ వందఁగలవు, వందఁగలరు.

ఉ. వందఁగలను, వందఁగలము.

గు. వంద+కల+ను-21చే నుగాగమమురాగా వందన్+కలఁడు =సంధి 16, 17 సూత్రములచే ద్రుతమునకు బిందువు, పరకమురాగా వందఁగలడు-యిత్యాది రూపము లేర్పడును.

సూ-౨2. లాట్టు రుజ పరంబగునపుడు ముగాగమంబగు.

ప్ర. వందుము, వందుమరు.

మ. వందుమువు, వందుమురు.

ఉ. వందుమను, వందుమము.

లాదర్థంబులయందో లినువాహరణంబులు వక్కాణించెద.

తద్ధర్మంబు— కులాలుఁడు కొండకుండవానును.

తచ్ఛీలంబు- జ్వలన జ్వాలంబు లుప్పరం బెగయును.

సంభావన- ఇపుడు వాఁడింట నుండును.

సంప్రశ్నము- ఉండునా? పోదునా? సాతత్యము- సర్వంబు నందీశ్వరుఁడుండును; సర్వంబీశ్వరుని యందుండును. వర్తమానంబు-మేనవిప్పు డుంబుల కలుపెదమెదును.

వక్ష్యమాణ విధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునందెతుగాద్యాగమంబులగు. భావి—వాఁడు తేపు వచ్చును. ఆశీస్సు:- శుభంబగును. వచ్యర్థంబుల శాకానొకచో భూతంబున లాట్టు గానంబడియెదును. "ధవళాయత లోచన వానికిట్లనున్" (అనున్=అనెను) మను. 2-49.

గు. లాట్టు పరమైన- తద్ధర్మ కాలమున_

వందు+ను=వందును. వందు+రు — 22చే దుగాగమము రాగా వందుదురు. ఇట్లే తక్కినవి. తద్ధర్మకాల మెన్నిరీతుల వాడబడునో వివరింపబడినది.

**సూ-21. లాట్టు రుఞ పరంబగునపుడెదగాగమంబును, ప్రథమ నువర్ణకంబు పరంబగునపు డెదుగెడిగాగమంబులు బహుళంబుగానగు.**

ప్ర. వందెదును; వందెదిని, వందెదరు.

మ. వందెదవు, వందెదరు.

ఉ. వందెదను, వందెదము.

గు. వందు+ను- దీనిచే ఎదు, ఎడి, అగమములురాగా-వందెదును. ఇకారంబు కునువు క్రియా విభక్తుల సూత్రముచే- వందెడి+ను=వందెడిని, రుఞ = రు,వు,రు,ను,ము-లు ఎదగాగమములురాగా - వందు+ఎద+రు= వందెదరు. ఇట్లే తక్కినవి.

**సూ. 24. లిఙ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు.**

వండితి, వండితివి, వండిమ, వండిమివు, వండెమ, వండెదవు.

గు. లిట్టు-లాట్టులలోని వకారమునకు లోపము వికల్పముగానగును. లోపించగా- వండితి: కాని పక్షమున- వండితివి. అట్లే వండుమ- లోపము వచ్చినది. వండుదువు_ లోపముకాని రూపము

**సూ-25. తిర్యగ్జడంబులు వాచ్యంబులగునపుడు లిఙ్లాట్టుల ప్రథమ బహువచనంబున కేకవచనంబగు.**

చిలుకలు పలికెను: చిలుకలు పలుకును. చిలుకలు పలికెదును.

మేఘములు గర్జిల్లెను. మేఘములు గర్జిల్లును: మేఘములు గర్జిల్లు దును.

గు. తిర్యక్కులు, జడములును కర్తలైనపుడు లిట్టు, లాట్టులలోని ప్రథమ పురుష బహువచనమునకు మారుగా ఏకవచనమగును.

చిలుకలు పలికినవి - అనుటకు బదులు పలికెను. మేఘములు జడ ములు కాన ఇటను కూడ గర్జిల్లినవికి మారుగా గర్జిల్లెను — అని ఏక వచనము వచ్చినది.

**సూ-26. లూట్టుడు ఞనకెదు తవర్ణంబులు ద్రుతాం తంబులగు.**

ఆశీస్సు : మీకు మేలు గలిగెదును. మీకు మేలుగలుగుతను

శాపంబు : మీకు రాక్షసత్వంబు గలిగెదును: మీకు రాక్షసత్వంబు గలుగుతను.

సంప్రార్థనంబు హరినను గృపఁగాంచెదును. హరినను గృపఁ గాంచుతను.

గు. లూట్టులో దు ఙ్ఞనకు ద్రుతాంతములైన "ఎడున్, తన్" అన్నవి అగును.

కలుగు + ఎడున్ = కలిగెడున్. కాంచు + తన్ = కాంచుతను. ఇత్యాది.

**సూ- విధియందు లూట్టునకు మాఱుగా నదియను తచ్ఛబ్దంబును. ముందు నుగాగమంబునగు.**

మైత్రుండు నా నిర్దిష్ట కార్యంబు చేయునది.

వీనికి నీవు బాసట యయి యుండునది

గు. విధిలో లూట్టునకు బదులు "అది" అను పదము వానికి ముందుగా నుగాగము వచ్చును. చేయు + న్ + అది = చేయునది. మొదటిది ప్రథమ పురుష, రెండవది మధ్యమ పురుష. విధి ఉత్తమ పురుషలో ఉండదు. కాన ఉదాహరణమియ్య లేదు. బాసట=సహాయము

**సూ-28 ఎడుతల ద్రుతంబున కచ్చుపరంబగునపుడు మకారంబగు.**

నీకు మేలుగలిగెడు మనిమెను. నీకు మేలు గలుగుత మనిమెను

గు. కలిగెడున్ + అనిమె = ద్రుతమునకు అచ్చు పరమైనది కాన, నకారమునకు మకారమాదేశమైనది-కలిగెడు మనియెను.

**సూ-29 లూణ్మధ్యమపురుషలకు ముడు ఙ్లగు.**

ఆశీస్సు. దీర్ఘాయువగుము. దీర్ఘాయులరగుఁడు.

శాపంబు : రాక్షసుఁడ వగుము. రాక్షసులరగుఁడు.

సంప్రార్థనంబు : నన్ను రక్షింపుము. నన్ను రక్షింపుఁడు.

విధి : నా చెప్పిన పని చేయుము నా చెప్పిన పనిచేయుఁడు.

గు. లూట్టులోని మధ్యమ పురుషలోని పుర-లకు ము-డు అగును

అగు + వు - కి మారగా = అగుము: అగు + ము - కి బదులు డు - అగుడు.

విధి:- నా చెప్పిన పనిచేయునది అని వికల్పమున వచ్చును

**సూ-30. ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు.**

మనము వందుదము:

జిత్తు పరంబగునపు దుత్వంబున కత్వంబను సూత్రముచే లజి పరంబగునపు దత్వంబు.

ప్ర : వందఁడు, వందరు : వందదు, వందరు.

మ: వందవు, వందరు.

ఉ: వందను, వందము.

గు. ఉభయ ప్రార్థనమనగా నీవు+నేను=మనము ఉభయులము కర్తగా కల్గిన ప్రార్థన దీనిలో దుగాగమమును, వానికి ఉకారమున కకారమును అగును

వందు+దు+ము=వందుదము.

లజిలో- వందు+దు=ఉత్వమున కత్వమురాగా వందఁడు. ఆమె వందను, వారు వందరు ఇత్యాది.

**సూ-31. మధ్యమము దుజ్జులు ముజ్జునాఁబడు.**

గు. మధ్యమ పురుషలో వచ్చు ము దు — అను వాటికి ముజ్జు అని పేరు.

**సూ-32 వ్యతిరేకంబున ముజ్జు పరంబగునపుడు కుజియగు**

నీవు వందకుము, మీరు వందకుఁడు.

గు. వ్యతిరేకార్థమున మధ్యమ పురుష ఏకవచన బహువచనము లలో ము-దులు పరమైనపుడు 'కు' వచ్చును. కుజ జిత్తు కాన ఉకారము కారమగును.

వండు+కు+ము=వండకుము. అట్లేవండు+కు+డు=వండకుఁడు.

సూ. . సం ప్రార్థనంబుల ముజ్ఞున కదాదులు విభాష వను ప్రయుక్తంబులగు

వండుము, పండుము, పండుము, పండుమీ, పండుఁడ, పండుఁడ, పండుఁడి, పండుఁడీ.

అ ఆ ఇ ఈ ఎ ఏ ఒ ఓ అమ్మ అయ్య ఇత్యాదు లదాదులు.

గు. సంప్రార్థనలో ము డు లకు అదాదులు వికల్పముగా వచ్చును.

వండుము+అ=వండుమ: వండుఁడు+ఇ=వండుఁడి యిత్యాదులు.

సూ. 4 విదాదులను ప్రయుక్తంబులగునపుడు ముజ్ఞ నకు వుజీ రుజీ లగు.

వినవె, వినవే, వినరె, వినరే, వినకువె, వినకువే, వినకురె, వినకురే.

గు. విదాదులు=ఎ ఏ లు అనుప్రయుక్తములగునపుడు ము-డు లకు వరుసగా వు-రు లు వచ్చును అవి జీత్తులు కాన ఏకారమున కకారమగును. విను+ము- ఉండగా- ము-కి వు రాగా విను+వు రాగా ఉత్వమున కత్వము రాగా వినవు+ఎ=వినవె. విను+కు+వు+ఎ = (32వ సూత్రముచే కుక్ వచ్చును) ఉత్వమున కత్వము- వినకువె ఇత్యాది

సూ. 5. టువర్ణకంబు భావంబునం దగు

భావంబనఁగా ధాత్వర్థంబు.

వండుట, పండుట. వినుట, కనుట.

గు. ధాతువు యొక్క అర్థమే భావము. దానియందు ధాతువునకు 'ట' ప్రత్యయము వచ్చును. వండు+ట=వండుట తక్కినవియు నిట్లే,

సూ. 6 . కజీ వర్ణకంబు పూర్వార్థ యోగంబున విభాషను భావంబునందగు.

వండకమునుపు, వండుటకు మునుపు, చేయక మునుపు, చేయుటకు మునుపు. మునుపు, ముందు, మున్ను, తొల్లి.

గు. మునుపు అను అర్థము కల శబ్దములతో సంబంధమున్నప్పుడు భావంబున 'క' ప్రత్యయము వచ్చును. వండు+ట-లో టాకు బదులు 'క' రాగా వండు+క-కటి జీత్తు కనుక ఉకారమున కకారము రాగా వండక మునుపు అయినది. మునుపు మున్నగు శబ్దముల సంబంధము లేకున్ననాక వచ్చిన రూపములు కనబడుచున్నవి - చేయక తప్పదు, రాక తీఱదు ఇత్యాదులు.

సూ-37. వ్యతిరేక భావంబున మిఁజియగు.

వ్యతిరేక విశిష్ట క్రియాభిధాయి ధాతువునకు మిఁజియగు

వండమి, వండమి.

గు. వ్యతిరేక భావార్థమున ధాతువునకు 'మి' చేరును. వండు+మి= వండమి. మిటి జీత్తు కాన ఉత్వమున కత్వము వచ్చును.

సూ-38. సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకంబగు.

ఏకాశ్రయంబులగు క్రియలలో నెయ్యది పూర్వకాలికంబగుందద్వాచి యగు ధాతువున కివర్ణకంబగు. ఇది యెక్త్వార్థంబునాఁబడు.

వండి, వండి, విని, కని.

సమాన కర్తృకంబుల కనసమానాశ్రయంబులనుటంజేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడి, నిత్యాది సిద్ధంబయ్యె.

గు. కర్తకాని కర్మకాని ఒకే ఆశ్రయము కల రెండు క్రియలలో ఏది ముందయ్యెనో దానికి 'ఇ' కారము వచ్చును. అతఁడు అన్నము వండి, భుజించెను. ఇందువండు, భుజించు- అనునవి రెండు క్రియలు. అందు ముందైనది వండుట కనుక దానికి ఇకారము చేరగా వండు+ఇ= వండి అయినది.

సమాన కర్తృకము అనగా ఒకే కర్త కలవి. అట్లు చెప్పిన 'చైత్రునిచే కొట్టబడి మైత్రుడు మడిసె' అను వాక్యమున కొట్టబడి- అను రూపమురాదు కొట్టబడుటకు కర్త చైత్రుడు మడియుటకు కర్త మైత్రుడు. కావ అట్టి రూపములు సాధించుటకై సమానాశ్రయంబులైన— అనెను. ఇప్పుడు కొట్టబడినవారు, మడిసినవాడును మైత్రుడుకాన సరిపోయినది. ఇది యే క్త్వార్థకము.

సూ-39. కజీ వ్యతిరేక క్త్వార్థంబునం దగు.

వండక, పండక, కొట్టక, తిట్టక.

గు వ్యతిరేకమైన క్త్వార్థములో ధాతువునకు 'క' చేరును. ఇది కిత్తుకాన ఉత్వమున కత్వము వచ్చును. వండు+క=వండక ఇత్యాది.

సూ-40. తుమర్థ భావలక్షణంబు లందు నుజీయగు.

భావ లక్షణం బనఁగా వన్యక్రియకు లక్షణ భూతంబగు క్రియ. తుమర్థంబు నందును భావలక్షణంబునందును ధాతువునకు నువర్ణకంబగు.

తుమర్థంబు — చైత్రుండు వండను బోయెను పాకక్రియార్థము పోయెనని యర్థము.

భావలక్షణము : చైత్రుండు వండ నతిపి వచ్చెను. ఇచట వంట లక్షణము, వచ్చుట లక్ష్యము.

గు. తుమర్థమనగా సంస్కృతమున 'తుం' ప్రత్యయము వచ్చు వర్థమున కొఱకు అని అర్థము. ఆ అర్థమున 'నుజి' అనగా 'న్' వచ్చును వండను=వండుట కొఱకు. భావలక్షణమనగా మరొక క్రియకు లక్షణమైన క్రియ. వచ్చు క్రియకు లక్షణమైన క్రియ వండుటర కావ దానికి 'న్' రాగా వండన్ అయినది.

సూ-41. చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబు నందు నవర్ణకంబు ద్రుతాంతంబగు.

వానలు గురిసిన బంటలు పండును. వాఁడు రమ్మనినఁ బోయితిని.

గు. చేన్- అనుదానికి 'అయినచో' అని అర్థము. వానలు కురిసినన్ =కురిసినచో పంటలు పండును. రెండవది వృత్తమైన భావలక్షణమున కుదాహరణము. వాడు రమ్మనన్=రమ్మనగా పోయితివి. ఈ రెండును 'నన్' చేరినది.

**సూ-42. అనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతంబగు.**

జాబిలితో తెంచుడుంగు వలయంబులు వికసిల్లె.

గు. తోతెంచు+డున్=ఉదయించిన తరువాత. అనంతరము అను అర్థమున ద్రుతాంతమైన డువర్ణకము='డున్' అన్నది వచ్చును.

**సూ- 43. చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున కృతర్థంబు నందగు**

చూచుచుంబోవుచున్నాడు: చూచుచుం బోయెను. చూచుచుంబోవఁ గలఁడు.

గు. కత్ + అర్థము = కృత ప్రత్యయమునకున్న అర్థము వర్తమానమని అర్థము.

క్రియతో అన్వయమున కృత ప్రత్యయము యొక్క అర్థమున ద్రుంతాంతమైన చువర్ణకము = చున్ అన్నది వచ్చును. చూచు+చున్= చూచుచుని. మూడు కాలములందును ఈ ప్రత్యయము వచ్చునని సూచించుటకే మూడు ఉదాహరణము లియ్యబడినవి.

**సూ-44. తృవర్ణకార్థంబు నందెడియెడు వన్నియలగు.**

ప్రహరించెడివాఁడు, ప్రహరించెడువాఁడు: ప్రహర్త అనియర్థము.

గు. తృవర్ణకార్థము = కర్త్రర్థము - ఈ అర్థమున ఎడి, ఎడు అను ప్రత్యయము వచ్చును. ఎడి, ఎడుల తరువాత వాడు అని తచ్ఛబ్దము వాడవిచో అది విశేషణముగా కాదు.

**సూ-45. వానికి లోపంబు బహుళంబు గావగు.**

ప్రహరించువాఁడు: ప్రహర్త యని యర్థము.

గు, కర్త అను అర్థమున ఎడి ఎడుల ు లోపము వికల్పముగా వచ్చును.

**సూ-46. ఉన్న కలజిన వర్ణకంబులు భవద్భావి శతృక్తవదర్థంబు లందగు.**

ఉన్న వర్ణకంబు వర్తమానార్థక శత్రర్థంబు నందగు: కల జి వర్ణకంబు భవిష్య దర్థక శత్రర్థంబు నందగు: నవర్ణకంబు క్త వదర్థంబు నందగు. ఇవి సర్వ్వాబి ధానంబు నందగునని మెఱుంగునది. సుబంత వాచ్యంబు సత్త్వంబునాఁబడు

వండు చున్నవాఁడు: వండఁగలవాఁడు: వండినవాఁడు.

గు- వర్తమాన శత్రర్థమున - "ఉన్న" ప్రత్యయమును, భవిష్య దర్థక శత్రర్థమున "కల" వర్ణమును, క్తవదర్థమున = భూతార్థమున "న" వర్ణకమును వచ్చును. వండు చున్నవాడు—వర్తమాన కాలిక క్రియా జన్య విశేషణము.

వండఁగలవాడు - భవిష్యత్కాలి క్రియాజన్య విశేషణము.

వండినవాడు - భూతకాలిక క్రియాజన్య విశేషణము.

**సూ-47. వ్యతిరేకతృవర్ణకార్థంబున నిజియగు.**

వండనివాఁడు

ఎడి ప్రభృతి వర్ణ కాంతంబు లేదును ధాతుజ విశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు.

గు. 1. ప్రహరించెడి, 2 ప్రహరించెడు, 3. ప్రహరించు, 4. ప్రహరించుచున్న, 5. ప్రహరింపఁగల, 6. ప్రహరించిన, ప్రహరింపని — ఈ ఏడును ధాతుజ విశేషణములు, లేక క్రియాజన్య విశేషణములు అనబడును.

**సూ-48 లకారాదులు సకర్మంబునకుం గర్తృ కర్మంబు లందును.**

లాతికిం గర్త యండనగు.

సకర్మకంబనాఁ గర్మాకాంక్షోత్థాపకంబు

కర్మకంబనాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు

క్రియలు సకర్మకములు, అకర్మకములు - అని రెండు విధములు. సకర్మకము లనగా కర్మాకాంక్షోత్పాదకములు - రాముడు విభీషణుని రక్షించెను. రాముడు ఎవరిని రక్షించెను? అని కర్మాకాంక్ష కల్గినది. విభీషణుని అని సమాధానము. అకర్మక క్రియకు కర్మాకాంక్షరాదు, ఎట్లన - అతడు భయపడెను. భయపడెను అను క్రియ కర్మాకాంక్షను లేవనెత్తదు. కాన అది అకర్మకక్రియ.

**సూ. 49. పడుజ్యను బంధంబు కర్మంబు నందగు.**

కొట్టబడుచున్నాడు. కొట్టబడుచున్నది. కొట్టబడుట. కొట్టఁబడినవాఁడు.

కర్మణి ప్రయోగమున ధాతువునకు 'పడు' అనునది చేరును. కర్మణి ప్రయోగమునగా కర్మను బట్టి క్రియకు వచనాదులు వచ్చునది. రామునిచే విభీషణుడు రక్షింపబడెను. రామునిచే రాక్షసులు చంపబడిరి. ఇచ్చట కర్మను బట్టి క్రియకు ఏకవచన బహువచనములు వచ్చినవి. కర్తరి ప్రయోగమున కర్తను బట్టి క్రియావచనములుండును.

**సూ. ౫ గుణ విరహితంబులయి, యయాంతంబు లయిన యేకస్వర ద్విస్వరంబుల యించుగ్వకంబులకి యుడాగమంబు విభాషనగు**

ఏకస్వరధాతు, ద్విస్వరధాతువుల మీఁది యించుగ్వకంబులకి యుడాగమంబు విభాషనగు

గురుమంతంబగు ధాతువునకును, యాంతంబగు ధాతువునకును మీఁది యించుగ్వక్రంబులకి యుడాగమంబు రాదు

భక్ష్ + ఇస్ + ఇంచు = భక్షియించు పక్షంబున - భక్షించు

గుణ + ఇయ్ + ఇంచు = గుణియించు, గుణించు

ఇందు గ్వ్యవధానంబునం జేసి సంస్కృత ధాతువులు వక్ర పర కంబులు లేవని యెఱుగునది

యాచ్, అర్థ ఇత్యాదులు గురుమంతంబులు వ్యయ - ఇది యాంతంబు. యాచించు అర్థించు, వ్యయించు

జి + ఇంచు - అనుచో వింత్యంబగుటం జేసియు యుగాగమంబు రాగా యాంతంబగుటం జేసియు యుడాగమంబు లేదని యెఱుంగునది

కృతా కృత ప్రసంగి విత్యంబునా బడు

నగ + ఇయ్ + ఇంచు = నగియించు నగించు

నగ + ఇయ్ + ఎను = నగియెను, నగెను

పడు + ఇయ్ + ఎను = పడియెను, పడెను యిత్యాదు లెఱుంగునది.

గు గురుపైన అక్షరము లేకయుండి, యాంతములు = యకారము చివర కలవి కాకుండి, ఏక అచ్చు, రెండచ్చులు కల ధాతువులకు ఇంచుక్కాగాని ఎవిలు గాని పరమైనచో ఇయుడాగమము = ఇయ్ ఆగమముగా వచ్చుట వికల్పము

ఘట్ + ఇయ్ + ఇంచు = ఘటియించు, వికల్పము కాన ఘటించు సంస్కృత ధాతువులన్నియు ఇంచుక్కు చేరియే తెనుగున వాడబడును కాన వక్రము . పరమైరవి ఉండవు.

గురు సహితములు - యాచ్ + యించు = యాచించు, అర్థ + యించు = అర్థించు యాంతము - వ్యయ + ఇంచు = వ్యయించు - వీనికి ఇ యుడాగమము రాలేదు

జి + యించు - అనినపుడు క్రియా 64చే అయాగమము రాగా- జి + అయ్ = జయ్ - అని యాంతమగును కాన దానికి ఇయుడాగమము రాదు కాన జయ్ + యించు = జయించు- అగును

వికల్పమనగా కృతా కృతప్రసంగి జి—అను ధాతువునకు ఇయుడాగమము చేసినను చేయకున్నను అయుగాగమము వచ్చును కాన అది వికల్పము అందుచే అవి చేసియే ఇయుడాగమము చేయవలెను యా-తమైనందున ఇయుడాగమము రాదు.

**సూ-51 పద్యాదుల నవర్ణకంబున కత్వంబును కద హల్లునకు ద్విత్వంబును విభాషనగు.**

పడ్డ-పడిన, పడ్డను పడినను,

పడు, యిడు, చెడు తగు, అను. కను, కొను తిను మను, విను, చను యివి పద్యాదులు.

గు పడు మున్నగువానికి ఎదు + వ - దీనిలో నవర్ణకమునకు అకారమురాగా పడు + అ = పడ - దీనికి కడిహల్లు = చివరిహల్లు= డ్-నకు ద్విత్వమురాగా తడ్డ - అగును యిది వికలము కాన - పడిన - అగును

**సూ-5 క్రియాఫలంబు కర్తృగామియగుచోఁగొను ధాతువను ప్రయుక్తంబగు**

యిదియె యాత్మనే పదార్థంబని వ్యవహరింతురు

పండుకొనుచున్నాడు

గు క్రియ యొక్క ఫలము కర్తను చెందునపుడు కొను" అను ధాతువు ప్రధాన ధాతువునకను ప్రయుక్తమగును పండు + కొను+ చున్నాడు = పండుకొనుచున్నాడు తనకై పంటచేసికొని, తినునవి అర్థము అదే పరుల కొరకైనచో - పండుచున్నాడు —అగును దీనికి సంస్కృతమున ఆత్మనే పదమని పేరు పరుల కొరకైన దానికి పరస్మై పదమని పేరు

సూ-53. కొను ధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగా నగు

వండికొనియె, వండుకొనియె

బహుళంబనుటచే, యాంతంబునకు నిత్యంబు - చేసికొనియెఁ కొనుధాతువు చేరునపుడు ఇ౯ కారము వికల్పముగా వచ్చును

వండికొనియె - వండుకొనియె — ఇకారము రాని రూపము

బహుళమని చెప్పినందున యకారాంత ధాతువునకు నిత్యముగా వచ్చును చేయు + కొనియె = 54చే యాకు సకారము, ఇకారము రాగా చేసికొనియె, అని నిత్యముగా అగును

సూ 54 ఇకార వక్రంబు లుక్తంబులందలి వి పరం బగుచో యాకు సకారంబగు

చేయు-చేసిరి, చేసి, చేసికొను, చేసెను చేసెదిని — ఇత్యాదు లెఱుంగునది

గు ఇకారముకాని, వక్రము—ఎ ఏ ఐ కాని పరమైనపుడు ధాతువు లోని చివరి యకారమునకు సకార మాదేశమగును

చేయు_ధాతువు చేయు+ఎను—చేసెను చేయు+ఇ=చేసి

సూ-55. చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని, నుస్థానంబున బిందు వేని విభాషనగు.

అన్చున్నాఁడు, అంచున్నాఁడు అన్చున్నాఁడు, అన్చును, అంచును అనుచును, అను, కను, కొను, తిను, మను, విను-ఇవి అన్వాదులు

౦ అను మున్నగు ధాతువులకు చు' పరమైనపుడు ను లోని ఉత్వమునకు లోపముకాని ను స్థానమున పూర్ణబిందువు - మున్నకాని వికల్పముగా వచ్చును అన్చున్నాఁడు ఉత్వలోపము అంచున్నాఁడు-బిందువు అనుచున్నాఁడు-వికల్పము కాన ఏదియు రాని రూపము

**సూ-56. ఉన్న శబ్దంబు పరంబగునప్పు డుండు ధాతువు నకు లోపంబగు.**

ప్ర ఉన్నాఁడు- ఉన్నారు, ఉన్నది, ఉన్నవి.

మ . ఉన్నావు- ఉన్నారు

ఉ ఉన్నాను- ఉన్నాము

ఉన్నవాఁడు

గు ఉండు ధాతువునకు ఉన్న - అను శబ్దము (అనుబంధమైనది ఉన్న క్రియా-13), ప్రత్యయమైన ఉన్న (క్రియా 46) పరమైనపుడు ధాతువు లోపించును

ఉం +ఉన్నాఁడు=ఉన్నాఁడు-మాత్రమే అగును

అట్లే కూర్చుండు, నిలుచుండు — మున్నగువాటికి కూడ - కూర్చుండు+ఉన్న= కూర్చున్న దీనిలో ఉన్న శబ్దము పరమైనపుడు 'చున్' రాదు.

**సూ. 57. చేదాద్యర్థనాంతంబయిన యుండునకున్న దేశంబు విభాషనగు.**

ఉన్నను, ఉండినను

గు చేదర్థకమైన నన్'తో కూడిన ఉండు ధాతువునకు 'ఉన్న' అను శబ్దము వికల్పముగా ఆదేశమగును ఆదేశముగాగా ఉన్నను, రానిచో ఉండినను

**సూ. 58. తిదుటలు పరంబులగునపు దన్వాదుల నుస్థానంబున మన్నయు నుండు దులోపంబును విభాషనగు**

అందురు, అంట ఉందురు, ఉంట పక్షంబున- అనుదురు, అనుట. ఉండుదురు, ఉండుట ఇత్యాది.

గు అను, కను, కొను, తిను, మను, విను— ఈ 6 మాత్రమే అన్వాదులు పవ్వాదుల (5 )లోని చను-దీనిలో చేరదు.

అను+దురు=సున్నరాగా- అందురు గాదిదో అను-రు ఉండు ధాతువునకు డులోపమగును ఉండు+దురు = ఉందురు ఉండు+ట= ఉంట

**సూ.59 ఇట బిందువుమీఁది తదలకు నిత్య వైకల్పికంబులయి టడలగు.**

అంటివి అవితివి అందురు, అందురు.

ఉంటివి, ఉండితివి ఉండురు, ఉందురు.

గు 58చే నుస్థానమున బిందువు వచ్చి, ఆ మీదనున్న తద లకు నిత్యముగాను వికల్పముగాను టడలు వచ్చును

అను+తి+ను=అను+తి+వి=అం+తివి=అంటివి ఇకారంబు మీది-అనుసూత్రముచేవు-విగాఅయినవి 58చే ను బిందువైనది 5=చే తి-టి అయినది వికల్పముకాన-అవితివి అనుదరు-అందురు-అండురు--ం(రు

**సూ.60. ముజ్జు పరంబగునపుడు కోశబ్దము కొనునకు బహుళంబుగానగు**

బహుళంబనుటచే దీనికినా కానొకచోనతివారంబని యెఱుంగవది.

కొమ్ము, కొండు అనునవి లక్ష్యములు

గు ముడులు పరములగునపుడు కొనుధాతువునకు 'కో' అనుశబ్దము వికల్పము అతి వారము=అతి వ్యాప్తి చెప్పినచోటనే కాక మరికొన్ని చోట్లను కలుగుట-శబ్దపల్లవమైన కొనునకు ఈ రూపము కల్గను

చదువు కొనక—చదువుకోక, చదువుకోని, చదువుకోగలదు-ఇత్యాది

కేవల కొనునకురాదు—కోక, కోవి-అను రూపములు లేవు

**సూ.61 ముజ్జుపరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును, మువర్ణకంబునకు మాముడియునగు**

కొమ్ము, కొనుము, కొండు, కొనుడు

గు కొను+ము—కొనునకుకోరాగా-కోము-మువర్ణకమునకు మా

మఱియు, దీర్ఘమునకు హ్రస్వమురాగా—కొమ్ము-అగును కొనుము-లోవి ను స్థానమున బిందువురాగా—కొండు-అగును వికల్పముకాన-కొనుము,కొనుడు

సూ-62 రువర్ణకంబు పరంబగునపుడు నున్నమీఁదిత దరలయుత్వంబునకు లోపంబు విభాషనగు

పోషింత్రు, పోషింతురు కొంద్రు, కొందురు, కొంద్రు, కొందురు.

గు. పోషింతురు, నున్నమీదనున్న త కారముయొక్క ఉకారము లోపించగా పోషింత్రు, వికల్పముకాన-పోషింతురు

నున్నమీ ది తదరల కనుటచే పిలుతురు, చేయుదురు, అనుచోట్ల పిలుత్రు, చేయుద్రు అనురూపములు రాలేదు

సూ-63 సంస్కృతంబున తంగలాదుల కించుక్కగు.

సంస్కృతధాతువుల తంగలాదుల కించుగాగమంబగు పచించు వచించు, త్యజించు, భజించు, అంగవించు

అంగల అదక, అరగ, అపుల, ఉలక, ఉగ్గడ, ఓసర, కార, గాల, జార, తిలక, తులక, పంక, పరిక, వలవ, అప్ప, ఒప్ప, అల-ఇత్యాదు లంగలాదులు

గు అంగల మున్నగు సంస్కృత ధాతువులకు "ఇంచు" చేరును

వచ్+ఇంచు=వచించు, అంగల+యించు=అంగలించు యిత్యాది.

సూ-64 ఇ ఉ ఋ ల కించుక్కు పరంబగునపుడ యు గవు గరుక్కులగు

జి-జయించు. ద్రు-ద్రవించు ధృ-ధరించు

నీ-నయించు లూ-లవించు తౄ-తరించు

గు. సంస్కృత ధాతువులకు ఇంచు చేరునపుడు ఇకారమునకు అయ్, ఉకారమునకు-అవ్ ఋకారమునకు-అర్ ఆదేశమగును

జి+అయ్+ఇంచు=జయించు ద్రు+అవ్+ఇంచు=ద్రవించు

ధృ+అర్+ఇంచు=ధరించు దీర్ఘములకు విశ్లే.

### సూ-65 నిర్ధినామంబుల కయుగాగమంబు పిలుగదు

నిర్ధికి, నామ ధాతువుల కయుగాగమంబు కలుగదు

నిర్ధించు, నుతించు స్తుతించు

ఈ జ్ఞాపకంబు చేతనే నామంబులకు ధాతుత్వ వివక్షయందించుగాగ మంబగునని యెఱుంగునది. కయనించు, పయనించు.

గు నిర్ధి ధాతువునకును నామ ధాతువులకును అయుగాగమము కలుగదు నామ ధాతువులనగా నామవాచకములకు ధాతుత్వ వివక్ష చేయగా నేర్పడినది

నిర్ధి+ఇంచు-నిర్ధించు కయన+ఇంచు, కయనించు పయన+ఇంచు =పయనించు

నామములకు ధాతుత్వము చేసి, వాటికి ఇంచుగాగమ ప్రాప్తి కల్గు సూత్రమును లేదన్నచో యిక్కడ అయుగాగమము కల్గదని చెప్పుటచేతనే ధాతుత్వము, ఇంచుగాగమము వచ్చునని తెలియుచున్నది.

### సూ-66. సంస్కృతంబునకు లఘూ పదంబున కించుక్కు పరంబగునపుడు గుణంబగు

అ, ఏ, ఓ ఈ మూడును గుణంబులనా బడు బుస్థానికంపగు గుణంబు రపరంబయియుండు

సంస్కృత ధాతూపధలకు ఇ, ఉ, ఋ—అనువానికి పొరిదిని ఏ ఓ, అర్-అనునవి యించుక్కు పరంబగునపుడగునని యెఱుంగునది

| | | |
|---|---|---|
| ఛిద్-ఛేదించు | ఘుష్-ఘోషించు | వృష్—వర్షించు |
| భిద్-భేదించు | పుష్-పోషించు | హృష్-హర్షించు |

గు అలోన్త్యాత్పూర్వ ఉపధా' అని చివరి అక్షరమునకు ముందక్షరము ఉపధ అనబడును ఛిద్‌లో చివరి అక్షరము ద్ కాగా ఉపధ ఛిద్ లోని ఇకారము ఇది లఘు అక్షరము కనుక యిది లఘూపదమయినది. అట్టి ధాతువులకు ఇ,ఉ,ఋ లకు వరుసగా ఏ,ఓ,అర్-లు వచ్చును ఛిద్‌లో

ఇ-కి ఏ రాగా ఛేదించు ఘుష్‌లో ఘు-లోని ఉ-కి ఓ రాగా ఘోషించు వృష్—వ్+ఋ ఋ-కు అర్ రాగా వ్+-ర్+ష్+యించు= వర్షించు అయినది.

సూ- 7. స్పృశికిన్ గుణంబు విభాషనగు.

స్పర్శించు-స్పృశించు

గుణము వచ్చినచో ఋకారమునకు అర్ రాగా స్పర్శించు అయినది. రానిపక్షమున స్పృశించు అని రూపము

సూ-10. లిఖ భుజ రుచ కృశంబులకు గుణంబు లేదు

లిఖించు, భుజించు, రుచించు, కృశించు

కుచ ధాతువునకు గుణంబులేదని యొకండు వక్కాణించెనది గ్రాహ్యంబుగాదు

గు. లిఖ, భుజ, రుచ, కృశ — అను ధాతువులు ద్వ్యస్వరంబులు, లఘూపధలు కాన వానికి గుణము వచ్చుచుండగా రాదని చెప్పుచున్నాడు లిఖించు లేదా లేఖించు అని వ్రాయవలసి వచ్చును కుచ ధాతువునకు వంకోచించు అని రూపము గుణముతో ప్రయోగమున్నందున దానికి కూడ గుణము వచ్చును.

సూ-11 సృజికి నిర్మితిని గుణంబు లేదు.

చతుర్ముఖుండు ప్రజలను సృజించె అతండు విషయంబుల విసర్జించె

గు. ప్రజలను సృజించె నన్నపుడు గుణమురాలేదు విసర్జించె నన్నప్పుడు గుణము వచ్చినది కాన నిర్మితి - అను నర్థమున గుణము రాదు.

సూ-12 వర్ణ్యంబునకుం జేసంబున కించుక్కగు

వర్ణించు, వచింపించు, ఉపువిచించు, వండించు, పండించు.

గు. సర్వంబునకు-అనగా అన్ని విధముల ధాతువులకును తెనుగున ధాతువులు నాల్గువిధములుగా తయారగును

1 సంస్కృత ధాతువులకు యించుక్కు చేర్చగా ఏర్పడునవి క్రియా 63

2 అంగలాచుల కించుక్కు చేర్చగా నేర్పడునవి క్రియా 63

3 దేశ్య భాషలో సహజముగా ఉన్నవి పండు, వండు మున్నగునవి

4 నామములకు ధాతుత్వ వివక్ష చేసి ఇంచుక్కు చేర్చగా ఏర్పడునవి నామధాతువులు, నుతించుము క్రియా 65

ఈ అన్నిటికి ప్రేరణార్థమున ఇంచుక్కు వచ్చును

వచ్ + ఇంచు + ఇంచు = వచింపించు = చెప్పించు, చెప్పునట్లు చేయు

**సూ-71 రంజాదుల యించు కృకారంబునకు వవిందు కంబున కప్రేరణంబున ద్విరుక్త లకారంబగు.**

రంజిల్లు, భాసిల్లు, వర్ధిల్లు, విలసిల్లు, రాజిల్లు.

ఈయాదేశ యోగంబున భిదాదుల కర్మకంబులగు

భేదిల్లు, కంపిల్లు, సంధిల్లు

గు రంజమున్నగు ధాతువులకు ప్రేరణార్థకము కాని ఇంచుక్కు లోని సున్నతో కూడిన చకారమునకు ద్విరుక్తల కారము — ల్లి - అగును రంజ + యించు = రంజ + ఇల్లు = రంజిల్లు ఇట్లు లాద్విత్వము వచ్చిన భిదాది ధాతువుల కర్మకంబు లగును భేదిల్లు, ఘటము భేదిల్లెను లేదిపో - రాముడు ఒక్క బాణముచే సప్తసాలములను భేదించెను యిది సకర్మకము.

**సూ-72 ఇంచుక్కు పరంబగునప్పుడు రంజాదుల యించుక్కునకు లోపంబగు**

లాదేశంబున కపవాదంబు రంజించు, భేదించు, సంధించు

గు ప్రేరణార్థక యించుక్కా పదముకాగా ధాతువునకు చేర్చ యించుక్కా లోపించును

రంజ + యించు + యించు = ఒకయించు పోగా - రంజించు- అవి అయినది

సూ- 73. చుగాగమం బాచ్ఛికంబున కనంయుక్త వలతరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబు గానగు

పూను పూనుచు, పూనించు తేలు - తేలుచు, తేలించు

మరుగు — మరుగుచు, మరిగించు కుదురు — కుదురుచు, కుదిరించు

విను - వినుచు, వక్ష్యమాణంబు పుగాగమంబు, వినిపించు.

బహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు

అను—అనిపించు, తిను-తినిపించు, కను-కనిపించు

దీని యత్వంబునకు దీర్ఘంబునగు-కనిపించు

గు. న, ల, డ, ర — చివరనున్న అచ్చ తెనుగు ధాతువునకు ప్రేరణార్థమున అసంయుక్తముపైన చుగాగమమువచ్చును

పూను + చు = పూనుచు = వహింపజేయు, తేలు- స్వార్థము. తేలుచు - ప్రేరణము

వికల్పము కాను - పూనించు, తేలించు విను + యించు = 78వ పుగాగమమురాగా -వినిపించు బహుళమనుటవలన కొన్ని ధాతువులకు చుగాగమమేరాదు అను - అనిపించు కనిపించు - లోనికాకు దీర్ఘమగు - కనిపించు.

సూ-74 అట్లు పుగాగమంబును మూన్వాదులకగు

మాను-మానుపు-మానుచు. మను-మనుపు-మనుచు.

బహుళకంబున దీనికిం జ్యక్కొ_లేదు.

గు. పుగాగమంబును-అనుటచే చుగాగమమమును వచ్చును

మాను-మానుచు, మానుపు బహుళమనుటచే దీనికించుక్కు రాదు

మను — మనుపు - మనుచు దీనికింమిక్కు_రాదు కనుక -

"మనించు" అనికాదు.

సూ-15 చుప్పు వర్ణంబులు పరంబులగునపు దిత్వం

బున కుత్వంబగు.

సూ-16 అట్లు చుప్పు గాగమంబు లడంగ్వాది

మాయ్వాదులకగు నగుచో వాని కడవ్రాలు లోపించు

అడఁగు-అడఁచు అడగించు మాయు_మాపు-మాయించు

అడఁగు, కరఁగు, కలఁగు, నలగు యిత్యాదు లడంగ్వాదులు

మాయు, ఉడుగు, కడచు, కుడుచు, విగియు యిత్యాదులు

మాయ్వాదులు.

అగు ప్రకృతులు భయగణంబులు

బహుళకంబునం జేసి కొన్నింటి కించుప్పు ప్పుగాగమంబులు

మూఁడును, గొన్నింటికం యథా సంభవముగా రెండును,

గొన్నింటి కొక్కటియు నగునని తెలియందగినది

అఁగు - అఁచు —అఁపు, అఁగించు రేఁగు-రేఁచు, రే పు_రేగించు

పాయు-పాచు-పాపు. విఱుగు-విఱుచు చూచు-చూపు నేయచు-నెరుపు

మేయు-మేపు. లేచు-లేపు కలియు-కలుపు తడియు-తడుపు తెలియు

తెలుపు యిత్యాదు లెఱుంగునది

గు - చు, పువర్ణములు పరమైనపు డికారమున కుకారమగును

తెలియు-తెలుపు, తడియు_తడుపు.

అడగు, మాయు మున్నగువానికి "చు, పు" లు పరమైనపుడు వాని

చివరి అక్షరము లోపించును అరగు+చు=అరచు మాయు+పు=మాపు కొన్నిటికి యించు, చో, వు-మూడును, కొన్నిటికి రెండు, కొన్నిటి కొక్కటి వచ్చును అవి ఉదాహరణముల చూడనగును

**సూ-77 ఇంచుక్పుక్పుగాగమంబులు పరంబులగు నపుడు దాగమాదేశ లోపంబులు పెక్కుతెఱంగులం గానం బడియెడి**

అగు-కావించు వచ్చు-రావించు, రప్పించు విన్నపము-విన్నవించు మోఁకాలు-మోకరించు కేక-కేకరించు పలవ-పలవరించు పలవించు అల-అలకించు, అలించు ప్రక్క-ప్రక్కలించు. నొచ్చు-నొంచు నొప్పించు ఉండు ఉనుచు-ఉంచు దిగు-డించు డిగించు, పెరుగు-పెనుచు-పెంచు తునుగు-త్రుంచు. మునుగు-ముంచు మునుచు మొగుడు-మొగుడుచు, మొగుచు, మోడుచు, మొగిడించు, చొచ్చు చొనుపు, చొప్పించు, అనుఁగు చించు, చింపు, త్రెగు-త్రెంచు-త్రెంపు తిరుగు-త్రిప్పు చచ్చు-చంపు, విడుచు-విడువరించు, విడుపు, కొను-కొలుపు పోవు-పుచ్చు, పనుపు-పంచు, పనుపు పంపు అనుచు-అంచు, అనుపు, అంపు

అనుప్రయుక్తంబగు పోవునకుం బుచ్చు మాత్రంబగు మోనపోవు-మోనపుచ్చు ఇత్యాదు లెరుంగనది.

గు ఇంచు, చు, పు' వర్ణములు పరములైనపుడు అగమములు, ఆదేశములు, లోపములు ఎన్నో రీతుల నున్నవి అవి అనుగతిలేనివికాన ఉన్న మన టుల చూచుకోవలెను

**సూ-78 అన్వాదులకించుక్కు పరంబగునపుడుపుగాగ మంబగు మానువకు విభాషన్గా**

అనిపించు, అను, కను, తిను, విను

మానిపించు, మానించు

గు. 55 సూత్రమున చెప్పిన అన్వాదులారింటిలో కొను, మను లను విడిచినాడు మనునకించుక్కు రాదు (74 సూ) కొను (వెలకు కొను) ధాతువునకు ప్రేరణమున కొనిపించు అను రూపములు వ్యవహారమున ఉన్నను ఉదాహరించలేదు.

**సూ-79. అర్థాదుల కించుక్కు పరంబగునపు డుగాగమంబగు నప్పాదులకు విభాషనగు.**

అర్థము—అర్థగించు,

అర్థము, ఓర, చిత్తము, పంతము, పెల్లి, బోర, మట్టము, మేశము ఇత్యాదు లర్థాదులు అప్ప-అప్పగించు, అప్పించు

అప్ప, ఒప్ప, పల్లము కోపము యివి యప్పాదులు.

గు. అర్థము మున్నగువానికి ఇంచు' పరమైనపుడు గుగాగమము నిత్యముగాను అప్పాదులకు వికల్పముగాను అగును అర్థము-అర్థగించు అప్ప-అప్పగించు, అప్పించు,

**సూ-80. అడోడు కూడుల డకారంబునకుం జుక్కు పరంబగునపుడు రేఫంబగు.**

అడు—అరుచు, అడించు ఓడు—ఓరుచు, ఓడించు కూడు—కూరుచు, కూడించు

గు అడు, ఓడు, కూడులకు 'చు' పరమైనపుడు డకారమునకు రేఫమాదేశమగును.

అడు+చు=అరుచు అడించు-ఇంచుక్కు పరమైన రూపము

**సూ-81. చెడునకుం జుక్పుగాగమంబులు నుడాకలఘు రేఫంబునగు**

చెఱుచు, చెఱుపు

చెడు ధాతువునకు చు, పు లు వచ్చినపుడు డకారమునకు 'ఱ' వచ్చును.

చెఱు+చు=చెఱుచు, చెఱుపు

**సూ-82 పఱునకుం ణిచ్కును డా కి లఘురేఫంబునగు పఱుచు.**

ఏ పఱునకు చు పరమైన దకారమునకు ఱ' వచ్చును పఱ+చు=పఱుచు. పఱచు-అను అకార మధ్యమైన దానికి పరుగెత్తు అనిఅర్థము అది పఱునను ప్రేరణము కాదు.

**సూ-83. శబ్ద పల్లవంబగు పఱున కించుక్కు విభాష వగు నగుచో డా కు లఘు రేఫంబగు**

వెలవఱు—వెలవరించు వెలవఱుచు చొప్పఱు—చొప్పరించు' చొప్పఱుచు

గు శబ్ద పల్లవమనగా ధాతువునకు ధాతువుగాని నామవాచకముగాని కలిసినది వెల+పఱు=వెలవఱు— దీనికి యించుక్కు వికల్పముగా వచ్చును వచ్చినపుడు దకారమునకు లఘురేపము— ర వచ్చును వెల వఱు+ఇంచు=వెలవరించు ఇంచుగాగమము వికల్పముకాన రానప్పుడు వెలవఱుచు అగును చొచ్చు+పఱు=చొప్పఱు.

**సూ—94. ప్రేరణంబు వం దించుక్కుమీద నించుక్కు లేదు**

ఇటనుటంజేసి ప్రేరణార్థంబయిన యిశరాగమంబుమీ దంబ్రేరణార్థం చుగాగమంబగునని యెఱుంగునది

నొచ్చు-నొంచు, నొంపించు చచ్చు చంపు, చంపించు

గు ప్రేరణంబునందించుక్కు- అనగా ప్రేరణార్థక యించుక్కు అని అర్థము దానిమీద ప్రేరణార్థ యించుక్కు రాదు. కాని ప్రేరణార్థక మైన చు, పుగాగమములమీద ప్రేరణార్థక యించుక్కు రావచ్చును స్వార్థం చుక-మీద ప్రేరణార్థం చుక్కును రావచ్చును వచించు+ యించు=వంచింపించు వచించు స్వార్థంచుక్కు. దానిమీద యించుక్కు

వచ్చినది కొంచు+యించౌ-మెంపించు-చంపు, చంపించు- యివి ప్రేర ణార్థక ము, పూఱు—వచ్చిన రూపములు దానిపై ప్రేరణార్థకేంచుక్కు వచ్చినది ప్రేరణేంచుక్కుపై ప్రేరణేంచుక్కు రాదుకాన చదువు-చదివించు, చదివింపించు అనికాదు అని అర్థము

**సూ-85. ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో వనోద్ధంబయిన యుత్వంబున కిత్వంబగు**

నిగుడు-నిగిడి, నిగిడె మగుడు, మగిడి, మగిడె

ఉడుగు-ఉడిగి, ఉడిగె మునుగు-మునిగి, మునిగె.

గు ఇకార, ఎకారములు పరమైనపుడు మొదటిదికాని ఉకారము నకు యికారము వచ్చును నిగుడు+ఇ=నిగిడి దీనిలో గు గి-గా మారి నది. మొదట ఉకారము మారునవి ఉడుగు, మునుగులు వీనిలో రెండవ ఉకారమే ఇకారమైనది

**సూ-86. ముజీత్తులు ముత్తునాఁబడు**

గు ముజ్జు, టీత్తు- ఈ రెంటికి ముత్తు అని సంజ్ఞ

**సూ-87 ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబునకగు**

పచించు- పచింపించు వచించు-వచింపించు పిలుచు—పిలిపించు వలచు-వలపించు

పత్వంబు హెచ్చునకుం గలుగదు, మెచ్చునకు విభాషనగు

హెచ్చించు, మెప్పించు, మెచ్చించు

గు ప్రేరణార్థకమైన యించుక్కు పరమైనపుడు చకారమునకు పకారమాదేశమగును పచించు+ యించు=పచింపించు మొదటి యించు లోని చకారము పకారమైనది హెచ్చునకు పకారము రాలేదు, మెచ్చునకు వికల్పముగా వచ్చినది మెచ్చునకు వచ్చినపుడు రెండు చకారములకు-న్నూ రెండు పకారములు వచ్చినవి మెప్పించు

**సూ-౮౬. ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు వవలగు**

ఆగమము . వచింపుడు, వచింపుము ఉడుపుడు అడుపుము

అన్యము పిలువుడు పిలువుము

గు ద్విరుక్తముకాని ఆగమ, అన్యచకారంబులకు క్రమముగా వ, వ లు వచ్చును ఆగమ చకారమునకు వచించు+డు=వచింపుడు ఆగమాన్య-సహజమైన చకారము పిలుచు+డు=పిలువుడు పిలుచు+ము=పిలువుము

**సూ-౯౨. ఖండ బిందువు మీఁది సిద్ధ చకారంబునకు ముత్తు పరంబగునపుడు పకారంబు పాయికంబుగనగు**

తలఁపక, త్రేఁపక, తోఁపక

ఏఁచునకు వైభాషికంబు ఏఁపక, ఏచక నోఁచునకుం గలుగదు. నోఁచక

గు అరసున్న తరువాత ఉన్న సిద్ధమైనచకారమునకుము-డు పరమగునపుడు పకారము తప్పక వచ్చును తలఁచు + క = తలఁపక, త్రేఁచు + క = త్రేపక, తోఁచు + క = తోఁపక ఏచునకు వికల్పము - ఏఁచు + క = ఏఁపక ఏచక నోఁచునకు రాదు నోచక నోఁపక—అను రూపము రాదు

**సూ- ఆగమ చకారంబునకు నెఱనున్న మీఁది దానికి దుక్కు పరంబగునపుడు పకారంబు విభాషనగు**

ఆకర్ణింపుదురు దంపుదురు, చింపుదురు

పక్షాంతరంబున వక్ష్యమాణతాదేశంబు

ఆకర్ణింతురు, దంతురు, చింతురు

గు. పూర్ణబిందువు తరువాత ఉన్న ఆగమ చకారమునకు ము పరమైన పకారము వికల్పముగా వచ్చును ఆకర్ణించు+దురు =ఆకర్ణింపు

దురు పత్వమురానిచో క్రియా 108చే దుగ్ధకారముతకారమై—
అకర్షింతురు-అగును.

**సూ-౪౧. అగు, వచ్చు, చొచ్చు, చూచులకు ముత్తు పరంబగునపుడు కా, రా, చొరు, చూడులగు.**

అగు - కాదు వచ్చు - రాఁడు, రమ్ము. చొచ్చు - చొరదు
చొరుము. చూచు-చూడఁడు, చూడుము

గు అగు - కా, వచ్చు – రా, చొచ్చు– చొర, చూచు–చూడు-
అనునవిము-దుల పరమైనపుడు అగును కనుక అగు + దు = అగదు
కాక - కాఁదు అయినది వచ్చు + దు = వచ్చదు కాలేదు రాదు
అయినది

**సూ–౪౨. ఇచ్చునకు పర్యాయంబున కీయగు**

ఇచ్చు-ఈదు, ఇమ్ము

ఈయ యను నాదేశంబు నొకానొకచోఁగానంబడియెడి

"బలిమినీదుని భూమివలయపతులం"

గు యిచ్చు అనుధాతువు నంతను కొట్టివేసి ఈ' అన్నది ముత్తు
పరమైనపుడు వచ్చును

ఈయవచ్చినచో – ఇచ్చు+ని=ఈయని–అగును

**సూ- ౪ తేతేరులు తెచ్చునకగు**

తెచ్చు–తేఁడు, తేరఁడు మ్ము, తేరుము

గు తెచ్చు ధాతువునకు ముత్తులు పరమగునపుడు తే, తేరు -
అన్నవి ఆదేశములగును

తెచ్చు+దు=తేఁడు, తేరఁడు

**సూ. ౪.. చావునోవులు చచ్చునొచ్చుల కగు**

చచ్చు-చావఁడు. చావుము నొచ్చు-నోవఁడు, నోవుము

వక్ష్యమాణంబు ద్విత్వంబు-నొవ్వఁడు

గు చచ్చు - అను ధాతువునకు ముత్తులు పరమగునపుడు చావు అన్నదియు, నొచ్చునకు నోవు - అన్నదియు ఆదేశములగును చచ్చు+ డు = చావఁడు, నొచ్చు + డు=నోవఁడు వక్ష్యమాణము ప్రకీర్ణక 6చే నోకి హ్రస్వము మీది హల్లునకు ద్విత్వమురాగా నొవ్వఁడు

**సూ 9' జిత్తుపరంబగునపుడు వాని వువర్ణంబు విభాషనులోపించు.**

చాక, చావక చాకుము - చావకుము నోక - నోవక - నోకుము - నోవకుము

గు జి ఇత్తుగాగల ప్రత్యయములు పరమైనపుడుపైవాని వువర్ణమునకు లోపము వికల్పముగా నగును చచ్చు + క = చాక వికల్పము కావ-చావక

**సూ- 6 అగున కనుకినులకు ముజ్జిత్తులు పరంబులగునపుడు కా, నా, కానలు విభాషనగు**

అపవాద్య సూత్రముచే గొకు ఒకారంబు. వక్ష్యమాణం బొత్వంబు కమ్ము అగుము, అవుము, బొము, కండు, అగుడు, అవుడు, బొఁడు, నాఁడు, అనఁడు, కానడు, కనదు

గు అగు + ము = అగుము అపవాద్యగ కార ంబునకు వకారంబగునని - అవుము- క్రిసూ 103చే అవునకొరాగా - బొము అగునకు"కొ"రాగా రాము 61చే కాకు హ్రస్వము, మువర్ణమునకు మామిడిరాగా-కమ్ము-అను రూపములు సిద్ధించును

**సూ-97 నేరుచునకు లిడ్లాట్టులు ముత్తు పరంబులగు నపుడు రు,చు' లకు లోపంబు బహుళంబుగానగు**

నేచెను, నేరిచెను, నేచును, నేరుచును, నేరఁడు, నేరుపఁడు

గు నేరుచు అనుధాతువునకు లిట్టుక, లాట్టు, పరమైనపుడు"రు" అనుఅక్షరమును,ముత్తు పరమగునపుడు "చు" అను అక్షరమును వికల్ప

ముగాలోపించును నేరుచు+ఎను - రు లోపము రాగా _ నేచెను రాని చో- నేరిచెను  నేరుచు + డు = చు లోపమురాగా_నేరదు

సూ-98. పోవునకు దుఙ్మత్తులు, ముఙ్ఙంబరంబులగు నపుడు వులోపంబుం బొద పదలును విభాషనగు

పోదురు, పోవుదురు పోదు, పోవదు పోవుము, పొమ్ము, పదము పొమ్ము

గు పోవు అను ధాతువునకు దుఙ్, ముత్తు, ముఙ్ పర గు నపుడు మలోపము, పొద పదలు ఆదేశములో వికల్పముగానగును. పోవు + దురు = వు లోపించిన—పోదురు లేదా పోవుదురు పోవు+ ము = పొదము, పదము 61చే పొమ్ము, పోవుము

సూ-99. అగుపోవుల కర్తృవాల కిద్వ్రక్రంబులు పరంబులగునపుడు యకారంబగు.

వక్ష్యమాణంబైత్వంబు

అయి - ఐ అయిరి - ఐరి పోయి, పోయిరి, పోయెను పోయెదు.

గు అగు-పోవు_ అనుధాతువులకు ఇ, ఎ, ఏలు పరములైన చివరి అక్షరములకు యకారము వచ్చును. అగు + ఇ = అయ్ + ఇ = అయి - ఐ—(103చే వక్రతమము - వచ్చినది) అట్లే - పోవు + ఇ = పోయ్ + ఇ = పోయి. పోవు+ఎదు=పోయెదు

సూ-100. అగునకు వ కలు గూడుచో దీర్ఘంబగు.

వక్ష్యమాణంబు ద్విత్వంబు అయెను అయ్యేను, అయెదు, అయ్యేదు

గు అగు_ధాతువునకు వక్రంబు-ఎఏలు-కూడిన దీర్ఘమువచ్చును

అగు+ఎను=అయ్ (99చే) + ఎను=అయ్+ఎను = అయెను ప్రకీర్ణక. 6చే ప్రాప్తద్విత్వములురాగా-అయ్యేను.

**సూ-101. పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగు నపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు**

పిలఁదు, పిలువఁడా, పిలుము, పిలువుము.

లేచునకు ముబ్జు వరంబగువపుడు చు లోపంబగు. లెమ్ము, లెండు.

పిలుచు, విలుచు, తలఁగు ఇత్యాదులు

గు॰ పిలుచు మున్నగు ధాతువులకు ముత్తు పరమగునపుడు చివరి అక్షరము బహుళముగా లోపించును పిలుచు + డు = చు లోపించగా- పిల దు లోపించనిచో-పిలువఁడు లేచునకు చు లోపము నిత్యము. లేచు+ము=చులోపించగా- లే+ము=లెమ్ము

**సూ-102 లాతిచో నహితము కాదేశాదులు కానం బడియెడి.**

కావుతను, కాతను అగుట, కావుట, అగుదును, కావుదును,కానను, కావునను, అనుదుమ, అనవుదును, నావుదును-యిత్యాదు లెరుంగునది

గు తక్కినచోట్లకూడ కా, నా మున్నగు ఆదేశములు కవబడు చున్నవి అని సూత్రార్థము

అగు+తన్=కావుతన్, వులోపమురాగా కాతను కావున, కావ, అనవుదు, నావుదు.

**సూ-103. అచ్ఛికంబులందయియవులకు వక్రతమం బులు బహుళంబుగావగు**

అయిదు - ఐదు, అఋరేవి - ఐరేవి, అవుదు — ఔదు, గవుసెను-గౌసెమ.

గు అచ్చతెనుగు పదములలోని అయి, అవు-అనువానికి ఐ, ఔ లు బహుళముగా వచ్చును. అఋరేవి-ఐరేవి=పెండ్లి కుండలు ఔదు=పెదవి. గౌసెవ=బురకా. అచ్ఛికములనుటచే జయించు మున్నగు తత్సమ క్రియ లందుగాని, దయితుడు, దవులు మున్నగు తత్సమ శబ్దములందు గాని

యీ కార్యము రాదు బహుళమనుట వలన అలయించు, వెలయించు మున్నగుచోట్ల ప్రవృత్తిలేదు

**సూ-104. కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరంబగు నపుడు కలయగు**

ప్ర కలఁడు-కలరు, కలదు-కలవు

మ కలవు - కలరు

ఉ కలను — కలము

గు ఉన్నది అను అర్థముకల కలుగు ధాతువునకు లట్టులో కల ఆదేశమగును

కలుగు+డు=కలఁడు ఇత్యాది

**సూ-105. త్రర్థంబునం 'గ'లాదేశంబు విభాషనగు**

ఎడి యెదులకు లోపంబిట నిత్యంబు కలవాఁడు-కలుగువాడు

గు తృవర్థకార్థంబున కలుగునకు కల ఆదేశము వికల్పము కలవాఁడు ఎడి, యెదులకు లోపము నిత్యముగా కాన కలెడివాడు అను రూపమురాదు కలుగువాఁడు, కలిగెడివాడు, కలిగెడువాడు అవి యగును

**సూ-116 అస్త్యర్థంబునకు లజి, మి, క, ని, వడి వర్ణకంబులు పరంబులగునపుడు లేయగు**

ప్ర . లేదు, లేరు, లేదు, లేవు

మ లేవు, లేరు ఉ లేను లేము, లేమి, లేక, లేని లేవడి

గు ఉన్న అను నర్థమున కల కలుగు ధాతువునకు లజి మి, క ని, వడి ప్రత్యయములు పరమైనపుడు లే ఆదేశమగును కలుగు+డు=లేదు అట్లే లేమి యిత్యాదులు.

**సూ—107 వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాషనగు**

ప్ర ఒల్లదు-ఒల్లరు, ఒల్లదు, ఒల్లవు

మ ఒల్లవు-ఒల్లరు ఉ ఒల్లను-ఒల్లము.

ఒల్లమి, ఒల్లక, ఒల్లని పక్షంబున వలవఁ డిత్యాది.

ఒల్లమి కొల్ల బాటని ప్రయోగంబులం గానంబడియెడి.

గు వలచు అను ధాతువునకు వ్యతిరేకార్థమున ఒల్ల అనునది వికల్పముగా వచ్చును.

వలచు+రు=ఒల్ల రు రాని పక్షమున వలవఁరు అని అగును.

**సూ. 1 8 చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారం బగు**

విలుతురు, పిలుతురు, అడతురు, కడతురు, ఏంతురు, పెంతురు, పదింతురు, పచింతురు.

చేతురు, కోతు రిత్యాదుల, సాధువులని యెఱుఁగునది.

గు. చువర్ణము దుగ్ధకారములకు తకారము ఆదేశమగును. విలుచు+దురు=విలుతురు- చేయుదురు అనియే దీని రూపము దీనిలో చువర్ణము లేనందున చేతురు అను రూపమురాదు, కాన అది అసాధువు అట్లే కోతురు-అన్నదియు అసాధువే

**సూ-109. పడుటకొను లొకానొకచో స్వార్థంబు న౯దను ప్రయుక్తంబులగు**

చొచ్చు-చొరఁబడు విలుచు-విలువఁబడు కూడు-కూడఁబడు. పండు-పండుకొను

గు పడు, కొను-అను ధాతువులు కొన్నిచోట్ల స్వార్థమున అను ప్రయుక్తములగును చొచ్చు+పడు=చొరఁబడు=ప్రవేశించు అనియే అర్థము అట్లే పండు+కొను=పండుకొను=పరుండు అని అర్థము

**సూ-110 తెంచు ధాతువగ్వాదుల కను ప్రయుక్తం బగు నగుచో నుత్వంబు పయిని దాని తకారంబు ద కారంబగు.**

అగుదెంచు, నెగడుదెంచు, పోవుదెంచు

అగు, నెగడ్డు, పోవు, చొచ్చు, పుచ్చు, తోఁచు, నడచు పఱచు, మొలచు, వీచు ఇత్యాదు

గు అగుమున్నగువానికి తెంచు-అను ధాతువను ప్రయుక్తమగును ఉకారముమీద నున్న తకారమునకు దకారమగును అగు + తెంచు = అగుదెంచు

**సూ. 11. అభ్యాగతి నరుగ్వాదులకయ్యదియను ప్రయుక్తంబగు, నగుచో గువర్ణంబు విభాషనులోపించు**

అరుదెంచు—అరుగుదెంచు ఏతెంచు—ఏగుదెంచు చనుదెంచు

**సూ.11. అయ్యదిపరంబగునపుడు చువర్ణంబు లోపించు**

చొచ్చు—చొత్తెంచు పుచ్చు—పుత్తెంచు, తోఁచు—తోఁతెంచు,

గు. అరుగుమున్నగువానికి తెంచు అనుప్రయుక్తమైనపుడు అరుగు మున్నగు వానిలోని "గు" వర్ణము వికల్పముగా లోపించును అరుగు+ తెంచు = అరుదెంచు వికల్పము కాన అరుగుదెంచు గువర్ణమునకే లోపము వచ్చునని సూచించుటకై చను+తెంచు=చనుదెంచు—అన్నది ఉదాహరింపబడినది

అట్లే తెంచు పరమగునపుడు చువర్ణము లోపించును చొచ్చు + తెంచు = చొత్తెంచు, ఇక్కడ చద్వయ మున్నది కాన తద్విత్వము వచ్చినది

**సూ. 113. అర్థానికి ముత్తు పరంబగునపుడు తేతేరులగు.**

అగుదేఁడు, అగుదేరఁడు అగుదెమ్ము, అగుదేరుము.

గు అర్థానికి = అను ప్రయుక్తమైన తెంచు ధాతువునకు ముత్తు పరమైనచో ఆ ధాతువునకు తే, తేరు-లు ఆదేశములగును. అగు +

లెంచు + దు = అగుదేదు అగుదేరదు అగు+ లెంచు + ము = అగు+లే+ము=అగుదేము అగుదెమ్ము

**సూ. 114 భూతంబున లజికి లిదంతంబగు నగుధాతు వను పయుక్తంబగు**

వాదు రాదయ్యెను, వారు రాదయిరి, అది రాదయ్యెను అవి రావయ్యెను, నీవు రావయితివి, మీరు రావయితిరి, నేను రావయితివి, మేము రామయితిమి

ఈ భూతకాలమున లజికి-వ్యతిరేకార్థమునున్న ధాతువులకు, లిదంతంబగు అగు ధాతువు = అగు ధాతువు యొక్క భూతకాలిక రూపములు-అను ప్రయుక్తము లగును రాదు-లజిరూపము దీనికి - అయ్యెను-లిదంత అగు ధాతురూపము భూతార్థమున అను ప్రయుక్తమైనది

**సూ-115 నుజంతంబగునగు ధాతువు క్రియా విశేషణంబుల కను ప్రయుక్తంబగు నుజికి విభాషనగు**

కాను అనునది నుజ్యంతంబగునగు ధాతువురూపంబు

**సూ. 116 దానికి హ్రస్వంబు విభాషవగు**

లెస్సగాను, లెస్సగను, న్యాయ్యముగాను, న్యాయ్యముగను

ఇట సరళంబు నిత్యంబు, చూడగాను, చూడగను, చూడను ఇట వ్యత్వంబులేదు

ఈ నుజ్యంతమయిన అగు ధాతువు = కాను-అనునది ఇది క్రియా విశేషణముల కను ప్రయుక్తమగును నుజ్యంతధాతువునకు వికల్పముగానగును కాను-అను దానికి హ్రస్వము వికల్పముగానగును. లెస్స + కాను = లెస్సగాను. చూడన్ + కాను- (నుజ్యంత ధాతువు చూడన్_అన్నది ) చూడగాను. ఇటనున్న మతమునకు వ్యత్వములేదు. చూడనుగాను-అనికాదు

**సూ-117. ఉన్న. కల నవర్ణకంబుల మీది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు**

బహుళకంబుచే నిట సంధి నిత్యంబు

వండుచున్నవాడు - వండుచున్నాఁడు - వండుచున్నవారు - వండుచున్నారు వండుచున్నవాడవు - వండుచున్నాడవు వండుచున్నవారరు - వండుచున్నారరు, వండుచున్నవాఁడను-వండుచున్నాఁడను వండుచున్నవారము-వండుచున్నారము ఇట్లు వండ గలవాడు, వండగలాఁడు,వండినవాడు వండినాడు ఇత్యాదు లెఱుంగునది

గు ఉన్న, కల, వర్తకముల మీద నున్న తచ్ఛబ్దవకారము.వాడు అన్నదానిలోని వకారమునకు వికల్పముగా లోపమువచ్చును అత్తునకు సంధి బహుళముగానగు, అని బహుళ గ్రహణముచే ఉన్న + వాడు - వకార లోపమురాగా - ఉన్న + అడు = ఉన్నాడు - అని నిత్యముగా అగును

వ్యవహారములో 1 వండినాడు 2 వండినారు 3 వండినావు 4. వండినారు 6 వండినాను 6 వండినాము అను ఆరును ఉన్నవి కాని ఇందు 1, 2, 4లు మాత్రమె వ్యాకరణముచే సాధ్యములు కాని 3, 5, 6లు అసాధ్యములు. ఇవియైనను క్రియాపదములకు మారుగా వాడబడుచున్న నుబంత విశేషణముచే కాని క్రియా పదములు కావు వీనికి కారక క్రియలని వాడుక కలదు

**సూ. 18 దాత్వాదులకు ధాతువులను ప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు వాఁబడు**

మారుమండు, విరుచుండు, పరుండు, పన్నుండు, ఆఁగాను, ఈకొను, ఈయకొను ఇయ్యకొను, రక్కొను, త్రెక్కొను, మేకొను, మయికొను, మేలుకొను, మేలుకను, మేలుకాంచు, అలవడు, విరుపడు చొప్పడు, వెలవడు, తలపోయు, వాసపోయు, అపోవు, కొంపోవు, కొనిపోవు, విజయం చేయు, తయివ్రాలు, తూకొడుచు ఇత్యాదులు శబ్దపల్లవంబులు

గు ధాత్వాదులకు - ధాతువులకుగాని నామవాచకములకు గాని, ధాతువు లను ప్రయుక్తములై విలక్షణమైన అర్థమును చెప్పునవియగును. ఇవి శబ్దపల్లవము లనబడును కూరుచు + ఉండు = కూర్చుండు మేలు + కొను = మేలుకొను కొన్ని నమమైన అర్థము నిచ్చునవియు ఉన్నవి నిద్ర + పోవు = నిద్రపోవు = నిద్రించు - అన్నది విలక్షణము కాదు కదా.

**సూ-119. చేదర్థ యోగంబున లృట్టునకు లిట్టగు.**

ఆ ఋషీశ్వరుండు వచ్చెనా ఫలించు గార్యముల్

వాడు రేపు వచ్చెనేని నీవు కార్యంబు బొరకొనుము.

గు చేదర్థము = అయినచో అన్నది ఆ అర్థమున్నపుడు భవిష్యత్తునకు భూతము ప్రయోగింపబడు రాగలదేని - అనుటకు బదులు వచ్చెనేని - అని కాలికమైన లిట్టువాడబడినది

**సూ-120. ఆత్మార్థంబభిహితంబగుచో(దల్లింగవంఖ్యాభిధాయివచనంబు ధాతు విశేషణంబులగు.**

రాముడు రావణుంబరి మార్చి సీతయుందను సౌమిత్రి సహితంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబునకే తెంచె

**సూ-121 అగతికంబులగు ధ్వాదుల కిందు యోగంబు లేదు**

భూ, స్న, శ్న, రేక్న, లోక్న, లోచ, పచి, లప ఇత్యాదులకు గతి పరహితంబులగు ధాతువులకీ భాషం బ్రయోగంబు లేదు.

ప్ర, పరా, అప, సం అను, అవ నిస్, నిర్, దుస్, దుర్, వి ఆజ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్ అభి ప్రతి, పరి, ఉప, ఊరీ ప్రభృతులను సాక్షాత్ప్రభృతులను, గతి సంజ్ఞాకంబులు

ప్రాపువిరువది రెండును పవర్గంబులనాబడు.

ప్రభవించు, ఆవిర్భవించు, ప్రసరించు, సంస్కరించు, తిర్యక్కరించు, సాక్షాత్కరించు అతి రేకించు, అలోకించు, ఆలోచించు, ప్రపంచించు ప్రలపించు, ఇత్యాదు లార్యప్రయోగంబుల నెఱుంగునది.

గు. ప్రాదులకు క్రియతో కలిసినపుడు ఉపసర్గలని- గతి అనిపేరు అగతికములనగా ఉపసర్గలతో కలియని భూ + ఆదులు = భ్వాదులు - భూ. మున్నగు ధాతువులు వాటికి ఈ భాషలో ప్రవేశము లేదు ప్రభవించు మున్నగు - రూపములుకొన్ని ఉపసర్గలు లేనివైనను ఆర్య ప్రయోగములు మున్నందున గ్రాహ్యములు

సూ-122 వలయ్యాది క్రియలకుం గర్తయగు ధాతువునందు నుఁజీయగు.

వలయ్యాది క్రియలకుం గర్తృ భూతక్రియా వృత్తియగు ధాతువునకు నుఁజీ వర్ణకంబగు.

వాఁడు చూడవలయు, వారలు చూడ గావలయు నీవు చూడవలయు. మీరు చూడవలయు నేను జూడవలయు, మేము చూడవలయు, మనము చూడవలయు

వలయును- వలదు, కూడును, కూడదు, చెల్లును-చెల్లదు, తగును-తగదు ఇత్యాదులు వలయ్యాదులు

సకర్మంబునకు స్వరూప ప్రేరణార్థంబులు రెండును, గానుపద్వసుబందంబులందొక్కొక్కటితోడ, రెంటితోడం గూడుకోనగునవి యాఱుం గూడ రూపంబు లెనిమిదయ్యె వాని సొరిది నుదాహరించెద

1. కర్త్రర్థకము మైత్రుఁడు వంటకమును వండెను

2. ఆత్మనేపద కర్త్రర్థకము మైత్రుఁడు వంటకమును వండుకొనియెను.

3 కర్మార్థకము : మైత్రునిచేత వంటకము వండఁబడియెను

4. ఆత్మనేపద కర్మార్థకము . మైత్రునిచేత వంటకము వండుకొనఁబడియెను

5. ప్రేరణ కర్త్రర్థకము : చైత్రుఁడు మైత్రునిచేత వంటకము వండించెను.

6 ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము. చైత్రుఁడు మైత్రునిచేత వంటకము వండించుకొనెను

7 ప్రేరణకర్మార్థకము చైత్రునిచేత, మైత్రునిచేత వంటకము వండింపబడియెను

8 ప్రేరణాత్మనేపద కర్మార్థకము చైత్రునిచేత, మైత్రునిచేత వంటకము వండించుకొనఁబడియెను

గు వాఁడు చూడవలయును — అనగా వాడు చూడన్=చూచుట, వలయున్=ఆవశ్యకమగును అని సమన్వయము

కర్తృభూతక్రియ=చూచుట అమనది దానికి నుఱి వచ్చిన రూపము చూడన్=చూచుట అని అర్థము కావుననే వాడు వారు మొదలగునవి మారినను యిది మారలేదు

**సూ-123. గతిబుద్ధి ప్రత్యవసానార్థ శబ్ద కర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మయగు.**

పొందు మొదలయినవి గత్యర్థకంబులు తెలియు మొదలయినవి బుద్ధ్యర్థకంబులు. తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు విను, చెప్పు చదువు మొదలయినవి శబ్దకర్మంబులు అకర్మంబులు ప్రసిద్ధంబులు. మైత్రుండు గ్రామంబుం బొంచెను చైత్రుఁడు మైత్రుని గ్రామంబుం బొందించెను లాతిచో సహిత మిక్కార్యంబు గానంబడియెడి.

మైత్రుండు పుడమి నేలెను చైత్రుఁడు మైత్రునిం బుడమి నేలించెను

గు. గత్యాద్యర్థకంబులు- అనగా గమనము, పొందుట, బుద్ధి తిను, విను, చెప్పు, చదువు మున్నగు సకర్మంబులకు, అకర్మములకును అప్రేర

ణమున కర్తయైనది ప్రేరణమున కర్మయగు నను ఉదాహరణమున అప్రే
ణార్థమున మైత్రుడు కర్త ప్రేరణార్థమున మైత్రుని అని కర్మ అయ్యెను
ఈ ధాతువులకేకాక తక్కిన వాటికిని ఇట్లగునని ఉదాహరించినారు
అందులోను అప్రేరణమున కర్తయైన మైత్రుడు ప్రేరణమున కర్మ
యైనాడు

**సూ-124 అనహిత కర్తకాకానొకచో షష్ఠి బహు
ళంబుగానగు**

రాముడు మిథిలం గనియె-రామునకు మిథిల గనంబడియె
రామునిచే మిథిల గనంబడియెను

మైత్రుండు తత్త్వంబు దెలిపెను - చైత్రుండు మైత్రునకుం
దత్త్వంబు దెలిపెను కన్వాది యోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి
వికల్పంబుగానగు.

విశ్వామిత్రుడు రామునకు మిథిలం గానిపించెను. కృష్ణుండర్జునునకు
విశ్వరూపంబుం జూపెను

అకర్మంబున క్రప్రేరణంబునం దాత్మనేపద కర్మానుబంధంబులు
లేమింజేసి రూపభేదంబు లయిదని యెఱుంగునది.

1. కర్త్రర్థకము . మైత్రుండు మనియెను

2 ప్రేరణ కర్త్రర్థకము చైత్రుండు మైత్రుని మనిపెను

3 ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము చైత్రుండు మైత్రుని మనుపు
కొనియెను

4 ప్రేరణ కర్మార్థకము చైత్రునిచేత మైత్రుండు మనుప
బడియె.

5. ప్రేరణాత్మనేపద కర్మార్థకము చైత్రునిచేత మైత్రుండు
మనుపుకొనఁబడియె.

వెండియుఁ బ్రేరణంబునందించుగాగమంబు గలిగినచో సకర్మంబు నకుం బండ్రెండు, సకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహిం చునది

ణు క్రియచే కర్త చెప్పబడినచో ప్రథమ వచ్చును. రాముడు మిథిలంగనియె అన్నదానిలో కర్తయైన రాముడు ప్రథమలో నున్నది. అనభిహితమైనచో చెప్పబడనిచో రామునకు మిథిల కనంబడియె అని రామునకు అని షష్ఠి వచ్చినది

కను మొదలైన క్రియలకు ప్రయోజ్యమైన కర్తకు షష్ఠి వికల్పముగా వచ్చును

విశ్వామిత్రుడు రామునకు మిథిలం గాంపించెను - అను దానిలో రామునకు అని షష్ఠి వచ్చినది ఇట్టిచోట్ల ప్రథమ రాదు.

ఒక్కొక క్రియా రూపములు క్రమముగా విడ చూపబడినవి. సకర్మక క్రియారూపములు 122 సూత్రము వద్ద చూపబడినవి వాని జాపుది కక్కడ సంబంధము లేదు ఆ పట్టిక కూడ ఇక్కడనే యిచ్చిన సరిపోయెడిదని రమణీయమున శ్రీ దువ్వూరివారు వ్రాసిరి

ఇది క్రియా పరిచ్ఛేదము

...0...

# కృదంత పరిచ్ఛేదము

**సూ-1 కృత్తుల కర్థంబులు యథా వ్యవహారంబుగ గ్రాహ్యంబులు**

ధాతువునకు విహితంబగు దుష్ప్రన్న ప్రత్యయంబులు కృత్తునాఁబడు కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృ కర్మాద్యర్థంబులు మహాజన వ్యవహారానుసారిగా నెరుంగునది

అఁక=బంధనము మొలక=నవోద్భేదము ఏలిక=పాలకుడు కోరిక=వాంఛయు, వాంఛితంబును మూఁక=సంఘము అడిక=నింద ఓడిక=స్రోతస్సు

గు అఁక=భావార్థము మొలక=కర్త్రర్థము ఏలిక=కర్త్రర్థము కోరిక=భావ, కర్మార్థములు మూఁక=కర్త్రర్థము. అడిక=భావకర్మార్థములు. ఓడిక=ప్రవాహము-కర్త్రర్థము.

కృదంత పరిచ్ఛేదమునకూడ ధాతువునకు' అను సూత్రము అనువర్తించును

సమాపక క్రియలకు వచ్చు డు-రు, వు-రు, ను-ము' అను ఆరును తప్ప ధాతువునకు చేరు ప్రత్యయములన్నియు కృత్తులనబడును

అట్లు వందు+ట=వండుట, వందు+మి=వండమి, వండు,ఇ=వండి వండు+క=వండక, నుఅజీ-వండన్, నన్-వండినన్, డున్,వండుడున్, చున్,వండుచున్, ఎడి-వండెడి, ఎడు-వండెడు, ఉన్న,వండుచున్న, కలజీ-వండఁగల, న-వండిన, విజీ-వండని-అవి క్రియా పరిచ్ఛేదమున చెప్పిన 14ను కృత్తులే. ఇవి అన్నిధాతువులకు వచ్చును కృదంత పరిచ్ఛేదమున చెప్పెడు 'క వర్ణకాదులు కొన్నిటికి మాత్రమే చేరును వీటిలో ఒక్కొక్కదానికి అనేకార్థంబులుండుట, ఒకే అర్థములో చాల ప్రత్యయ

ముఖవచ్చుట-గా ఉండుటవలన యథా వ్యవహారంబుగ గ్రాహ్యంబులని చెప్పినాఁడు

**సూ-౨ ఇటంగ్కృత్క్కగ తపవేములు పరంబులగునపుడు క,గ,చ య, వలకు లోపంబగు**

కృత్సంబంధులగు కాదలు పరంబులగునపుడు ధాతుపునంతంబులగు లోపంబగు మీఁది లక్ష్యంబులం జూడందగు.

గు కృత్ప్రత్యయముల్లైన క, గ, త, ప వ, ఇమి' అనువానిలో ఏది పరమైనను ధాతుపుచివరఁ ఉన్న క, గ, చ, య, వ'లలో ఏదైనను లోపించును

బ్రదుకు+ఇమి= బ్రదిమి-కలోపము, కలుగు+ఇమి=కలిమి-గలోపము, కూరుచు+ఇమి=కూరిమి-చలోపము, మూయు+తజ్=మూత-యలోపము, పోవు+కి=పోకి-వలోపము.

మొత్తము కృత్ప్రత్యయములలో ఏవివచ్చిన ఏవి లోపించిను తెలియుటకై పట్టిక.

పరమగు కృత్తులు - లోపించెడి వర్ణములు

క- } క, - గ, చ, వ
 } కువ - గ,య,చ

వ } వడి — చ
 } వి — య
 } వు —

గి — గత — గ, చ

త } త — చ
 } తజ్ — య

ఇవి-ఇమి - గ, చ. య, క.

వ } వ - య
 } వు - య, చ

సూ-౩. కవర్గకంబులు గ్వాదులగు

అలుగు-అలుక, అగు-అక, ఎఱుఁగు-ఎఱుక.

ఇట బిందులోపంబు ఇట్లు కొన్నింట గ్రహింపునది

కదఁగు-కదఁక. కలఁగు-కలఁక. కాఁగు-కాక. తునుఁగు-తునుక

నడచు-నడక నలఁగు-నలక పోవు-పోక. మఱఁగు-మఱక

మఱఁగు-మఱఁక మనుఁగు-మనుక మూఁగు-మూక మొలచు-మొలక

వచ్చునదు-రా రాక వంగు-వంక వీఁగు-వీక

ఇక క, పుఁపరంబులగునపుడు కమునకు దీర్ఘంబగు వానుక

కినియు ముదియు లకుకత్వం బగు-కినియు-కినుక ముదియు-ముసక

ఇత్యాదుల యగ్వాదు

## సూ-4. ఇమివర్ణకంబు కలుగ్వాదులకగు

కలుగు-కలిమి, ఓరుచు-ఓరిమి కూరుచు-కూరిమి నేరుచు-నేరిమి

ప్రేలుచు-ప్రేలిమి బడియు బడిమి బ్రదుకు-బ్రదిమి ఒడ్డు-ఒడ్డిమి తేలు-తేలిమి

## సూ-5 తక్ వర్ణకంబు చేయ్వాదులకగు.

చేయు-చేత అలయు-అలత. కూయు-కూఁత కోయు-కోత

గీయు-గీత నేయు-నేత పూయు పూఁత పోయు-పోత మూయు-మూత

పేయు-పేత మ్రోయు-మ్రోత రోయు-రోత లాయు-లాత వ్రాయు-వ్రాఁత వ్రేయు-వ్రేఁత

గి. తక్ వర్ణకము జేల్తు కాన బిందు వ్యాప్తమగును అనగా వానికి ముంపు అరనున్న ఉండును

## సూ-6 కువర్ణకంబడంగ్వాదులకగు

అడఁగు-అడఁకువ ఎఱుఁగు-ఎఱుకువ కలఁగు-కలఁకువ నలఁగు-నలఁకువ పెనఁగు-పెనకువ. పొలఁగు-పొలకువ మఱచు-మఱకువ

మెలఁగు-మెలకువ లోఁగు-లోకువ వేఁగు-వేకువ

## సూ-7 టవర్ణకం బాడ్వాదులకగు నగుచో నంతలోపంబగు.

ఆడు-ఆట. ఊరు-ఊట, ఊఱుడు-ఊఱుట పేకరు-పేకట, ఓడు-ఓట, తివురు-తివుట, తేరు-తేట, త్రిమ్మరు-త్రిమ్మట, వండు-వంట, పాడు-పాట, మండు-మంట, పండు-పంట, వేసఱు-వేసట

అను ప్రయుక్తంబగు అటశబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీనసమంబగు కోలాటము పోరాటము, మంత్రాటము ఇత్యాదులు.

గు ఈటవర్ణకమునకు క్రియావరిచ్ఛేదము చెప్పబడిన టవర్ణకముకును భేదమున్నది ఈటప్రత్యయము భావకర్తృకర్మార్థములు మూడింటను వచ్చును. కొద్ది ధాతువులకేవచ్చును ఇది పరమైనపుడు చివరి అక్షరము లోపించును ఆడు-ఆట. అట ప్రత్యయము పరమైనపుడు చివరి అక్షరము లోపించదు భావార్థమున మాత్రమేవచ్చును. అన్ని ధాతువులకు వచ్చును ఆడు+ట=ఆడుట-ఇత్యాది ఈ రెండు టవర్ణకముల అర్థమును వ్యవహారమున గుర్తింపవగును.

ఆట-క్రీడ ఆడుట-క్రీడించుట పాడుట- పాటపాడుట- పాట - గీతము

వండుట- వంటచేయుట— వంట- చేయుక్రియ ఇత్యాది

**సూ-౧౦ టువర్ణకంబు పడ్వాదులకగు నగుచోనవి యాద్యక్షర శేషంబులయి దీర్ఘంబునుందు.**

పడు-పాటు, చెడు-చేటు అడుచు-ఆటు, కఱచు-కాటు, పొడుచు-పోటు, వయచు-వాటు, ఏయు-ఏటు, ఓడు-ఓటు, ప్రేయు-ప్రేటు

గు టువర్ణకము పరమైనపుడు ధాతువులోని మొదటి అక్షరము మాత్రమే మిగిలి, దానికి దీర్ఘమగును. పడు+టు=ప మిగులగా, దీర్ఘము రాగా-పాటు అగును.

**సూ-౧౧. పవర్ణకంబు తిరియ్యాదులకగు**

తిరియు-తిరిపము కలియుటకర్త్వంబునగు-కలపము, పొలయు-పొలపము మురియు-మురిపము, సొలయు—సొలపము, వలియు-వలిపము,

### సూ-10. తవర్ణకంబామలించు లోనగు వానికగు

అవులించు-అవులింత, ఇగిలించు-ఇగిలింత, ఓకిలించు—ఓకిలింత కుళ్లగించు-కుళ్లగింత కుసివించు-కుసిలింత, కొక్కరించు-కొక్కరింత కొప్పరించు-కొప్పరింత, గిలిగించు—గిలిగింత ఇత్యాదు లెరుంగునది

### సూ-11 పువర్ణకంబు మాయ్యాదులకగు

మాయు-మాపు, పేయు-పేపు, అడుసు-అడుపు, ఇంచు-ఇంపు ఏఁచు-ఏపు, ఏచు-ఏపు, కను-కానుపు, కాచు కాపు, చూచు-చూపు, తలచు-తలఁపు, తోఁచు-తోఁపు, త్రేచు-త్రేపు, త్రోచు-త్రోఁపు పూచు-పూపు, పెనుచు-పెనుపు పొలుచు పొలుపు, ప్రోచు-ప్రోపు మెచ్చు-మెప్పు మోచు-మోపు, వలచు-వలపు, వాచు-వాపు, ఇత్యాదులు మాయ్యాదులు.

### సూ-12 ఇకవర్ణకంబంజ్వాదులకగు.

అంజు-అంజిక, అమరు-అమరిక, అరయు - అరయిక అలయు-అలియిక, అడు_అడిక, ఒడు-ఒడిక ఒపు-ఓపిక, కను,కానిక కూడు,కూడిక కోరు, కోరిక పొందు-పొందిక, పోలు, పోలిక.

తూను తూ గునకగు. తూఁగు,తూనిక, ఇత్యాదు లంజ్వాదులు

### సూ-13 అప్పాదులకు నబియగు

అప్ప,అప్పన, ఒజ్జ ఒజ్జన, ఒప్ప ఒప్పన, గట్టు,గట్టున, గద గదన దట్టు,దట్టన. దీవ,దీవన, పాట,పాటన, మన్న మన్నన, వీచు,వీవన

### సూ-14 బడి యే ల్వాదులకగు

ఏలుబడి, కట్టుబడి, కనుబడి, కానుబడి, గిట్టుబడి, చెల్లుబడి, చేరుబడి, తగులుబడి, తీరుబడి, పెట్టుబడి, పోబడి మ్రొక్కుపడి, వచ్చుబడి, సాగుబడి.

గు వచ్చుబడికి రాబడి అని పాఠాంతరమున్నది

### సూ-15. గడచేర్వాదులకగు.

చేరుగడ, తిరుగడ, తీరుగడ, తేరుగడ త్రేగవ, మనుగడ, విడుగడ వీడుగడ.

సూ-16. ఇకికోర్వాదులకగు

కోరికి, పూనికి, పోలికి, మనికి, వినికి. చూడు చూచునకగు. చూడికి.

సూ-17. మవర్ణకంబు మన్వాదులకగు

మను—మనువు కాచు—కావు కొలుచు-కొలువు చప్పు-వావు తడయు-తడవు నిలుచు-నిలువు నొచ్చు-నోవు పూచు-పూవు ప్రుచ్చు-ప్రువ్వు

గు చప్పు+వు=వావు+వు=వావు నొచ్చు+వు=నోవు+వు=నోవు.

సూ-18 అవర్ణకంబు గీఱ్వాదులకగు.

గీఱ, ఊఁద, ఎండ, కాయ, చదియ, తునియ, పరియ, పాయ, పిడుచ, మీట, ముడియ, వదర, వ్రయ్య

సూ-19. అకవర్ణకంబు మాఱ్వాదులకగు

మాఱు—మాఱకము అమ్ము - అమ్మకము అంపు - అంపకము పంచు-పంపు-పంపకము వండు-దకారంబు టకారంబగు వంటకము. తోము-తోమకము. అద్దు-అద్దకము.

గు ఇందు పంచు-చకారమునకు పకారాదేశము చెప్పబడినది

సూ-20 డువర్ణకంబాఱ్వాదులకగునగునపుడు పకారంబు చయులకగు.

ఆఱు—ఆఱు , అమ్ము-అమ్ముడు, అల్లు — అల్లుడు, ఎక్కు-ఎక్కుడు, క్రొమ్ము-క్రొమ్ముడు చోపు-చోపుడు, త్రొక్కు-త్రొక్కుడు త్రోచు-త్రోపుడు. దంచు-దంపుడు, వాఁచు-వాఁపుడు, దిగు-దిగుడు, దోఁచు-

వో పుదు, పెంచు-పెంపుదు, ప్రేఁచు-ప్రేపుదు, ప్రాఁకు-ప్రాఁపుదు, మాయు-మాపుదు, రాచు—రాపుదు ఇత్యాదులు.

గు. అఱు మున్నగువానికి దు ప్రత్యయము వచ్చును. అది వర మైనపుడు చ, య లకు పకారము వచ్చును దంచు_దంపుదు, మాయు—మాపుదు మూలమున ప్రేఁచు అనునది లేదు. దానిని గురించి రమణీయ మున చర్చించి, చివరకు వ్రేఁచు-వ్రేఁపుదు అని చివర చేర్చుట మంచిదని సూచించినారు.

**సూ-21 ఉపసర్గకంబులుకాచులకగు**

అదుకు, అంటు, ఒప్పు, ఒఱగు, ఒనఁగు.

**సూ-22. వడి ప్రభృతు లిట్లెఱుగునది**

వడి—కొలఁవడి, గెలువడి, నడవడి, వ్యతిరేకంబున-లేవడి

వి తవివి, తెలివి, విరివి. అవు-తగవు, వగవు, ఉఱవు ఇ-చేయి వ్రాయి. కలి—కనుకలి, వినుకలి ఇత్యాదులు మహాజన వ్యవహారంబుల నెఱుంగునది

గ. అర్థ వ్యవహారముల పరికించి, ఏ ప్రత్యయము లేయర్థమున వాడబడినవో గుర్తించదగునని వ్యాకర్త సూరి చెప్పియున్నాడు

ఇది కృదంత పరిచ్ఛేదము

—o—

# ప్రకీర్ణక పరిచ్ఛేదము

**సూ-1. పదాద్యంబులు ఋౠ వర్ణంబులు రల తుల్యంబులు**

అతడు ఋషి— ఇట సంధిలేదు ఆ ఋషి— ఇట యడాగమము లేదు. వచ్చె ఋషి, వచ్చెన్ ఋషి, వచ్చెను ఋషి ఇట ద్రుతమునకు లోప సంశ్లేషస్వత్వములు

ఈ పదము మొదటనున్న ఋ-ౠ అను అక్షరములు ర—ల వంటివి అచ్చులైనను ర—ల హల్లులవలెనే అగును సంధి లేకపోవుట, లోపసంశ్లేషస్వత్వములును హల్లు పరమగునపుడు జరిగెడివే ౠవర్ణమాదియందు కల పదములు తెనుగులో లేనందున ఉదాహరింపలేదు.

**సూ-2 అచ్ఛిక పదంబులందుత్తమంబులగు రు లు రు—ల ముందటి యేత్వంబునకు హ్రస్వంబు విభాషనగు.**

నల్లేరు—నల్లెరు, పల్లేరు—పల్లెరు, పెన్నేరు-పెన్నెరు, మానేరు-మానెరు, ఆదేలు—ఆదెలు, కుందేలు-కుందెలు, తోదేలు-తోదెలు, నాగేలు-నాగెలు, నేరేదు—నేరెదు, మారేదు—మారెదు, పూరేదు—పూరెదు, తంగేదు-తంగెదు

ఈ అచ్చ తెనుగు పదములలో చివరి యక్షరమునకు రు.లు,డు లైన దానికి ముందు దీర్ఘమున్న దానికి హ్రస్వము వచ్చును నల్లేరు-నల్లెరు తంగేదు-తంగెదు‘ ‘తంగెటి జున్ను గృహమేది’ మను

**సూ-3 ఊష్మేల వయ్యేదతాయెతులం ద్రిక్క నామంబులందు యాకుందులవ్యవకయోగంబు లేదు.**

వృష్టము

మె, యేల పయిని చెప్పిన మూడు పదములందే తప్ప ఇంకే తెనుగు శబ్దమందును లేవు పోయెను అను క్రియలలో ఉండ వచ్చును అందుకే నామంబులందు' అని సూత్రించినాడు.

**సూ-4 ఊయేల యూయాలల చాఁపుల నొండొంటికిం గుఱుచయొందెనగు**

ఉయేల, ఊయెల, ఊయేల, ఉయాల, ఊయల, ఊయాల

పక్ష్యమాణంబు యద్విత్వంబు ఉయ్యేల, ఉయ్యెల, ఉయ్యాల, ఉయ్యల

గు చాపు=దీర్ఘమునకు హ్రస్వము వికల్పముగాను ప్రకీర్ణ 6చే ద్విత్వము కలుగును

**సూ-5 పయ్యెద పయ్యద**

గు పయ్యెద శబ్దమునకు రూపాంతరము పయ్యద

**సూ-6 ఊయేలాదులందొలి యచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనంబొందెనగు.**

ఉయ్యేల-ఊయేల

ఊమేల, ఊయెల, ఊయాల ఊయల, ఆమె, ఏవిధము, ఓయ, ఓయారము కోపు (ధనురగ్రము) జాజర, తీరియ, తీయము, తేప (ప్లవము), తేమ తోయరి, దీవియ నూపు, రోవి నోవు పూవు, పేయ, మోక (అంకురము), మోటిక, మోవు, వీయము—ఇత్యాద లూమే లాదులు

గు పై యుదాహరణము లన్నిటికి ద్విర్వచన హ్రస్వములగును తేప-తెప్ప పూవు-పువ్వు ఇత్యాది

**సూ-7 అకారంబు క్రింది అకారంబునకుందు దినులుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగనగు**

| | | |
|---|---|---|
| అట్టు-అటు | కన్ను-కను | పల్లు-పలు |
| గొట్టియ—గొటియ | నన్ను-నను | విల్లు-విలు |

గు చివర ఉన్న న్న, లు-ల క్రింది నలలును, చివరనున్నను, మధ్యమందున్నను అ క్రింది అకును లోపము వికల్పముగా అగను అఱ అనుచో చివరి అక్షరమైనను, అకారము లోపించునని రెండుదాహరణలు నలలు చివరివె అని ఉదాహరణములు స్పష్టము

సూ-8. అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు

అకట-అక్కట

అక్కట, అట్టిక, ఒట్టుక, అప్టె అయ్యారె, అయ్యో, అవ్వారి, ఇట్టిక, ఉప్పెపడము, ఒయ్య ఎక్కసక్కెయము ఎక్కసెక్కెయము, ఎక్కిరింత, ఎడ్డ, ఎన్నిక, ఎమ్మిక, కణ్ణాయము కట్టా, కట్టెక కిప్పరము, కమ్మటము, కమ్మతము, కువ్వాడము కొట్టిక, కొమ్మ, కొయ్యగూర, గయ్యాళము, గెజ్జగాడు బెజ్జరాతి, చిట్టి, చిన్న, చిమ్మట, చెన్న టి, చెప్పుము, చెప్పుడు, చెమ్మట, చెల్లియలు, జవ్వాది, జాబిల్లి, తమ్మటము, తమ్ములము, తల్లి, తుమ్మిక, తుప్పర, తెల్లి, దప్పి, దివ్వియ, నవ్వు, నిద్దుర, నివ్వెరి, నివ్వాళి, నువ్వు, నెట్టిక, నెమ్మది, పవ్వళించు, పిన్న పుల్లియ, పువ్వు, పెద్ద పొట్టి, ప్రాకెన్న, బెగ్గడ, బెగ్గడు, బొమ్మ, బొమ్మికము, బొమ్మిడికము, బొమ్మిడీకము మజ్జ మత్తాబు, మల్లారము, ముక్కు, ముద్దియ, మెట్టిక, మొక్కరము మొగరము, మొల్లాము, రడ్డి, లొట్టిపిట్ట, వటి, వయ్యాళి సన్నియ సప్పడి సివ్వంగి అట్టు ఇట్టు ఎట్టు అప్పుడు ఇప్పుడు ఎప్పుడు అన్ని ఇన్ని ఎన్ని కొన్ని మమ్ము మిమ్ము తమ్ము అమ్మ అక్క అవ్వ అయ్య అప్ప అచ్చోటు ఇచ్చోటు ఎచ్చోటు అచ్చటు యిచ్చటు ఎచ్చటు యిత్యాదు లక్కటాదులు.

గు. జడ్డ=ద్విత్వము

సూ-9. జడ్డక్కరంబుతోఁబడాది వ్వరఁబుగూడుచో జడ్డుకు లోపంబు లేదు

అత్తత్తె, కన్నదనె, నన్నడిగె, ఎల్లొత్తె, విల్లందె.

గీ. ద్విత్వాక్షరముతో పరము మొదటనున్న అచ్చు కలిసినచో ద్విత్వలోపము రాదు

కన్ను+అదరె=కన్నదరె

**సూ-1 . హాదులయు నీలుగులోనగు వాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగనగు**

హాదపము—అదపము హరిదళము—అరిదళము హాలంది-అలంది నీలుగ-ఈలుగు నీలుగు, నెగయు, పొందు, పొనరు

పూను పొదవుల కాదిలోపంబొకండు వచియించె నశియ వివార మూలకంబు

గీ. హకారము మొదలనున్న పదములకు నీలుగు మున్నగు పదములకు తొలి హల్లు వికల్పముగా లోపించును హాదపములో హకారము లోపించగా అదపము అగును పూను-పొదవులకు ప్రథమాక్షరములు లోపించిన ఊను-ఒదవు అని యగును. పూను=పూనుకొను, కడగు పొదవు=ఆక్రమించు, వ్యాపించు, క్రమ్ము ఊను=మోపు, నాటు, అను ఒదవు=కలుగు, ఉపయోగించు అని అర్థభేదమున్నందున వీని మొదటి హల్లులు లోపించవు

**సూ-11 ఆరాటాదులం ప్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు**

ఆరాటము-ఆరటము

ఆరాటము, కక్కూఱితి కేళాహళి కౌమారుడు, కౌమారిత, గంబూరము, పెంపారము, బంగారము బేహారము, పీటతాటము సంతోషము

**సూ-12 ఓయారాదులందొలి దీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు**

ఓయారము-ఒయారము

ఓయారము కేళాకూళి కోలె గూడారము, గోరువంక (పక్షి), జోహారు, నిలుగు, పేఁడ, బేహారము (దీర్ఘమధ్యము) మాఱు, మూలుగు మోఱకు. పీటతాటము, పీడియము యిత్యాదులు.

గు పీటి మొదటి దీర్ఘమునకు హ్రస్వము వికల్పముగా నగును పేడకుపెంట అనియు వ్యవహారమున్నది

**సూ-13. అడంగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు.**

అడఁగు-అణఁగు

అడఁగు, కడఁగు, చిల్లాడము తగడము నాఁడెము, పోడి, మిడుఁగు వడకు, మిడుఁగుఱు యిత్యాదులడంగ్వాదులు.

గు వీని డకారమునకు ణకారము వికల్పము నాడెము-నాణెము, పోడి-పోణి యిత్యాది

**సూ-14 దక్కులోనగు వానిదాకు దకారంబు విభాషనగు**

దక్కు-దక్కు

దక్కు, దగ్గఱు దాఁగు దాకలి, దిగు, దిగ్గియ, దూయు దెంవము, దెవ్వరము, దెవ్వు, దొంగ దొప్ప యిత్యాదులు

**సూ-15 ఏతాదులకు మువర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు**

ఏతము-ఏతాము

ఏతము, కళ్ళెము, గాలము, గుడ్డము గోణము గోతము, ఊణము, జాంబము, జోతము, తణగము బొండ్లము మండము, లాతము, వీణము యిత్యాదులు.

**సూ-16 పదాంతంబులయి యవంయుక్తంబులయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు.**

ఇందు మరల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకు జూపబడెడు

ప్రూన్పడె, మినువడె, మిన్వడె, పత్తురువారు-పత్తుర్వారు కారు కొనియె-కార్కొనియె రాములు-రామూల్ వనములు-వనముల్

గు పదము చివరనున్నవి, సంయుక్తములు కాని ను ఱ రు-లు ఉకారమునకు వికల్పముగా లోపమగును సురులకు సాధారణముగా హల్లు పరమైనపుడే వచ్చునని చెప్పినాడు అందుచే లుకారమునకు హల్లు పరము గాలేకున్నను వచ్చినది ప్రూన్పడె అన్నదానికి ప్రూనుపడె అని రూపము లేదేమో ఉదాహరింపలేదు

**సూ- అచ్చికంబులందు మధ్యంబుల నలదరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు.**

కనుక-కన్క, కానుక-కాన్క చిలుక-చిల్క, కాలువ-కాల్వ అడుగు-అడ్గు, కడుపు-కడ్పు, పెరు-పెర్గు కూరుకు-కూర్కు

**సూ-18 లాతి యచ్చునకు నహిత మొకానొకచో నుడి నడుమ లోపంబు గానంబడియెడి**

కలికి-కల్కి, ములికి-ముల్కి, బుడిపి-బుడ్పి, పొలతి-పొల్తి

గు పైన చెప్పిన ఉకారమునకేకాక మరొక అచ్చునకు కూడ పద మధ్యమున లోపము వచ్చును కలికి - ఇకారము, పొలతి - అకారము.

**సూ-19. అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విషళానగు.**

అబ్బురము-అబ్రము

అబ్బురము, కప్పురము అప్పుడు, ఇప్పుడు ఎప్పుడు చప్పుడు నెత్తురు ఇత్యాదులు.

గు. కొన్ని అక్షరములున్నను లేనటులే పై హల్లుతో కలిసి వివిపిం

చును అట్టి అక్షరములుండియు లోపించినట్లే కనుక లోపముచెప్పబడినది
ముత్తియము-ముత్యము

**సూ-౨౦ చుకప్పరక రువర్ణకంబునకు ముందటి దు వర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాషనగు నగుచో దత్పూర్వంబు గురువుగాదు**

అమరుచు-అమ్రుచు ఎమరుచు—ఎమ్రుచు. పదురుచు—పద్రుచు.

గు చు పరమందున్న రు వర్ణకమునకు ముందున్న దుకారము యొక్క-ఉకారమునకు లోపము వికల్పముగా అగును అ ద్విత్వముకల్గినను తత్పూర్వ అక్షరము గురువు కాదు అమ్రుచు అనునపుడు అ-సంయుక్త పరకమైనను గురువుకాదు

**సూ-21. జూదాదుల దాకు జకారంబు విభాషనగు.**

జూదము జూజము

అవుదు, జవాది, జాది, జాదు, విరవాది.

**సూ-౨౨ నిందయందామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకు గిగీలగు.**

కుంభకర్ణుడు-గింభకర్ణుడు రావణుడు_గీవణుడు

గు నిందించుటలో రెండవసారి చెప్పబడిన పదము మొదటి అక్షరము హ్రస్వమైన గి' అనునదియు, దీర్ఘమైన గీ' అనునదియు ఆదేశమగును

**సూ-2౩ పాదంబునం బ్రథమ ద్వితీయాక్షరములు వళి ప్రాసంబులునాబడు**

గు పాదమున మొదటి అక్షరము వళి=యతియు, రెండవఅక్షరము ప్రాస అనబడును ఈ యతిప్రాస భేదములు అప్పకవీయము మున్నగు గ్రంథముల జూడనగును

**సూ-24 యవలు లఘ్వలఘువులు మైత్రింబొరయు రేఫంబులు పొరయవు.**

గు. యతి ప్రాసాదులలో లఘువులు అలఘువులైన యవల-లకు మైత్రియున్నది కాని ర, ఱ లకు మైత్రిలేదు.

**సూ-25 రేఫంబులు లఘ్వ లఘువులందక్కొంగల విశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు**

శ్రీస్తనాంచిత కస్తూరీ పంక సంకలితోరసే
పంకజాక్షాయ నాథాయ వేంకటేశాయ మంగళం

గు. తెనుగున రేఫశకటరేఫ (ర ఱ) వివేకము చాల కష్టము కాన ఆ విషయము మహాకవుల ప్రయోగములలో చూడదగినదని, ఇంకను ఏవైన విశేషములు తెలియగోరిన శిష్యజిజ్ఞాసువులు ఉద్గ్రంథ పరిశీలన చేయుట తద్వారా తెలిసికొనుట శ్రేయోదాయకమని చెప్పుచు, సూరి గ్రంథమును మంగళాంతకముగా ముగించినాడు

ఇది కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి విరచితమైన
గుప్తార్థప్రకాశిని యను బాలవ్యాకరణటీక ప్రకీర్ణక
పరిచ్ఛేదము సర్వము సంపూర్ణము.

శుభం భూయాత్!

శ్రీ

అకారానుక్రమణికాం సంవిధాస్యేఽహ ముత్తమాం
శ్రీమచ్చిన్నయ సూత్రాణాం సుఖబోధాయ కేవలం॥

సూ.. సంఖ్య.

ఆ

ఇ

ఈ

ఉ

ఋ



ఎ



ఏ

ఐ



ఒ



ఓ



ఔ

## క

కువర్ణకంబు పరంబగునపు ఉకార ఋకారంబులకు నగాగమంబగు
తత్సమ 28

కూతు శబ్దము ప్రథమైక వచనమునకు రువర్ణంబగు అచ్చిక 9

కృతప్రాస్వంబగు త్రికంబు మీఁది చోటు శబ్దంబు నోత్వంబున కత్వ హ్రస్వంబు - విభాషనగు సమాస 15

కృతోత్కంబగు సంస్కృత నామంబు సంబుద్ధి దుజ్ఞనకు లోపంబు విభాష నగు. తత్సమ 34

కృత్తుల కర్థంబులు యథా వ్యవహారంబుగ గ్రాహ్యంబులు కృదంత 1

కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల మువర్ణకంబులు పఞ్చవర్ణంబులగు సమాస 19

కొను ధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగానగు క్రియ 53

కొన్ని దుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణబిందుపూర్వక దకారంబునగు అచ్చిక 6

కొన్ని యెడల ద్రుతంబుమీఁది నకారంబు గానంబడియెడి
సంధి 21

కొఱకు, కయి- చతుర్థి తత్సమ 4

క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు సంధి 8

క్రియా పదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు
సంధి 6

క్రియా ఫలంబు కర్తృగామి యగుచోఁగొను ధాతువనుప్రయుక్తంబగు.
క్రియ 52

క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషంబునకుఁ గొన్నియెడల నుగాగమంబును గొన్ని యెడల మీఁది హల్లునకు ద్విత్వంబునగు
సంధి 38

జడంబు తృతీయా సప్తములకు తృతీయ బహుళంబుగానగు. కారక 22

జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగానగు కారక 24

జడ్డక్కారంబుతోఁ బదాది స్వరంబు గూడుచో జడ్డకు లోపంబులేదు ప్రకీర్ణక 9

జాదాదుల దాకు జకారంబు విభాషనగు. ప్రకీర్ణక 21

## ట

టవర్ణకం బాహ్వాదులకగు. నగుచో నంత లోపంబగు. కృదంత 7

ట వర్ణకము భావంబు నందగు క్రియా 35

టీ–తి వర్ణంబులు పరంబులగునపుడు త్వంబున కిత్వంబగు అచ్చిక 36

టి వర్ణంబు గొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కంతాగమంబును గొన్నింటి కింబర్యాయంబున రెండును బ్రాయికంబుగానగు అచ్చిక 31

టి వర్ణంబు పరమంబవపుడు క్రిందు-మీఁదుము–దువు వర్ణములకత్వంబగు. అచ్చిక 37

టువర్ణకంబు పద్వాదులకగు, వగుచో వవియాద్యక్షర శేషంబులయిదీర్ఘంబు నొందు. కృదంత 8

## డ

డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతంబన[illegible] తత్సమ 20

డుమంతంబునకు ద్వితీయాద్యేక వచనంబు పరంబగు[illegible]

సర్వత్ర విభాషనగు

డుమంతంబుమీఁది మువర్ణకం[illegible]బగు. తత్సమ 25

డుముపున లేకపచనంబులు.

య

ర



ల

శ



ష



స

